Devulapalli Krishna Sastry Sahitee Sowrabham
A study of the literarv Personality of Krishna Sastry

By

D., N. Nirmala Devi

సుధాంశ్ ప్రచురణలు
ప్రథమ ముద్రణ - 1985
ప్రతులు - 1000
ముద్రణ - శ్రీలక్ష్మి ప్రెస్
బషీర్‌బాగ్, హైద్రాబాద్.

వెల రూ॥ 25/-

ప్రతులు దొరుకు స్థలము

1. P. S. Rao
2-2-18-18-5/6,
Indraprastha Colony
Bagh Amberpet Hyderabad-13

2. Nirmaia Devi
A. M. S. Callege
O. U. Campus Vidyanagar
Hyderabad.

అంకితం

కృష్ణశాస్త్రిగారి ఆప్తులు - ఆత్మీయులు
మా తల్లిదండ్రులు

శ్రీమతి నిడమర్తి శారదాదేవి, అశ్వినీకుమార దత్తులకు

డా॥ నిర్మలదేవి ఎన్.

పద్మశ్రీ కళాప్రపూర్ణ
**డా॥ సి. నారాయణరెడ్డి**
ఎమ్. ఏ. పిహెచ్, డి; డి. లిట్,
అధ్యక్షులు
అధికార భాషా సంఘం
ఆంధ్ర ప్రదేశ్

## తొలిసుడి

కృష్ణశాస్త్రి ఒక గంధర్వగీతం. నిశ్వాస పారిజాతం. పదశిల్ప విరించి. పాటల పరమేశ్వరుడు. భావుకతా పట్టభద్రుడు. వేదనా మందాకిని.

క్షీణ ప్రబంధ ధోరణుల పులుముడుతో తొలివిలువలు తగ్గిన తెలుగు కవితకు వెలగల మలుపులు తిప్పినవారిలో కృష్ణశాస్త్రి ఒకరు. ఆయన స్పర్శతో గరికపువ్వు సురసుమమయ్యింది. ప్రాణం గానమయింది. పదం శిల్పమయింది. వలాహక ఘోష వాక్యంలో ఇమిడింది. సాగరం అక్షరంలోకి చొరబడింది.

కృష్ణశాస్త్రి వ్యక్తిత్వాన్ని. సాహిత్యాన్ని అద్భుతంగా, ఆప్తంగా దర్శించి విశ్లేషించిన గ్రంథమిది. లోగడ కృష్ణశాస్త్రి రచనలపైన పి. హెచ్.డి. చేసిన డా॥ నిర్మలాదేవి కృష్ణశాస్త్రి సాహితీ ప్రక్రియలపైన కొంత కుదింపుతో వ్రాసిన పుస్తకమిది. కృష్ణశాస్త్రి రచనలూ, అవి వెలువడిన కాలాలూ, వాటి మూల ప్రభావాలూ, కృష్ణశాస్త్రి గేయవచన నాటికా శిల్పాపై దగ్ధ్యం గురించి డా॥ నిర్మలాదేవి వేసిన బేరీజు, ఇచ్చిన కితాబు ప్రశంసనీయంగా ఉన్నాయి. కృష్ణశాస్త్రిపై ఇతరుల ప్రభావాన్ని వివేచించడంలో కొన్ని సరికొత్త అంశాలు గోచరిస్తున్నాయి. కృష్ణశాస్త్రి సాహిత్యాన్ని గూర్చి చెప్పాలంటే తన పేరు స్ఫురించేటంత ఉత్తమ స్థాయికి ఎదిగిపోయిన డా॥ నిర్మలాదేవికి నా అభినందన.

డా॥ సి. నారాయణ రెడ్డి

ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ
ఆంధ్ర శాఖ, పి. జి. నిజాం కళాశాల
ఉస్మానియా విశ్వవిద్యాలయం

## ఆశీస్సులు

చి. సౌ. నిర్మలాదేవి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి తెలుగులో ఎం.ఏ. పట్టాని పొందిన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. లిట్. పట్టా సంపాదించటానికి నా పర్యవేక్షణలోకి వచ్చింది. అంతవరకూ నేనామెను ఎరుగను. ఆ తరువాత ఆమె మొదట నన్నయ భారతంలోని ఉపాఖ్యానాలను గూర్చి సిద్ధాంత వ్యాసం వ్రాసి తెలుగులో ఎమ్. లిట్ పట్టాని సంపాదించింది. అట్లాగే అటు తరువాత కృష్ణశాస్త్రి రచనలూ, జీవితము, అనే విషయంమీద సిద్ధాంతవ్యాసం వ్రాసి పి.హెచ్.డి. పట్టాన్ని సంపాదించింది. ఈ రెండు పట్టాలను నా పర్యవేక్షణలోనే ఆమె సంపాదించడం, అందునా ఆమె నాదగ్గర మొదటి పరిశోధక విద్యార్థిని కావడం కారణంగా అనుబంధం తరువాతకూడా అట్లాగే సాగి వస్తున్నది. కనుకనే కృష్ణశాస్త్రి సాహిత్య సౌరభము" అనే ఈ గ్రంథానికి నన్ను పరిచయ కావ్యాలు వ్రాయమంటే అంగీకరించ వలసి వచ్చింది.

రచయిత్రి సిద్ధాంత వ్యాసం పూర్తిచేసి పట్టా నందుకొనే నాటికి కృష్ణశాస్త్రిగారు సజీవులుగా ఉన్నారు. విషయ సేకరణం కోసం ఆమె చాలాసార్లు కృష్ణశాస్త్రిగారిని స్వయంగా దర్శించింది. వారు రచయిత్రికి విషయ సేకరణలో చాలా తోడ్పడ్డారు. సిద్ధాంత వ్యాసం చాలా ఉత్తమ స్థాయిలో వున్నదని పరీక్షించిన ఆచార్యవర్యుల అభిప్రాయపడ్డారు. ఆ తరువాత గ్రంథాన్ని చూచి కృష్ణశాస్త్రిగారుకూడా ఎంతో ఆనందపడి రచయిత్రినాశీర్వదించారు.

వివిధ విశ్వవిద్యాలయాల్లో వందలాది మంది యీనాడు పరిశోధన పట్టాలకోసం కృషి చేస్తున్నారు. చాలమంది పట్టం సంపాదించగానే అంతతో తృప్తిపడి ఊరుకొంటున్నారు. అన్ని సిద్ధాంత వ్యాసాలు గ్రంథ రూపంలో రావడంలేదు. కొన్నిమాత్రమే ఆ భాగ్యానికి నోచుకుంటున్నాయి. ఆ వచ్చిన వన్నీ ఒకే స్థాయికి చెందినవనికూడా చెప్పలేము. కొన్నింటిలో పట్టా వచ్చిన చాలకాలం తరువాతగానీ అచ్చుకు నోచుకోకపోవడం వల్లా, ఈ మధ్యలో సిద్ధాంత వ్యాసంలోని నిరూపణలకు కాలదోషం పట్టడంవల్ల వాటికి ప్రామాణ్యం విషయంలో కొంత లోపం కానవస్తుంది.

చి॥ నిర్మల పరిశోధక పట్టంతో కృషినాపలేదు. ఎప్పటికప్పుడు కృష్ణశాస్త్రి గారిని గూర్చి వారి రచనలనుగూర్చి క్రొత్త క్రొత్త విషయాలనుగూర్చి తెలుసుకుంటూనే ఉన్నది. అందువల్లనే ఆమె కృష్ణశాస్త్రిగారిని యీనాడు సాధికారంగా వివరించగలుగుతున్నది.

కృష్ణశాస్త్రి మహాకవి అనే విషయంలో అభిప్రాయ భేదాలు లేవు. కాని ఆయన కవిత్వంలాగే ఆయనకూడా నిరంతరాధ్యయనం వల్లగానీ బోధపడడు. ఆయన సమగ్ర స్వరూపం అవగాహన కావాలంటే కృష్ణపక్షము ఊర్వశి చదివితే చాలదు. అన్ని రచనలనీ జాగ్రత్తగా చదవాలి. అంతేకాదు కృష్ణశాస్త్రి జీవిత విశేషాలను ఆ రచనలతో పోల్చి చూచుకోవాలి. అప్పుడయినా మరి కొంత వివరణమూ వ్యాఖ్యానమూ కావాలి. చి॥ నిర్మలాదేవి ప్రస్తుత రచన యీ కావలసిన సాధన సామాగ్రినంతటినీ పాఠకుల కందిస్తున్నది. కనుక కృష్ణశాస్త్రి రచనల నర్థంచేసుకోవడానికి యీ పుస్తకం చాలా తోడ్పడ గలదని నేను అభిప్రాయపడుతున్నాను.

కృష్ణశాస్త్రి అచ్చమయిన భావకవి. భావకవిత్వంలో వుండే సర్వ లక్షణాలూ వాక్కుచోటనే కృష్ణశాస్త్రిగారితో కనుపిస్తవి. ఆయన పద్యాలు గానీ గేయాలు గానీ వ్రాయడు. లలిత లలితములయిన పదాలతో భావాలకు రూపకల్పనం చేసి కవిత్వాన్ని మలుస్తాడు. వాటికి సువాసనా మాధుర్యమూ వుంటాయి. పాండిత్యం కంటే ప్రతిభ నవనవోన్మేషంగా భాసిస్తూంటుంది. కొన్నింటిలో స్వేచ్ఛా ప్రీతి, కొన్నింటిలో విరహ విషాదానిషా, కొన్నింటిలో ప్రకృతితోడి పార వశ్యం, కొన్నింటిలో వేదన, కొన్నింటిలో ఉరకలువేసే ఉత్సాహం, కొన్నింటిలో దేశభక్తి, కొన్నింటిలో సర్వమానవ సౌభ్రాతృత్వం మానవత మెడ మమకారం, అన్నింటిలోనూ ఆత్మాశ్రయత కృష్ణశాస్త్రి కావ్యాల్లో మనం గుర్తించే గుణాలు) అయితే యిదే కృష్ణశాస్త్రి సమగ్ర సాహిత్య రూపంకాదు. ఆయనలోని హావ్యప్రియత్వం, ప్రాచీన సాహితీ సమగ్రావగాహన, సహృద యత, సంభాషణచాతురి జీవిత వైఖరిని గూర్చి తెలుసుకోవాలంటే అయన యితర వచన రచనలనుగూడ చదువవలసి వుంటుంది.

ఆంధ్ర సాహిత్య చరిత్రలో వందలమంది కవులూ రచయితలూ ఉన్నారు. కాని కృష్ణశాస్త్రి కేవలం కవికాని కేవల రచయితకాని కాదు. కృష్ణశాస్త్రి ఒక గొప్ప ఉద్యమం. ఆయన జీవితాన్ని ఆయన రచనలనూ సరిగా అవగాహన చేసుకోవడానికి రచయిత్రి ప్రస్తుతం ప్రకటిస్తున్న ఈ పుస్తకం యెంతగానో వుపకరిస్తుంది. అయితే యీ పుస్తకం వ్రాయడంలో చూపిన శ్రద్ధ అచ్చువేయ డంలో రచయిత్రి చూపకపోవడం నాకు విచారకరంగా వున్నది. ఈ పుస్తకానికి మూలమయిన యీ రచయిత్రి సిద్ధాంత వ్యాసం అచిరకాలంలో ముద్రణ భాగ్యాన్ని పొందవలెనని అందులో అచ్చుతప్పులు యే మాత్రం దొర్లకుండా రచయిత్రి జాగ్రత్త పడవలెనని కోరుతున్నాను.

అమరేశం రాజేశ్వర శర్మ

10-2-1985

# ప్రశంసామోదం

కృష్ణశాస్త్రి సాహిత్య సౌరభం ఆఘ్రాణించగానే ఒక అర్థశతాబ్దం - ఏభైయేళ్ళు : వెనక్కినడిచింది జీవితం పరవశంతో.

నా మట్టుకు నేను చాలా అదృష్ట వంతుడిననుకుంటా : ఎందుకంటే తెలుగునాటయుగసంధిలో జన్మించాను, జ్ఞానం వచ్చి అభిరుచులు చిగురించే సమయంలో ఈ తెనుగు గడ్డ పై ఎడతెరిపి లేకుండా ఎన్నో ఉద్యమ ప్రభంజనాలు వీచడం ప్రారంభించాయి. తెలుగువారు ఆ కొత్త ఊహల్లతో, ఆవేశ పూరిత మనస్సులతో ఆ కొత్త వెలుగుల బాటలననుసరించారు. అనుభవించారు, చిన్మయానందం పొంది జీవితాలను నవ్యతతో నింపుకున్నారు.

జాతీయోద్యమం, సనాతనాన్ని తరిమి వేసిన బ్రహ్మ సమాజోద్యమం గ్రాంథిక భాషా కబంధ హస్తాలనుంచి తెనుగు సాహిత్యానికి భాషకి, భావనకి విముక్తి కలిగించే గిడుగు వారి వ్యావహారిక భాషోద్యమం, కృష్ణశాస్త్రిగారి నవ్యకవితోద్యమం, చలం ఉద్రూతలూరించే వచనరచనలు, శ్రీశ్రీ అధివాస్తవికతోద్యమం (సర్రియలిజమ్)- ఇలా తెలుగునాడులో చెలరేగాయి.

రాజమహేంద్రవరం, కాకినాడలు తూర్పు గోదావరిలో అటు కృష్ణలో మచలీపట్టణం, ఉత్తరాంధ్రలో విశాఖ, విజయనగరాలలో యువ కవులు, సంఘ సంస్కర్తలు వారూ వీరేమిటి అన్నివిధాలా కవాటాలూ మూసి గడియ పెట్టుకున్నవారు మినహా అందరూ ఆదరంతో సాదరంతో జీవితాలకి, సాహిత్యానికీ సమాజానికీ ఒక నవ్యతనీ, జవసత్వాలనీ ఇచ్చే ఆ ఉద్యమాలకు గాఢా లింగనంతో ఆహ్వానమిచ్చారు.

రాజమహేంద్రవరం, కాకినాడలు అప్పచెల్లెళ్ళ వంటివి. నన్నయనాటిది కాబట్టి రాజమహేంద్రవరం పెద్దముత్తయిదవ కాకినాడ వయస్సులో నున్న నవ యవ్వని. కాకినాడలో నాయుడిగారి ప్రభావంవల్ల బ్రహ్మసమాజం వేళ్ళూను కుని చిగురించడమేగాక కొమ్మ రెమ్మలతో రెపరెపలాడుతూ స్థిరనివాస మేర్పరచుకుని నవ్యకవిత్వోద్యమానికి ఓనమాలు దిద్దించింది. కృష్ణశాస్త్రిగారు పిఠాపురంలో పెరిగినా, విజయనగరంలో చదివి పట్టభద్రులైనా, పెరిగిపెద్దదై నవ్యకవితోద్యమానికి నాంది పలికి దేశాన్ని పులకింప చేసింది కాకినాడ నుండే.

ఊరూరా నవకవులుద్భవించారు. కవిత్వంలో అభిరుచికల్గింది. కవిత్వ మంటే ఆముదంముఖం పెట్టే విద్యార్థుల్లో కూడా ఒకానొక చైతన్యం కల్గింది.

నవకవులందరికీ మేలు కలయిక నిచ్చింది జనమంచి వారిల్లు గోదావారి స్టేషనులోదిగి ఒంటెద్దు బండి వాడ్ని వీరభద్రపురం బండికడతావా అబ్బీ ? అని అడిగితే "జనమంచోరింటికా బాబూ ! అల్ల కంబాల చెరువుకాడికా ?" అని అడిగి మా ఇంటికి తీసుకు వచ్చేవాడు. మా యిల్లు ఎత్తుగా ఉంటుంది. ఎత్తుగా విశాలమైన అరుగులు. అక్కడే కవిసమ్మేళనాలు, సాహిత్య గోష్ఠులూ గాఢమైన మైత్రి ఏర్పడ్డం జరిగేది. నవ్యసాహిత్య ప్రభంజనానికి మా ఇంటి తలుపులు తెరుచుకున్నాయి. ఇతర ఉద్యమాలన్నీ కూడా మాగృహప్రాంగణం లోనే సేద తీర్చుకున్నాయి, మాజీవితాలనూ, అభిరుచులనూ మార్చి వేశాయి.

శివశంకరశాస్త్రి, చింతా దీక్షితులు, మొక్కపాటి నరసింహశాస్త్రి పిలకాగణపతిశాస్త్రి, ఇంద్రగంటి, మల్లవరపు ముద్దుకృష్ణ, సహదేవ సూర్య ప్రకాశరావు, విశ్వనాథ - ఇలా ఎందరో ఆ నాటి కవులు కొలువు తీర్చేవారు. అంతమంది. విచ్చేయడం వేరు కృష్ణ శాస్త్రిగారు రావడం వేరు. ఆయనరాక సమావేశానికి ఒక కొత్త ఉత్సాహం, కొత్త ఊపునిచేది. వారి వెంట వారి మేనకోడళ్ళు సీత, అన సూయలుండేవారు.

అన్నయ్య ఆనాటి ఉద్యమాలతో - ముఖ్యంగా బ్రహ్మసమాజోద్య మంతో, భావకవితోద్యమంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయేవాడు. నేను చిన్న వాణ్ణి, మా నాన్నగారు పేరు ప్రఖ్యాతులు గడించిన వెంకట్రామయ్యగారు. కవులు పండితులు. సంస్కృత, తెలుగు, పాశ్చాత్య సాహిత్యాలలోనిష్ణాతులు సాంప్రదాయ కవితా పాటవం కలవారైనా భావకవిత్వమంటేనూ, భాషా సంస్కరణ మంటేనూ మనసు పడేవారు. ఆయన పాత కొత్తల సాహిత్యా నికి వారధిలా వుండేవారు. వారి ప్రాపకంలో అన్నయ్య పెరిగాడు. అన్నయ్య ప్రాపకంలోనెను మానసికంగా ఎదిగాను. తత్ఫలితంగా ఆనాటి కవులతో మసలడం, వారి కవితా గోష్ఠులు వింటూ, ఆనందించడం, వారితోబాటు సభ లకూ సమావేశాలకూ వెళ్ళడం ఫలితంగా అంతో ఇంతో సాహిత్యాభిరుచి పెంపొందింది. ఇప్పుడుతోస్తుంది, నెను శైశవదశ అనుభవించకుండానే జీవిత పరిణామంలో హఠాత్తుగా పెద్దరికాన్ని పొందానని.

ఇంటరు చదువుతున్న దినాల్లో ఒక రోజు మా తెలుగు ఆచార్యులు శ్రీ సాగి నరసింహంగారు "భావకవి శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు వారి మేనకోడళ్ళు సీతానసూయలు మన కళాశాలకు వేంచేస్తున్నారు, ఆయన భావ కవిత్వమంటే ఏమిటో ఉపన్యసిస్తూ కొన్ని మచ్చుతునకలు - ఆయన రాసినవే సీతానసూయల చేత పాడించి వినిపిస్తారు. మీకు ఆవెర్రిమొర్రి భావకవిత్వ ధోరణిలో అభిరుచి వుంటే సెంట్రలు హాలులో సమావేశమవండి" అని కొంచెం పరిహాసాస్పదంగా చెప్పారు. మొత్తం కళాశాలలోని విద్యార్థులంతా గుమిగూడారు. సాగి నరసింహంగారు ముందు నడువగా వెనక శాస్త్రిగారి బృందం హాలులో ప్రవేశించింది. ఆయన అచ్చంగా వంగీయునిగా కనిపించారు. ఒక్క పంచ పక్క గోచీ మాత్రం తెనుగు తనాన్ని జ్ఞాపకం చేస్తుంది. గిరజాలు వాటిని వయ్యారంగా మునివేళ్ళతో అప్పుడప్పుడు పైకీ పక్కకీ తోసుకుంటూ తేలిపోయే నేత్రాల నుండి గగన తలంవైపు కలకంటూన్నట్లు చూపులు, పాలమీగడ లాంటి లాల్చీధరించి ఏవో ఆకర్షణతో అయాస్కాంతంలా - మమ్మల్ని అందర్ని మాకే తెలియని మమతతో ఆయనకే అందానిచ్చే చిరునవ్వుతో వచ్చారు వేదికపైకి గళం విప్పి కృష్ణ పక్షంలోని కొన్ని పద్యాలు ఆలపించారు. తర్వాత సీత, అనసూయలు కన్నీటి కెరటాల వెన్నెలేలా ? "నా నోట నీ మాట", "ఓహోవసంతా" మొదలైన పాటలు హాయిగా పాడేవారు. బహుశః లలిత సంగీతం శాస్త్రిగారి కవితలోంచే పుట్టిందేమో ! ఒక చోట శాస్త్రిగారు నాకు కవిత్వం ప్రాణం ! సంగీతం ప్రాణాధికం అంటారు.

కృష్ణశాస్త్రిగారి కృష్ణ పక్షంతో పాటు నండూరి సుబ్బారావుగారి యెంకి పాటలు వెలువడ్డాయి. సాహిత్యరంగంలో గొప్ప అలజడి చెలరేగింది. భావకవులు అనేక దూషణలకి గురికావలసివచ్చింది. అందులోనూ ముఖ్యంగా శాస్త్రిగారిపై విజృంభణతారస్థాయి నందుకుంది. ఉమాకాన్త విద్యాశేఖరులు అనంత పంతుల రామలింగస్వామిగారు అందులో ముఖ్యులు శుక్లపక్షం కృష్ణ పక్షానికధిక్షేప కావ్యం అందులో కవిత్వాన్నేకాక శాస్త్రిగారి వేషభాషలనీ దుయ్యబట్టడం జరిగింది.

ప్రశంస విమర్శ బొమ్మ బొరుసులాంటివి. శాస్త్రిగారు విమర్శకు కొంత మానసికంగా తాత్కాలికంగా బాధపడినా తన కవిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని సడలనివ్వలేదు.

అందుకనే కవిసామ్రాట్ విశ్వనాథ "ఎవ్వరేమన్నా భావకవిత్వ"మనే దానికి రూపమిచ్చి పెంపొందించినవాడు కృష్ణశాస్త్రి. అచ్చంగా భావకవిత్వమే వ్రాస్తాడు. అదే అతని వైశిష్ట్యం" అంటూ "మనకి కీట్సు, షెల్లీవంటి కవులులేరు. ఆ కవులు మనదేశంలో కృష్ణశాస్త్రిగా ఆవిర్భవించారని నా అభిప్రాయం" అని స్తుతించారు. యుగకవి శ్రీ శ్రీ "ఆయన ఇనుప పిడికళ్ళ నుండి విడివడడానికితనకుపదేళ్ళుపట్టిందంటారు.

బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడిగారి శిష్యరికంలో బ్రహ్మ సమాజంవైపు శాస్త్రిగారి మనస్సు మరలింది. మహతిపేరుతో బ్రహ్మ సమాజమందిరాల్లో ప్రార్థనా గీతాలాలపించేందుకు కీర్తనలు రచించారు బ్రహ్మ గీతోపాసకునిగా, "గళములోన నాకటిగీతి కనుల్రమోలనొకటె జ్యోతి" అంటూ సామూహికోపాసనా సూత్రాన్నభివ్యక్తం చేశారు.

రవీంద్రుడి ప్రభావం తన మీదెంత గాఢంగా పడిందో ఇలా వ్యక్తం చేస్తారు. "అపుడే ఒకమంగళానిలమందిచ్చిపోయె అజరామరము నీవాణి. నాగీతి అప్పుడే నగలున్న విడనాడి శిరస్సువంచెను ధూళిసరకు నీ పదమాని".

"ఓ ప్రభూ కాళిదాస ! రసికజన హృదయ భవనవాస" అంటూ కాళిదాస కవీంద్రుడికే కేలుమోడ్చి సంస్తుతిస్తారు.

కవిత్వంలో కొత్త మలుపుకి ఒరవడిదిద్దిన శాస్త్రిగారు ప్రాచీనత సాంప్రదాయాలపట్ల ఎంతో గౌరవం. న్రశుత అభిరుచి మమత కలవారు. అయన నాటికలకు ఇతివృత్తాలు చాలావరకు ఇతిహాసాలే ; దక్షయజ్ఞం, శ్రీ ఆండాళ్ళు, శర్మిష్ఠ, ధనుర్దాసు, కృష్ణాష్టమి, మొదలైనవి.

భగవంతుడిని ప్రేయసిగాను, భక్తుణ్ణి ప్రియుడిగానూ ప్రేమవి మధువుగానూ లోకాన్ని మధుశాలగానూ సంకేతిస్తూ వేదాంతతత్త్వాన్ని బోధిస్తుంది. సూఫీసాహిత్యం. శాస్త్రిగారి రచనల్లో చాలాచోట్ల అ వేదాంతతత్త్వం చాలా చోట్ల వినిపిస్తుంది. 'అతిథిశాల' నాటిక ఒక అమృతగుళిక. చైతన్య ప్రభువు భక్తిమార్గంలో రాధామాధవుల మధుర భక్తితత్త్వాన్ని గురించి తన్మయతతో శాస్త్రిగారనేక రచనలు సాగించారు.

సామాన్యంగా సాహిత్యానువాదాలు భావానువాదాలవుతాయి. మక్కీకి మక్కీ అనువాదాల్లో ఆత్మ ఉండదు. స్పందన కలిగించవు. మూలంలోని భావాన్ని మాత్రమే స్వేచ్ఛగా అనువాదభాషలోకి తేవడం అసిధారావ్రతం లాంటిది. అది ఒక కళ, అందులోనూ శాస్త్రిగారు ప్రవీణులనేదానికి తార్కాణంగా నిలుస్తాయి తిరుప్పావై బుగ్వేద ముస్నగునవి.

ఇక ఆయన చలన చిత్రాలకు రచించిన గీతాలుకూడా ఉదాత్త కవిత్వ సుమ పరిమళాలను కూర్చుకున్నాయి. "మల్లీశ్వరి" చిత్రమే దీనికి సాక్ష్యంగా నిలుస్తోందీనాటికి. ఈనాటికీ అందరినీ ఆకట్టుకుంటూ ఎన్నిసార్లు విన్నా తనివి తీరని పాటలూ-మాటలతో నారాయణరెడ్డి, వేటూరి, మల్లెమాల, రచించే చలన చిత్ర గీతాలను వింటూంటే శాస్త్రిగారు చిరునవ్వుతో తొంగిచూస్తున్నారా" అనిపిస్తుంది.

ఆయన వచన శిల్పం ఆయన కవిత్వానికే సాటి. సౌందర్యానికి అద్దం పట్టగల పరిణత శిల్పం. విషయ వైవిధ్యం ప్రస్ఫుటమై ఆయన వచనరచనలు మిగిలిన వాటిననాన్నా ఏమి తీసిపోక "గద్యం కవీనాం నికషం వదన్తి" అన్న

ఆర్యోక్తిని ఋజువు చేస్తాయి. వాటిలో ద్యోతకమయ్యే మానవతావాదం, సామాజిక స్పృహ, వ్యుత్పన్నత, హాస్యచతురాస్యత - మొదలైనవి ఆయన సంపూర్ణ వ్యక్తిత్వాన్నావిష్కరిస్తాయి.

"హృదయం లేనివాడు కవికాడు. దీనులమెడ హృదయం చలించనివాడు శాస్త్రిగారిలా మహాకవి కాజాలడు" అంటారు దుర్గాబాయ్ దేశ్‌ముఖ్.

కృష్ణశాస్త్రి సాహిత్య సౌరభానికి ఉన్నత భావశాలియై నిడమర్తి నిర్మలాదేవి తన పరిశోధనద్వారా శాస్త్రిగారి కవితను కళాత్మక హృదయాన్ని పాఠకలోకం ఎదుట ప్రతిష్ఠించారు. రచనలో ఎంతకృషి! ఎంతశ్రమ! ఎంత దీక్ష! ఎంతతాదాత్మ్యం! కనపడతాయి! ఆయన సాహిత్యమంతా నలుపుతెలుపులో ఉంటే నిర్మలాదేవి నాకు తెలిసినంత శ్రమపడి ఉండేదికాదేమో!

నిర్మలాదేవి శాస్త్రిగారి అముద్రిత సాహిత్యంకోసం ఊరూరా వాడ వాడలా పయనించి శాస్త్రిగారి పరిచితులనూ అభిమానులనూ, శిష్యులనూ, బంధుకోటినీ ప్రశ్నించి తమ పరిశోధనకు ప్రాతిపదికగా కావలసిన సంబారము సేకరించారు. ఒకయాభై సంవత్సరాలు ఆయనతో సాన్నిహిత్యం కల్గిన నాకు "సాహిత్య సౌరభం"లోవి ప్రతిపుటలోని విషయమూ ఆశ్చర్యం ఆనందం కలిగించాయి.

శ్రీమతి నిర్మలాదేవి ఈ గ్రంథం మూలంగా శాస్త్రిగారి సాహిత్యాన్నే కాక ఆయన బహుముఖ ప్రతిభను సాక్షాత్కరింపచేశారు. నవ్యకవితకు నీరాజనము ఈ పరిశోధనాత్మక గ్రంథమే.

గృహలక్ష్మిగా, మాతగా, ఉద్యోగినిగా ఊపిరిసలపని నిత్య జీవితం సాగిస్తూ కాలానికి కళ్ళెంవెసి ఈ భగీరథ ప్రయత్నం.

దీక్షతో దీనికి పూనుకోవడం ఆమెకే చెల్లుతుంది. ఈ పరిశోధన మోయలేని భారం. తలకు మించిన బ్రహ్మప్రయత్నం. దిగ్విజయంగా నెరవేర్చిన నిర్మలాదేవికి అభినందనలు చెప్పడంచాలా లాంఛన ప్రాయంగా ఉంటుందేమో ఆమె చేసిన నవ్య సాహిత్యసేవకు ఇవే నా జోహారులు!

మోయలేనింక లోకాల తీయదనము

ఆలపింతు నానంద తేజోంబు నిధుల" అంటూ దివ్యలోకాల కరిగిన కృష్ణశాస్త్రిగారి వియోగానికి ఇట చెమ్మగిల్లని నయనం లేదు.

"షెల్లీ మళ్ళీ మరణించాడు. వసంత వాడిపోయింది"

— శ్రీశ్రీ.

జనమంచి రామకృష్ణ

20-2-85.

# నా నుడి

సంగీతపు మధురిమలు, సాహిత్యపు చతురిమలను ఆత్మానుభూతి ప్రగాఢత్వపు గరిమలను కలవేసి విలక్షణమైన వాణితో తనదొక ప్రత్యేక బాణీగా మలచుకొని తెలుగు సాహిత్య జగత్తులో విరాజిల్లుతున్నారు దేవులపల్లి కృష్ణ కవిచంద్రులు ఉజ్జ్వల యశస్సాంద్రులై, భావకవితారామంలో తీయగా గొంతెత్తిన కృష్ణశాస్త్రి భావకవిత్వాన్నొక ఉద్యమంగా కొన్ని దశాబ్దాలపాటు నడిపి భావకవులకు ప్రతినిధిగా నిలిచి, భావకవి సార్వభౌముడిగా సంభావించబడ్డాడు. నాటి సంప్రదాయవాదుల కర్కశ కశాఘాతాలకు ఎదురొడ్డి నిలిచి సంఘ సంస్కరణోద్యమాలలో పాల్గొన్న మేరు నగధీరులు.

మిగిలిన భావకవుల్లాగా కాకుండా కాలంతోపాటు ఎదుగుతూ, కాలానుగుణంగా వచ్చిన సర్వోద్యమాలకు ప్రతిస్పందించే హృదయంతో కావ్యాలాపన సాగించిన సాహితీ స్రష్టలు-ద్రష్టలూ కూడా. పరుసవేదిలాంటివారి చేయి ఏ సాహిత్య ప్రక్రియనంటినా బంగారాన్నే పండించింది. అనంత వైవిధ్యంతో భాసించే వారి మనోజ్ఞ సాహితీ మూర్తినీ, ఆ విరాడ్రూపంలో హరివిల్లులాగా సాక్షాత్కరించే ఆయన మనోహర వ్యక్తిత్వానీ ఆవిష్కరించడానికి గావించిన కృషి ఫలితమే నా పరిశోధన గ్రంథం. తదంశాలనూ, అనంతరం నేను సేకరించిన మరికొన్ని అంశాలనూ పొందుపరచి సాహిత్యాభిమానులందరకూ ఆస్వాదయోగ్యంగా మలచిన కృష్ణశాస్త్రి సాహితీ సౌరభమిది - ఒక చిన్న పాత్రము.

నా ఈ యత్నానికి సహాయ సహకారాలను, ప్రోత్సాహ ప్రోద్బలాలను అందిచిన వారెందరెందరో !

చిరుత ప్రాయంలోనే శ్రీరంగేశుని చేరిన తమ ఒక్కగానొక్క కూతురు "చిన్నసీత" స్థానాన్ని నాకిచ్చి వాత్సల్యామృతవృష్టిని నాపై కురిపించిన కృష్ణశాస్త్రి దంపతులకు లక్ష్మి బుజ్జాయిగార్లకు, నాలో చిననాడే సాహిత్యాభిరుచిని కలుగజేసి నారు - నీరు పోసి పెంపొందింప చేసిన మా నాన్నగారు, బాబాయిలు నిడమర్తి అశ్వినీ కుమారదత్తు ఉమా రాజేశ్వరావులకు.

విషయ సేకరణలో వాత్సల్యంతో తోడ్పడిన శ్రీమతి అనసూయ, వింజమూరి సీతాదేవిగారలకు, ఆచార్య యస్వీజోగారావు, కొత్తపల్లి వీరభద్రరావు, బాలాంత్రపురజనీ - నళినీ, పాలగుమ్మి పద్మరాజు - విశ్వనాథ, శ్రీతారకం, కురిమెళ్ళ వెంకట్రావు, అవంత్స సోమసుందరం వాచస్పతి చిత్తరంజన్ ప్రభృతులందరకూ నా కృతజ్ఞతాంజలులు.

పరిశోధనా వ్యాస రచనకు మార్గదర్శకులు, తొలినుడులతో శుభాశీస్సులను నందించిన ఆచార్య వర్యులు డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ అమరేశం రాజేశ్వరశర్మ. శ్రీజన మంచి రామకృష్ణగార్లకు నమోవాకృలు.

నా ఈ గ్రంధప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖవారికి నా కృతజ్ఞతాంజలి.

ప్రచురించిన సుధాంశ్ పబ్లికేషన్సు వారికి, ముద్రించిన శ్రీ లక్ష్మీప్రెస్ వారికి కృతజ్ఞతలు.

ప్రత్యేక విన్నపము : అనేక కారణాలవల్ల ముద్రణాలయంలో ఎన్నో ఎన్నో అచ్చుతప్పులు, దాని వలన ఎంతో వ్యథ కలిగినప్పటికీ మరల ముద్రించడమనెదెంతసాధ్యమో సహృదయులకు తెలిసినదే కనుక తప్పులను సవరించుకొని నా సారస్వత హృదయమర్థంగా గావించుకొనే యత్నం చెయ్యమని పాఠకులను ప్రార్థిస్తున్నాను.

— డా॥ నిర్మలాదేవి ఎన్.

# గీతాంజలి

భావకవి సార్వభౌమా!
భాసుర సత్కీర్తిధామా!!

నీరాజనమిదే నీ సుమధుర కవితామూర్తికి
సురుచిర హృదయార్తికి!
నివాళులివే నీ నిరుపమ సాహితీ లతాంతావనికి
నితాంత ఆమనికి!

కన్నీటి కొనేటిలో పన్నీటి ఊటలేనించి
చదలేటిచెంగల్వసోనకై ఎలదేటి పాటలేకూర్చి
ఆలపించ పొదపొదలో నవ్యరాగ విరివనులే!
ఆలకించ యెదయెదలో దివ్యభావ రసధునులే!
కృష్ణపక్ష చంద్రమా! కృష్ణ కవీంద్రమా!

ఋగ్వీధిని విహరించిన మీ
హృద్వీథిలో రవళించెను మహతీనాదం!
అది నినదించెనిట మానవతావాదం!
అదియే మా నవయువతామోద వేదం!

గొంతు గొంతులో ఓ మత్త కోకిల
గుండె గుండెలో ఓ కొత్తకోవెల
అలరించును! అమరించును!
నీమాట! నీపాట! ఏనాటికీనాట!
అది ముమ్మాటికీ వెల్గుల బాట!!

# విషయా సూచిక

ఒక మనిషిని మనీషిగాను, మహోన్నతుడిగాను, మహాకవిగనూ మలవటంలో జన్మతః సంక్రమించే ప్రతిభావ్యుత్పత్తులేగాక వంశపరంపరాగత గుణవివేకాలు, తల్లిదండ్రుల శిక్షణాదికాలు కొంతవఱకూ, అతను పుట్టి పెరిగిన వాతావరణము ప్రదేశము సమకాలీన సాంఘిక రాజకీయాది స్థితిగతులు, గురువుల స్నేహితుల ప్రభావము ఆనాటి ఉద్యమాల ప్రభావం మరికొంత దోహదమవుతాయి పైన పేర్కొన్నవన్నీ కృష్ణశాస్త్రిగారి సాహిత్య వ్యక్తిత్వ వికాసాలకెలా తోడ్పడ్డాయో చూద్దాం.

జన్మస్థలం :- "పల్లెటూరూ, ఊరుప్రక్కఏరూ, ఏటిఒడ్డున వెదురుపొదా పొదచెంత పుంతా, పుంతకి వెనుకమావితోటా, తోటకవతల వరిచేలూగట్లు, పంటకాలువలూ............ మనిషికీ మనిషికీ, మనిషికి చెట్టుకీ పిట్టకీ గట్టిచుట్టరికముంది అక్కడ" అంటూ కృష్ణశాస్త్రిగారు తమ జన్మస్థలమయిన చంద్రంపాలాన్ని గూర్చి అభివర్ణిస్తారు. అష్టాదశశక్తి పీఠాలలో ఒకటైనపురుహూతికాంబకు నిలయమూ, పంచమాధవులలో కుంతీ మాధవుడికి నెలవూ, త్రిగయలలో పాదగయక్షేత్రమూ, కుక్కుటేశ్వరుడికి ఆవాసస్థానమై కళింగదేశాభరణంగా ప్రఖ్యాతికెక్కిన పిఠాపురానికి సమీపంలో ఉందీ చంద్రంపాలెం" కూచిమంచి తిమ్మకవి ఆవాసస్థానంకూడా ఆగ్రామమనే పేర్కొంటూ ఆఊరినిగూర్చి, ఊరివారినిగూర్చీ, క్రమంగా పరిసరపట్టణ వాతావరణ ప్రభావంతో ఊరిలో వచ్చిన మార్పున్ని చెప్తూ "మా ఊరుపోయిందని" నిట్టూరుస్తారు. కృష్ణశాస్త్రి సమీపంలోనున్న పిఠాపురాన్ని దక్షిణాకాశీ పట్టణంగా చెప్తూ తనతండ్రీ పెత్తండ్రులతో చెరువొడ్డునా, పొలంగట్లా, పుంతలామలుపులా బడినడిచి వెళ్ళే వాళ్ళట అక్కడికి. ఈ పిఠాపురానికి దగ్గరలోనె పాపులూరు మల్లన రాజరాజ

1. "మా ఊరు పోయింది"—వచనరచన.

2. "పాండురంగ మహాత్మ్యం" తృ.ఆ. 4వ.

నరేంద్రుడివల్ల పొందిన నవఖండ్రవాడ అగ్రహారం, కూచిమంచి తిమ్మకవి కందరాడ ఉన్నాయి. ఈ విధంగా పౌరాణిక చారిత్రక ప్రాశస్త్యాలను సంతరించుకున్న స్థలమది. "అప్పుడు పుట్టిన చిగురు కొమ్మైనచేవ" అన్నట్టు కృష్ణశాస్త్రి గారి జన్మస్థలాల వైశిష్ట్య, ప్రాశస్త్యాలు ఆయనసాహిత్య వ్యక్తిత్వ వికాసాలమీద తమ ప్రభావాన్నెంతయినా చూపాయి.

హరిజనోద్ధరణ వేశ్యా వివాహాది సంఘ సంస్కరణోద్యమాలలో పాల్గొన్న కారణంగా ఏ పిఠాపురంపైతే ఆయన్ని వెలివేసిందో దానిమీద క్రోధం గానీ, ఏహ్యతగానీ లేదు సరికదా ఎనలేని భక్తి ప్రపత్తులు, ప్రీతి మమకారాలూను, వీటినే ఆయన "శివక్షేత్రయాత్ర", "నిగమ శర్మ", "మా ఊరు పోయింది" మొదలైనరచనల్లోనూ "మళ్ళీ ఆరోజుల జ్ఞాపకాలు" అన్న ప్రసంగ పాఠంలోనూ ప్రకటిస్తారు.

పిఠాపుర సంస్థానాధీశులు సాహిత్య పోషణకి గణుతికెక్కినవారు "తావకీన సహితరువితాన శాఖికల నిత్యనూతన స్వాదుగాన జీవనారంభముల గురించి చివురులెత్త వాడుకొన్నారు మాకులస్వాములెల్ల" అన్న కృష్ణపక్ష కావ్యాంకిత పద్యపాదాల్లో దేవులపల్లి వంశంవారు పిఠాపురాస్థాన కవీశ్వరులుగా ఉంటూ వచ్చారనే విషయం వెల్లడవుతోంది. 16వ శతాబ్ద్యంతంలో గోల్కొండ నవాబులదగ్గర సర్దారుగా ఉన్నట్టి రావు మాధవరాయణింగారే పిఠాపుర సంస్థానాన్ని నెలకొల్పినట్లు తెలుస్తోంది. వీరిమూల పురుషుడు సర్వజ్ఞసింగ భూపాలుడట. తెలుగురాయణింగారి నాటినుంచీ దేవులపల్లి వంశవారు ఆ ఆస్థాన కవీశ్వరులుగా విరాజిల్లుతూన్నట్టు విదితమవుతోంది. విద్వత్కవిపోషణకీ పండిత సమాదరణకీ శ్రీ గంగాధరరామారావు బహద్దరువారు సుప్రసిద్ధులు. భిషగ్వరికామబుషి

---

1. "కృష్ణ పక్ష" సంపుటి.

పాపయ్య లింగకవి, మృత్యుంజయ సోదరులు ఆ ఆస్థానంలో ఉంటూ ఆయ-న్నుండి అనేక పురస్కారాలని పొందారు. తెలుగుజమిందారులలో భాషాపో-షణకు తలమానిక మనపించుకున్న సూర్యారావు బహద్దరు పట్టాభిషిక్తుడైనప్ప-టినుంచి (1905 సుమారు ఏభై సంవత్సరాలు అనవరతంచేసిన ఆంధ్రభాష -సేవ సాటిలేనిది. ఆంధ్రసాహిత్యపరిషత్తుని 1911లో స్థాపించి ప్రభావతీప్రద్యు-మ్నం, సుభద్రాపరిణయం, రామచంద్రోపాఖ్యానం మొదలైన పూర్వకవి విర-చితకావ్యాలనేకాక కందుకూరివారి కవుల చరిత్రని, పురాణపండమల్లయ్యశాస్త్రి ఆంధ్రసూత్రభాష్యం పానుగంటివారి నాటకాలనీ, సాక్షివ్యాసాలనీ ప్రచురిం చారు. సూర్యరాయాంధ్ర నిర్మాణానికై తెలుగునాటలోని ప్రముఖ పండిత వర్గాన్ని రప్పించి నియమించి పోషించారు. వేంకటపార్వతీశ్వర కవుల కార్యా స్థానంకూడా పిఠాపురమే అయింది. ఇలా ఆనాటి ఎంతోమంది కవుల, పండి తుల, విమర్శకుల సంగీతాది ఇతర కళావిద్వాంసులఆదరణకీ, రచనలముద్రణకీ ద్రవ్యసహాయ సహకారాలనందించి ఆంధ్రభాషాపోషణకిల లక్షకొద్దీ ధనాన్ని వ్యయపరచిన "ఆంధ్రభోజ" బిరుదాంచితులైన రాజావారి భాషాభిమానం, రసజ్ఞతావదాన్యతలకి పులకించిన "కవిపాటలకోయిలకులపు" కవికుమారులు కృష్ణశాస్త్రి తన తొలికృతి "కృష్ణపక్షం" నికి ఆయన్నే కృతిపతిగా సంభావించ డమెంతో ఔచితీశోభితము, సంతోషదాయకము. ఇలా "మహారాజాస్థానమగుట చేత భుక్తికీ మహాకవి నిలయమగుటచేత రక్తికీ,మాధవక్షేత్రమగుటచేత ముక్తికీ నిధానమైనదీ పిఠాపురము" అన్న పానుగంటి లక్ష్మీనరసింహంగారి మాటలు

---

1. తూ. గో. రచయితలమహాసభల సావనీర్‌లోని తూ. గో. జిల్లా సంస్థాన ములు సాహితీసేవ.1970 జన. 10.11

2. ఆంధ్రసంస్థానములు — సాహిత్యపోషణము — ఆచార్యతుమాటిదొణప్ప పుట— 251

యథాక్షరసత్యాలై కృష్ణశాస్త్రిగారి ఉన్నతస్థల మహత్త్వాన్నీ వైశిష్ట్యాన్నీ నిరూపిస్తున్నాయి.

ఆభిజాత్యం :- దేవులపల్లివంశీయులు తెలుగురాయణంగారి నాటినుంచీ పితా-పురాస్థానపు కవీశ్వరులుగా ఉంటూ వచ్చారు. ఆ వంశంలో బ్రహ్మన్నశాస్త్రులు రామశాస్త్రులనే వారిద్దరూ విజయనగర సంస్థానాధీశుడైన విజయరామరాజు చేత అగ్రహార పురస్కృతులయినట్లు తెలుస్తోంది. కృష్ణశాస్త్రిగారితాత కృష్ణశాస్త్రి మంచికవులు, పండితులు. వారిద్దరివద్దే కృష్ణశాస్త్రిగారి పెత్తండ్రి సుబ్బరాయశాస్త్రి, తండ్రి తమ్మన్నశాస్త్రి కావ్యాలు నాటకాలు అలంకారశాస్త్రాలు కూలంకషంగా చదివి జీర్ణించుకున్నారు. సుబ్బరాయశాస్త్రి. తమన్నశాస్త్రి—ఈ ఇద్దరూ దేవులపల్లిసోదరులుగా వినుతికెక్కారు. ప్రబంధరీతిలో ఆశువుగా అనేకపద్యాలు శ్లోకాలు చెప్తూ అష్టావధాన శతావధానలెన్నిటినో చేసి పలువురి ప్రశంసలను పొందడంతో సంతృప్తి చెందక సంస్కృతాంధ్ర భాషలలో కావ్యాలనూ రచించారు. సంస్కృతంలో శ్రీరామస్తవం, రావువంశముక్తావళినీ, తెలుగులో మందేశ్వరశతకం, మల్లణస్తవం, కుమారశతకం, మహేంద్రవిజయము రామరాయవిలాసాలను సుబ్బరాయశాస్త్రి యతిరాజవిజయాన్ని, నయనోల్లాసాన్నీ తెలుగులో రచించారు. తమ పూర్వుల వంశచరిత్రని రావువంశముక్తావళిగా రచించినందుకు గంగాధరరావు మహీపతి ఆనందపరవశుడై వారిని తన సింహాసనంమీద కూర్చోబెట్టి స్వయముగా వింజామరతో వీచాడట! దీనిని కృష్ణశాస్త్రి

---

1. అది మహీపతి రామరాయావనీంద్ర
కరకమల వీజ్యమాన చామర సమిర
పులకిత భవన్మృదు శరీర భూషితంబు—"కృష్ణపక్షకావ్యం"—మూలాబయ్యగారు" ఖండిక పుట—78

2. విజ్ఞాన సర్వస్వం—వాల్యూమ్—4.

గారుకృష్ణపక్షంలోని మాబాబయ్యగారు, నాన్నగారు "అనేకుండికల్లోవర్ణిస్తారు" ఆస్మృతిఖండికలేడింటివల్లా ఆసోదరకవుల మధుర కవితాశైలీ సౌందర్యవైభ-వాలు; అన్యోన్య ప్రేమాభిమానాలు, రామరాయావనీంద్రుడితో వారికున్న స్నేహసౌహార్ద్రాలు, సూర్యారావు బహద్దరుపైని వాత్సల్యము, వారిప్రభావంతో కృష్ణశాస్త్రిగారి జీవితం పునీతమవడం — ఇవన్నీ స్పష్టమవుతాయి. కృష్ణ-శాస్త్రిగారి రెండవఅక్క శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు కూడా విదుషీమణి. ఆవిడ పండితకవీ, నాటకకర్త అయిన వింజమూరి నరసింహారావుగారి ధర్మపత్ని. తండ్రి పెత్తండ్రులవద్దనుంచి విద్వత్తుని పొందడమేగాక సంఘసంస్కరణ కార్యక్రమాల్లో పాల్గొన్నధీరురాలు. మహిళాభ్యుదయానికి ఇతోధికంగా పాటుపడిన ఆదర్శనారి. ఆనాటి సాహితీసమితి సభ్యత్వాన్నొం-దిన ఏకైకవనిత. సావిత్రి, హిందూసుందరి, గృహలక్ష్మి పత్రికలలో పద్య గద్యరూపక వ్యాసాలనెన్నిటినో వ్రాయడమేగాక "అనసూయ" అనే పత్రికని 1916లో ప్రత్యేకం స్త్రీలకోసం స్థాపించి స్వయంసంపాదకత్వంతో నడిపిన ప్రజ్ఞాధురీణ. ఆవిడ కూతుళ్ళే నేటి ప్రఖ్యాత గాయనీమణులైన సీత అనసూయలు. అనసూయ కుమార్తె రత్నపాప విదేశాల్లోకూడా ఖ్యాతినొందిన నర్తకీమణి.

దేవులపల్లి తమ్మన్నశాస్త్రి (ఆయన పేరూ కృష్ణశాస్త్రేకానీ తమ్మన్న శాస్త్రులుగా ప్రఖ్యాతినందినవాడు) సీతమ్మగార్లకి ఇద్దరాడపిల్లలతర్వాత 1897 నవంబరు ఒకటవతేదీన కృష్ణశాస్త్రిగారు జన్మించారు. పెత్తండ్రి సుబ్బరాయ శాస్త్రికి ఐదుగురూ కూతుళ్ళే కావడంతో అన్నదమ్ములిద్దరికీ తానే మగబిడ్డడైవా-రి ముద్దులతనయుడిగానూ, ఏడుగురక్కల మురిపాలతమ్ముడిగానూ అపరిమిత

---

1. 1978లో ఫిబ్రవరి 25వతేదీని ఆయనతో జరిగిన సంభాషణలో.
2. "మాఊరుపోయింది"—పుష్పలావికలు—పుట—47

మైన వాత్సల్యమమకారాలతో అల్లారుముద్దుగా పెరిగారాయన. ఎల్లప్పుడూ తండ్రీ పెత్తండ్రుల ఒడిలోనో భుజాలపైనో నట ఆయన ఆవాసం. ఒకసారి విధంగానే కృష్ణశాస్త్రిని భుజాలమీదెక్కించుకుని పిఠాపురాన్నించి చంద్రం పాలెంవస్తూ దోవలో నూరుపద్యాలని చెప్పారుట ఆ అన్నదమ్ము లిద్దరూ. ఇంటికివచ్చి వాటిని గ్రంథస్థంచేసే సమయంలో వారు మరచిన కొన్నింటిని కృష్ణశాస్త్రి చెప్పడం జరిగిందట. చిన్ననాటి ఆ అద్భుత ధారణాశక్తి కృష్ణశాస్త్రి గారిలో ఎనబయ్యో ఏటదాటినా తరగలేదు. 81వయేటకూడా తనకి 30, 40 వేల పద్యాలు జ్ఞాపకమున్నాయన్నారు. నిరంతరం వారిగృహం విద్వద్గోష్ఠుల తోనూ కవితాగానాలతోనూ మార్మోగుతూండడం, కవుల రాకపోకలు వారి సాంగత్యసాన్నిహిత్యాలు కృష్ణశాస్త్రిగారిలో పసితనంనుంచీసాహిత్యాభిరుచినీ, అభినివేశాన్నీ కలిగించి శబ్దసౌందర్యమాధుర్యాలు బాగా పంటబట్టాయి. కను-కనేతనవేడవయేటే సామర్లకోటలో ఆశువుగా "నందనందన ఇందిరానాథవరదా" అనే పద్యాన్నీ, పదవయేట రామతీర్థంలో ఒక ఆశుకవితనీ చెప్పి శ్రోతలని ఆశ్చర్యచకితులని చేసారట, తండ్రీపెత్తండ్రులు తమతమ పద్యాలని అంత-చిన్నతనంలోనే ఆయనకి వినిపించి బాగోగులడిగేవారుట! తండ్రితో ఒకసారి మద్రాసు వెళ్ళినప్పుడు డా. గోపాలాచారికి కొన్ని పద్యాలనాశువుగా చెప్పి మెప్పించి తర్వాత ఆయన్నుండి పంపబడిన ఆంధ్రమహాభాగవతాన్ని హెడ్మాస్టరుద్వారా బహుమతిగాపొందారుట. 12వసంవత్సరంలో పెత్తండ్రినీ, 14వయేట తండ్రినీకోల్పోవడంతో వారివద్ద చదువుకునేభాగ్యానికి నోచకపో-యినా ఇద్దరి రచనల్నీ క్షుణ్ణంగా చదివి ఆకళించుకోవడం చేతనే తనకవి-తల్లో తండ్రిగారి "లిరికల్ ఫెర్వర్", పెత్తండ్రిగారి "జిగిపచ్చ"యన్నారు. విద్యాభ్యాసం—గురువుల ప్రభావం:— కృష్ణశాస్త్రిగారు "మాఊరుపోయింది"

---

1. "ఋక్యేఖి" లోని "మాగురుదేవులునాయుడుగారు"
2. 'గురుదేవుడు'—పల్లకీసంపుటి—పుట - 22
3. 'కృష్ణపక్ష' సంపుటి.

అన్న వచనరచనలో చంద్రదంపాలాన్ని వర్ణిస్తూ కామయ్య మేష్టారి ప్రసక్తి తెచ్చి "ముక్కు కొసదాకా జారిన కళ్ళజోడూ, ఏడాదిపొడుగునా తొడుగుకునేకోటూ పిలకా" జ్ఞాపకం వస్తున్నాయంటూ "నాకు మానాన్నగారిమీదఉన్నంత ఇష్టమూ భయమూ ఆయన అంటే" అంటారు. కనుక కృష్ణశాస్త్రిగారు కొంతకాలం ఆయనవద్ద చదువుకున్నారనేది విశదమవుతోంది. తర్వాత పిఠాపురం హైస్కూల్లో సూచి నరసింహంగారి హెడ్మాస్టరు గిరీలో థర్డుఫారంవరకూ చదువుకున్నారుట. అప్పుడే ఆయనలో సాహిత్యాభిరుచికి బీజావాపం జరిగిందని తెలిపారు. తర్వాత కాకినాడలో చదువుకొనసాగించి ఇంటరు పిఠాపురరాజా కళాశాలలో (పి. ఆర్. కాలేజీ) పూర్తిచేసారు. ఇంటరు చదివేటప్పుడు ఆకాలేజీ ప్రిన్సిపాల్ వెంకటరత్నంనాయుడిగారి అతేవాసిత్వంలో ఆంగ్ల ఫ్రెంచి భాషా-సాహిత్యాలలో మంచి అభిరుచీ అభినివేశాలు కలగడమే కాక లోకాన్నంతటినీ ఆప్యాయంగా ఆలింగనం చేసుకునే అనురాగబంధం, జీవితంలోని ప్రతీఅల్పా-నుభూతినీ ఒక ఉదాత్తదృష్టితో అనుభవించేశక్తి కలిగిందని చెప్పారు. "గురుదేవుడు" అన్న ఖండికలో (పల్లకీసంపుటి) రఘుపతివెంకటరత్నంనాయు-డిగారి మహోన్నత వ్యక్తిత్వాన్ని విష్కరిస్తారు. " 'సూఫీ'చరితామృతమ్ము గురిపించెడు మాగురుదేవుడేలకో తోచు షరాయితో ఫగిడితో నెవరోయొకపాదు-శాహిగా" అంటూ సూఫీసాహిత్యావగాహనలో నాయుడిగారి ప్రభావాన్నివ్యక్తం-చేస్తారు. అక్కడే రామానుజాచార్యులవారి శిష్యరికభాగ్యంకూడా లభించిందిట. అప్పటికింకా కాకినాడలో బి. ఏ. లేకపోవడంతో విజయనగరం కాలేజీలో మామిడిపూడి వెంకటరంగయ్యగారు ప్రిన్సిపాలుగానున్నపుడు బి. ఏ చదివి పట్టభద్రులయ్యారు. "1916—18నుంచి ఇప్పటికీ తమశిష్యుడనే" అంటూ "తల్లిదండ్రులదీ గురువులదీ ఋణంతీర్చుకోగలమా" అంటూతన తొలిపద్యా-లన్నీ తిరిగికూర్చిన కృష్ణపక్షస్వర్ణోత్సవ సంఘం ప్రచురించిన కృష్ణపక్షకావ్య సంపుటిని ఆచార్యమామిడిపూడి వెంకటరంగయ్యగారికే అర్పించారు. కృష్ణ శాస్త్రిగారిపైని మామిడిపూడివారి ప్రభావానికిది నిదర్శనము.

కవిమిత్రులసాంగత్యం:— చదువుకునేటప్పుడే 1914 - 16 ప్రాంతాలలో నండూరి సుబ్బారావు కృష్ణశాస్త్రులకి బసవరాజుద్వారా గురుజాడవారి ముత్యాల సరాలు మొదలైనరచనలనీ సెలయేటిగానాన్నీ వినడం జరిగిందట. చింతాదీక్షి-తులు, వేదుల సత్యనారాయణలతో పరిచయంకలిగి పెరగనారంభించింది. రాయప్రోలు, అబ్బూరివారి కావ్యాలని కంఠస్థంగావించారుట. "భారతి, సాహితీలు రాకమునుపే ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, ఆంధ్రభారతి, ఆంధ్రగ్రంథాలయసర్వస్వము, శారద మొదలైన పత్రికలలో కొందరికావ్యాలు వెర్రి ఆవేశంతో యువకులము కొందరం చదువుకునేవారము" అని పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వంలో చెప్పారు కృష్ణశాస్త్రిగారు, కాకినాడలో 1921-22 ప్రాంతాలలో ఊరిబయట రోజూసాయంకాలాలు చిన్నసమావేశాలు జరుపుతూ సుబ్బారావు నండూరీ, వేదులా, చింతా, పాటిబండ అప్పారావూ, బసవరాజూ, కృష్ణశాస్త్రి తమ తమ పద్యాలు చదువుతూ గురజాడ రాయప్రోలు ప్రభృతుల రచనలపైన విమర్శలు చేస్తూండేవారుట. శివశంకరశాస్త్రి సభా-పతిత్వంలో సాహితీ సమితి ఏర్పడడంతో ఆనాటియువకులందరూ అందులో సహధర్ములై సహోదర కూటంగా కలిసి పోవడం జరిగిందట, నోరి, కొడవటిగంటి వెంకట సుబ్బయ్య, విశ్వనాథ, నాయని, పింగళి కాటూరి, అడవి బాపిరాజు, కొడాలి ఆంజనేయులు మొదలైన వారందరితో సన్నిహిత పరిచయాలేర్పడ్డాయి కృష్ణశాస్త్రికి. వారి రచనల నన్నింటిని చదివి పరిపూర్ణ అవగాహన గావించుకొని ప్రశంసిస్తుండేవారు. చివరి వరకూ కవి మిత్రులతో ఘనిష్ట సంబంధ బాంధవ్యాలని నిలుపుకుంటూనే ఉన్నారు. "బసవరాజు" మీద వ్రాయనవ్యాసం, చలంమ్యూజింగ్స్‌లో కృష్ణశాస్త్రి ప్రస్తావనం కాటూరితో వారికున్న స్నేహ బంధాన్ని తెలిపినకురుమెళ్ళ వెంకటరావుగారి మాటలు, తల్లావఝుల శివశంకర శాస్త్రి కృష్ణపక్షానికి వ్రాసిన "సింహావలోకనము" కృష్ణ శాస్త్రిగారి వచనరచనలకి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వ్రాసిన "రెండు మాటలు" ఇంకా ఎంతోమంది కవుల పలుకులు పైదానికి ఉపబలకాలు.

ఉద్యోగాలు—ఉద్యమాల ప్రభావం—సంఘసేవా కార్యకలాపాలు—

విజయ నగరంలో పట్టభద్రులై కాకినాడకి తిరిగివచ్చిన కృష్ణశాస్త్రి గారు 1918లో పెద్దాపురం మిషనరీ హైస్కూల్లో అధ్యాపకుడిగా చేరారు. కానీ రెండేళ్ళయినా పూర్తిగా చెయ్యకుండానే తెలుగునాట ఆనాడు ముమ్మరంగా సాగుతున్న బ్రహ్మ సమాజోద్యమంచేత ప్రభావితులై బ్రహ్మసమాజ వివిధ కార్యక్రమాల్ని చేబట్టి ఉద్యోగానికి తిలోదకాలిచ్చేశారు. "ధర్మ సాధని" పత్రికలో రాజావారికి వ్యతిరేకంగా వ్రాసిన వ్యాసాల ఫలితంగా పిఠాపురాస్థానపు వార్షికం కూడా నిలిపి వేయబడి అనేక ఒడిదుడుకులకి లోన వ్వాల్సి వచ్చిందట! అనారోగ్య కారణంగా బళ్ళారి వెళ్తూ మార్గమధ్యంలోని నల్లమల అడవుల సౌందర్యాన్ని చూడడం, ప్రభావితులై కృష్ణపక్ష నాందీ గీతాన్నాలాపించడం జరిగింది. బాల్యంలోనే వివాహ మాడిన ప్రథమ కళత్రం 1922లో చనిపోవడం, కొంతకాలానికి శ్రీ గాడేపల్లి సూర్యనారాయణ గారి పెద్దమ్మాయి రాజహంసని పెళ్ళాడడం జరిగింది. మామగారు కూడా సంఘ సంస్కరణాభిలాషి కావడంతో సహాయనిరాకరణోద్యమ కార్యక్రమాలకి మరింత ప్రోత్సాహ ప్రోద్బలాలు లభించాయి. పిఠాపురం హైస్కూల్లో చేరినా రాజాగారికి ఆయన భావాలు నచ్చక పోవడంతో ఆ ఉద్యోగాన్ని 1923లో వదిలి వేశారు. హరీంద్రనాథ చటోపాధ్యాయుల కావ్యపఠనంవిని ఉత్తేజితులై నవ్యసాహితీ సమితి సభ్యత్వాన్నొంది సుమారే పదిసంవత్సరాలు అప్పటి వరకూ వచ్చిన నవ్యకవుల కవితల నెన్నింటినో గానంచేస్తూ తెలుగుదేశం నలుమూలలా తిరుగుతూ భావకవిత్వోద్యమ ప్రవర్తకుడిగా గడిపారు. అప్పుడే శాంతినికేతన్ని దర్శించి అక్కడికవులతో సాహిత్యసంబంధ మేర్పరచుకుని పాశ్చాత్య సాహిత్యాన్నామూలాగ్రం పఠించి వంట బట్టించుకోవడం జరిగిందట. 1926 ప్రాంతంలో పిఠాపుర హరిజన వసతి గృహంతో సంబంధ మేర్పడి పదిమంది హరిజన బాలుర బాధ్యతలని వహించడం, వారిని వెంటే

సుకుని తెల్లవారు ఝామునే హరిజనాభ్యుదయ గీతాల్నాలాపిస్తూ ఊరంతా తిరుగుతుండడంతో బ్రాహ్మణులంతా ఆయన్ని దుమ్మెత్తిపోసి వెలివేయడం, బంధువుల రాకపోకలు ఆగిపోవడం జరిగినా చలించక తన సంఘాభ్యుదయ కార్యక్రమాలని కొనసాగించిన మేరునగధీరులాయన, హేమచంద్ర సర్కార్ వంటి పెద్దల ప్రోత్సాహంతో వేశ్యావివాహ సంస్థని 1930వ సంవత్సరంలో పిఠాపురంలో స్థాపించి వేశ్యావివాహాలనేకం చేయించిన సంఘసంస్కర్త. వీటన్నింటికీ తాత తండ్రులవల్ల తనకి సంక్రమించిన ఆస్తిపాస్తులని కూడా వ్యయ పరచిన నిస్వార్థ సేవాపరాయణులు కృష్ణశాస్త్రి.

నేటి ప్రముఖ వ్యంగ్య చిత్రకారుడు "బుజ్జాయి" గా ప్రసిద్ధికెక్కిన సుబ్బరాయ శాస్త్రి పుట్టుకతో ఆయన జీవితానికో నిలకడ యేర్పడి 1931నుంచీ 9-10 సంవత్సరాలు కాకినాడ కాలేజీలో ట్యూటర్‌గా పని చేస్తూ ఎంతో మంది విద్యార్థుల చిత్తాల మీద చరగని ముద్రవేశారు. 1942లో నవ్య సాహిత్య పరిషదధ్యక్షుడిగానూ, 1945 జనవరిలో అభ్యుదయ రచయితల సంఘతృతీయ వార్షికోత్సవ సమ్మేళనాధ్యక్షుడిగానూ ఎన్నుకో బడ్డారు. 1947 నుంచి మద్రాసులో నివసిస్తూ "మల్లీశ్వరి చిత్రానికి మాటలూపాటలూ, ఇంకా ఎన్నో చిత్రాలకి గీతాలు వ్రాయడమేకాక యక్షగానాలు, భక్తి రసాత్మక శ్రవ్య నాటికలనీ రచించారు.

రేడియోవారి ఆహ్వానంతో హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంలో సాహిత్య ప్రయోక్తగా 1957 నుంచీఉంటూ 1962 వరకూ ఎన్నో అమూల్య నాటికలనీ. వ్యాఖ్యా రూపకాలనీ (Skits) వ్రాశారు. క్యాన్సరువ్యాధివల్ల గొంతు పోవడంతో ఆ ఉద్యోగం నుండి విముక్తిపొంది తిరిగి 1964 ప్రాంతానికి మద్రాసుచేరి. సినీగేయ రచయితగా స్థిరపడి ఎన్నోచిత్రాలకి మధుర గీతాలని రచిస్తూ జీవిత ప్రస్థానాన్ని గాంచిన పూర్ణాయుష్షులు.

## కావ్యావిర్భావానికి దోహదమయిన విషాద సంఘటనలు.

"ఊపి ఊపి మనసునొక్కొక్క వేదన
కావ్యమౌను మరియు గానమౌను"

అన్న కృష్ణశాస్త్రిగారి మాటల్లో ఆయన జీవితంలోని వ్యథా భరితమైన సంఘటనలు ఖండ కావ్యాకృతుల నొందాయనే విషయం స్పష్టమవుతుంది. ఆవేశంగానీ ఆవేదనగానీ కావ్యావిర్భూతికి హేతువవుతుందనే విషయం వాల్మీకి నాటినుంచీ ధ్రువపడుతూనే వుంది. అందులోనూ భావకవిత్వ ముఖ్య లక్షణాలలో "ఆత్మానుభూతి ఆవిష్కరణ" మొకటి. కవి తన సుఖదుఃఖాల నేమాత్రం మరుగు పరచకుండా విశ్వజనీన మయ్యేటట్టు వాటికి కావ్యరూపాన్ని సంతరించడం భావకవితకి జీవలక్షణం. భావకవి సామ్రాట్టుగా, వేదనాకవిగా ఖ్యాతికెక్కిన కృష్ణ శాస్త్రిగారిజీ వితంలో సంఘటిల్లిన విషాద పూరిత దుర్ఘటనలు ఖండ కావ్యా కృతులనొంది సహృదయ పాఠక లోకాన్ని కరుణారస ప్లావిత హృదయుల్ని చేస్తున్నాయి.

1921లో కృష్ణశాస్త్రిగారి మొదటి భార్య మరణించడంతో వ్యథాభరిత మైన వారి హృదయం "కన్నీరు" అన్నఖండ కావ్యాన్నాలా పించింది. కృష్ణ పక్షంలోని "లోకమా", "శాపము", "పక్షినని", "అబ్బా", అన్న ఖండికలు సమాజంలోని నియమ నిగళాలు ఆయన స్వేచ్ఛాప్రవృత్తికిఆటంకాలనికల్పించి నపుడు కలిగిన విషాదాన్ని వెల్లడించినవి. ద్వితీయ వివాహానంతరం కలిగిన మొదటి బిడ్డ కొద్దికాలానికే మృత్యువాత పడటంతో కలిగిన దుర్భరవేదన "నావిరులతోట" అన్న ఖండికగా రూపొందింది. కృష్ణపక్షంలోని చివరి కవిత "నిర్యాణాన్ని" తనకొకసారి బాగా జబ్బుచేసినప్పుడు బ్రతుకుమీద ఆశని వదిలివేసు కున్న తరుణంలో పక్కమీద పడుకునే గోడమీద పెన్సిలుతో వ్రాసినదని ఆయనే చెప్పారు. పల్లకీసంపుటిలోని "ఏమిమిగిలె" అన్న ఖండిక గాంధీ నిర్యాణంవల్ల పొందిన ఆవేదననీ, నిశ్రేణిలోని "ఆకలి"

అన్న ఖండిక, వ్యాసం బెంగాల్‌లో 1931 ప్రాంతంలో సంభవించిన కరువు యొక్క బీభత్సాన్ని చూసినప్పుడు ఆయనలో చెలరేగిన ఆవేదనకి వాగ్రూపాలు. 1958 లో కృష్ణశాస్త్రిగారి ఒక్కగానొక్క కూతురు "సీత" మసూచికి బలైపోవడంతో ఆయనకి తీరని వ్యథ కలిగింది. తాను రేడియోవారికోసం వ్రాసిన "శ్రీ ఆండాళ్" నాటిక కూతురికి ఎంతో ప్రీతిపాత్ర మవడంవల్ల ముద్దుగా "ఆండాళ్ళూ" అని ఆమెని పిలుస్తుండేవారుట. శ్రీ రంగేశుణ్ణి వలచి వలపించుకుని ప్రత్యక్షంగా పరిణయమ్మాడి ఐక్యమైన ఆండాళ్ళు (గోదాదేవి) లాగే చిన్నవయసులోనే భగవత్సాన్నిధ్యాన్ని పొందిన కూతురు సీతస్మృతి చిహ్నంగా ఆండాళ్ళు కృతమైన "తిప్పావై" తమిళ కృతిని తెలుగులో కీర్తనలుగా అనువదించారు.

కంఠానికి క్యాన్సర్ వ్యాధి రావడంవల్ల శస్త్రచికిత్స ద్వారా స్వరపేటిని తీసివేయడంతో 1963 లో తెలుగువారినుర్రూత లూగించిన మధుర గళాన్ని కోల్పోయి మూగవారవడం ఆయనకెంత వ్యసనికొరిగించిందో ఆయన ప్రసంగ పాఠాల్లో వ్యక్తమవుతుంది. శస్త్ర చికిత్స అయిన మర్నాడు తనకి ఆపరేషను చేసిన "డాక్టరు హీరానందానీ" ఏదైనా కవితని వ్రాయ మన్నప్పుడు "మాట తీసుకుని నాకు మౌన మొసంగినావు, మౌన మందుకుని నీకు గాన మొసగ మంటావా? హీరానందానీ" అని అంటూ "నా మందిర గవాక్షంనుంచి తొలి అరుణ స్వర్ణకాంతి వచ్చి నాకళ్ళను తాకినప్పుడు కళ్ళువిప్పి స్వాగతం చెబుతాను. వేకువగాలి వ్రేళ్ళతో న్నామొగం నిమిరి నప్పుడు చిరునవ్వు నవ్వుతాను పెరటిలోనుంచి క్రొత్తగా విరిసిన విభాత సుమపరిమళం వచ్చి పలుకరిస్తే ఔనని తలఊపుతాను. కాని గవాక్షంలోనికి రవ్వంత ఒదిగిన మావికొమ్మ చివర నిలిచి "కో" అన్న వన ప్రియారవానికి బదులు మాత్రం చెప్పలేను, ఇక బదులు మాత్రం చెప్పలేను" అని ఆయన డైరీలో వ్రాసుకున్న కవితకి కంటతడి పెట్టకుండా ఉండలేము.

సాహిత్య పరిణతశిల్పానభిలషించే ఆయన రాసినన్నా వాసికెక్కువ ప్రాధాన్యాన్నిచ్చే వారు. ఎక్కువగా రచనలను చేయని కృష్ణ శాస్త్రిని లోకం బద్ధకస్థుడిగానూ, రాయని భాస్కరుడిగానూ భావించిన సందర్భాలున్నాయి విధి వశాత్తూ నిత్య "వ్రాయసకాడుగా" మారిన ఆయన ఒక సందర్భంలో "మంచినీళ్ళు కావాలన్నా వ్రాయాలి. వేళ్ళు ఏడుస్తాయి" అని వ్రాసిన మాటలు చదివినప్పుడు నాకళ్ళు చెమ్మగిల్లాయి. కాని ప్రతిశాపంలోను ఒకవరం నిక్షి-ప్తమై ఉంటుందన్నట్టు పరమ భావుకు డైన ఆయన మాటలన్నీ అక్షర బద్ధ మైన తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం గావించాయనడంలో విప్రతిపత్తి లేదు." కన్నీటి కెరటాల వెన్నెలనీ, నిట్టూర్పు గాడ్పులో నెత్తావినీ చూడగల ఆశావాది కృష్ణశాస్త్రి నిరాశ నిస్పృహలకి లోను కాకుండా "శితవేళ రానీయకు శిరానికి చోటీయకు" అంటూ నిత్య యౌవన శిలమైన మనస్సుతో తనకలాన్ని ద్విగుణీకృతోత్సాహంతో ఆఖరిశ్వాస ఆడుతున్నంత వరకూ స్వైర విహారం గావిస్తూ గళాలనెన్నింటినో విచ్చి ప్రమోగిస్తూనే ఉన్నారు.

"కలవిహంగమ పక్షముల తేలియాడి, తారకా మణులలో తారనై మెరిసి మాయమయ్యేదను నా మధురగానమున" అని అన్నట్టుగానే 1980 ఫిబ్రవరి 24 వ తేదీని నాద బ్రహ్మలో ఐక్యమయ్యారు."ఇట నశించునాకై చెమ్మగిల్లు నయనమ్ములేదు" అనికృష్ణశాస్త్రిగారు "ప్రవాసం" లో వ్రాసినా దిగిరాని దివులకేగిన దేవులపల్లికై "ఇల చెమ్మగిల్లని నయనమ్ములేదు."

---

1. హైదరాబాద్ సంక్రాంతి సాంస్కృతిక సమితి 1978 ఫిబ్రవరిలో జరిపిన కృష్ణశాస్త్రి సన్మానసభ ముగిసిన తర్వాత సుమారు గంటసేపు ఓపికగా అభిమానుల ఆటోగ్రాఫులమీద సంతకాలుచేసిచ్చి వ్రాసి చూపిన పంక్తులు.

భౌతికంగా ఆయన మనకి దూరమైనా వసంత కోకిలాలాపనలోనూ, ప్రకృతి రామణీయకంలోను, తేనెలొలుకు తెలుగు పలుకులలోనూ సాక్షాత్కరిస్తూనే ఉంటుంది ఆయన మనోహరరూపం.



## రచనలు — వాటికాలాలు — ప్రభావాలు

కృష్ణశాస్త్రిగారు పాతికేళ్ళ తెలుగు "కవిత్వం" అనేతమ వ్యాసంలో నవయుగంలో భారత జనాన్నూగించిన ఉద్యమాలలో రామ్మోహన రాయలతో పుట్టిన మానవోద్యమ మొకటి ప్రధాన మైనదని తెలిపారు. రాజారామ్మోహన రాయలచేత స్థాపిత మైన బ్రహ్మ సమాజాన్ని తెలుగునాట వీరేశలింగం, బ్రహ్మర్షి వెంకటరత్నంనాయడుగార్లు వ్యాపింప చేశారు. వారిచే ప్రభావితు లైన కృష్ణశాస్త్రిగారు బ్రహ్మ సమాజ కార్యకలాపాల్లో పాల్గొనడమేకాక బ్రహ్మమత ప్రచారానికిగాను తమ కలాన్నీ, గళాన్నీ వినియోగించారు. వారి గీతాలు ప్రజలలో ప్రగాఢ ముద్రవేశాయి. బ్రహ్మ సమాజానికి వ్యక్తిగత, సామూహిక ప్రార్థనారూపాలెన్నో విరచితమయి ప్రచారానికి తోడ్పడ్డాయి. అప్పుడే కృష్ణశాస్త్రిగారి మహతి అనే గీతి సంపుటిలోనున్న గేయాలు వెలువడి బ్రహ్మ సమాజ సభ్యులకెంతో ఉత్తేజాన్ని కలిగించాయి. గేయానుకూలమైన సాహిత్య ప్రక్రియలకి ప్రచార సామర్థ్యమెక్కువ కనుక సంగీతపు మధురిమలతోగూడిన కృష్ణశాస్త్రిగారి మహతీ గీతాలద్వారా బ్రహ్మమత సిద్ధాంతాలూ, ఆదర్శాలు బహుళ ప్రచారాన్నొందాయి. శబ్దలాలిత్యం, భావాభివ్యక్తి కనుగుణమైన తెలుగు సంస్కృత పదాల కూర్పులోని నేర్పు ఆయన రచనా సౌందర్యానికి ఒక విలక్షణమైన బాణీని సంతరించి అనితర సాధ్యమనె కీర్తిని ఆయన కవితకు సంపాదించి పెట్టింది. ఆయనలోని భావుకత సాహిత్యపు విలువలని చేకూరిస్తే చిన్నతనం నుంచి పట్టుబడిన సంగీత జ్ఞాన గాన మాధుర్యాన్నిం పొందించింది. "పాట పదములకై పెదుకు నిత్యపంకుడిగా" తనని ఒక చోట పోల్చుకుంటారు. ఆయన కృష్ణశాస్త్రిగారి బ్రహ్మ సమాజ కీర్తనలన్నీ 1920 ప్రాంతంలోన విరచితమయి బహుళ ప్రచారాన్నొందినా 1949లో కాని అవన్ని ఒకచోట గ్రంథస్థ రూపాన్నొందలేదు. 1939లో ప్రారంభించిన

1. "నావలెనె" ఖండిక - ఊర్వశి - కృష్ణపక్ష సంపుటి - పుట-148.

"మహతి" ప్రచురణం 1949 లో పూర్తయింది. మొత్తం 67 గీతాలు, 12 పద్యాలతో ఆయనకి "బ్రహ్మగీతోపాసకుడి"గా ఖ్యాతినార్జించి పెట్టింది మహతి". భాగవతంలోని నవవిధ భక్తిమార్గాలలో ఒకటైన "కీర్తనం" ద్వారా భగవంతుణ్ణి అర్చిస్తూ ముల్లోకాలనీ భక్తిపూరిత గానామృత వాహినిలో ఓలలాడించేటందుకుపకరించే నాందవాద్యం పేరు ఈ కీర్తనలక్కి పెట్టడంలో కృష్ణశాస్త్రిగారి లక్ష్యం ధ్వనిస్తోంది.

ఈ మహతి గీతాల్లో సగానికిపైగా "గీతావళి" అన్న పేరుతో 1938లో ముద్రించబడింది. అందులోని గీతాలు "ఉద్బోధనము, ఆరాధన, అను-తాపము, ఉపదేశము, మంగళము" అన్న శీర్షికలుగా విభజింపబడ్డాయి. అందులో "మహతినుండి" అని ఉండడం అప్పటికే ఈ గీతాలు రచింపబడ్డాయన్న వాస్తవం సూచిస్తోంది.

బ్రహ్మమత సిద్ధాంతాల నావిష్కరించే మహోపద్యసంపుటి "ఋగ్వేథి" బ్రహ్మర్షి రఘుపతి వెంకట రత్నంనాయుడిగారి ఆంగ్లసూక్తులకి కృష్ణశాస్త్రిగారు గీత పద్యాలలో చేసిన అనువాదం. 1944లో ఋగ్వేథి ప్రచురింపబడింది. కృష్ణపక్షంలోని స్వాదు సంగీత కలనాల సద్వీపంచి, ఈ నిశీమధ్యమ్మున, ఏసుగాటంపు నిద్దురలోన, "ఏదినీకిత్తునందునా, పాపీ, ప్రతీక్ష, నిర్వాణము" ఊర్వశిలోని నవవసంత, ఏను నిద్దుర వోదునో. ఈ యసిపాటు అపహరింతువు, "పల్లకీ"లోని గుబుచేష్టుడు. అందమోయి నాకు, బ్రహ్మర్షి మాట, జరగలేని వాయస్వనమ్మునిమ్మ" మొదలైనవి కూడా, బ్రహ్మమత ప్రభావంతో కూడుకున్నవి.

కృష్ణశాస్త్రిగారు నల్లమలై అడవుల ప్రకృతి సౌందర్యానికి పరవశించి ఆలాపించిన "ఆకులో ఆకునై" అన్న గీతం కృష్ణపక్ష కావ్యానికి నాందీగీత

మయ్యింది. ఇలా 1921లో ప్రారంభించిన కృష్ణపక్ష కావ్యరచన 1925 లో ఈ లోగా మొదటి భార్యావియోగంతో 1922 లో "కన్నీరు" అనే ఖండ కావ్యాన్నాలాపించారు. అది 1923 డిసెంబరు నెల భారతిలో ప్రచురితం. "ప్రవాస" మనే ఖండకావ్య సంపుటిని 1926లోనూ, 1928లోనూ "ఊర్వశి" ఖండకావ్య సంపుటిని రచించారు. కృష్ణపక్షాన్ని సూర్యారావు బహద్దరుకీ, ప్రవాసాన్ని మిత్రుడైన మొక్కపాటి రామమూర్తికీ, "ఊర్వశిని" "ఊర్వశికే" అంకిత మిచ్చినట్టు 1947లో రౌతు బుక్కుడిపో రాజమండ్రివారు ముద్రించిన "శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు" అన్న పద్యకావ్య సంపుటివల్ల తెలుస్తోంది. కృష్ణపక్ష స్వర్ణోత్సవ సంపుటి మాత్రం కృష్ణశాస్త్రిగారి గురువులు ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య గారికి సమర్పించబడింది.

విషాదానికిసంకేతం "కృష్ణపక్షం". అందులో ఆద్యంతం ఒక విషాద ఛాయ పరుచుకు నుంటుంది. ఆకవిత్వానికి జీవనాడిగానున్న విషాదాన్ని స్ఫురింప చేసే కావ్యానికి కృష్ణ పక్షమన్న పేరు సార్థక మవుతోంది. అదే కాక అప్పటికే భావకవితోద్యమ ప్రవర్తకుడిగా ఎంతోమంది యువకుల హృదయాల్ని ఆకట్టుకున్న కృష్ణశాస్త్రిగారి "కృష్ణపక్షం" వెలువడడంతో నే సంప్రదాయ కవిత్వపు కట్లుపాట్లతో విసిగిపోయి. విముక్తి నభిలషిస్తూన్న యువకవులు నూతనోత్తేజాన్ని పొంది ఆయన కవితా శైలినే కాక వేషభాష లని సైతం అనుకరించ నారంభించారు. గిరజాల జుట్టు-బెంగాలీ పంచె

---

1. ఆరోజుల్లో కలం పట్టిన ప్రతికవీ కృష్ణశాస్త్రి ఆకర్షణకి లోనైన వాడే. నేను ఆయన కవిత్వాన్ని అనుకరించే వాడిన కాని మా నారాయణ బాబు కృష్ణశాస్త్రి సింహ జూలును కూడా అనుసరించి......కృ. ప. స్వర్ణో త్సవ సంచిక - పుట - 20।

"కృష్ణశాస్త్రి రేడియో ప్రసంగక నుంచి" — కృష్ణపక్షకావ్యసంపుటి

కట్టుతోసహా- ఆ రోజుల్ని కృష్ణశాస్త్రి యుగ మనవచ్చు. "కృష్ణపక్షం" కావ్యం ఆవిర్భవించాక కొన్నేళ్ళ కృష్ణశాస్త్రి కవితా పక్షం తెలుగు సాహిత్య రంగంలో కొనసాగిందన్న విషయం కూడా ధ్వనిస్తుంది పేరులో. తర్వాత వెలువడ్డ "ప్రవాసం" అన్న ఖండ కావ్య సంపుటిలో కృష్ణశాస్త్రి విరహాన్నభి వర్ణించారు. ప్రవాస సమయంలో ప్రియుడు ప్రేయసీ వియోగాన్ని అనుభవించి చివరికి ప్రేయసీ సాక్షాత్కార సాన్నిధ్యాన్ని పొందుతాడు. అదేవిధంగా ప్రవాసంలోని కవితల్లో కృష్ణశాస్త్రిగారు. విరహావ్యథనంతా ఆవిష్కరిస్తారు. ప్రవాస దశ ముగిసిన తరువాత ఊహా ప్రేయసి ఊర్వశి సాక్షాత్కరిస్తుంది. ఆయన ఊహాప్రేయసి ఊర్వశే ఎందుకయిందని ఆలోచిస్తే వేద పురాణాల్లోని కథల వల్ల నారాయణుడి ఊరువులనుంచి ఉద్భవించడం చేత అభిజాత్యౌన్నత్యమూ, అప్సరసల సౌందర్యాన్నతిశయించిన సౌందర్యమూ కలిగి ప్రాచీన కవులలో కాళిదాసువల్లా, ఆధునిక కవులలో రవీంద్రుడి వల్ల ఒక దివ్య ప్రణయ వాసనని పొంది భావుక హృదయాలలో నవనవోన్మేష సౌందర్యోజ్జ్వల ప్రణయ దేవతగా భావించబడుతోంది. చలం ఆమెను స్వచ్ఛంద ప్రణయ మూర్తిగా మ చాడు. హిందీ కవి దినకర్ ఊర్వశీ పురూరవుల ఇతి వృత్తాంతాన్ని మానవుడి కామపురుషార్థానికీ, సృష్టి వికాసానికీ, భావనా పక్షానికీ ప్రతీకగా చిత్రించాడు. ఇంతటి ఉదాత్త ప్రణయ సౌందర్యాతిశాయి కనుకనే కృష్ణశాస్త్రి ఆరాధ్య ప్రణయ దేవత అయిందనేది స్పష్ట మవుతోంది. ఆయన ఊర్వశి విశ్వసౌందర్యానికి ప్రతీక. "మనస్సు ఎన్నడో సోకిన ప్రతి సౌందర్య ఖండాన్ని, తన హృదయాన్ని ఎన్నడో పలుకరించిన ప్రతిప్రేమ శకలాన్ని ఎక్కడికో పరిగెత్తు

---

1. శ్రీ కృష్ణశాస్త్రి కవితారస స్వరూపం - స్రవంతి - జూలై 1895 పుట - 13.
2. " " "

కునివెళ్ళి పేరి యేరి తెచ్చుకుని అన్నిటిని కలిపి కలిపి ఆమెను నిర్మించు కున్నాడుట. ఊర్వశి కావ్యం తరువాత "కార్తీకి" అని అయన తనరేడియో ప్రసంగంలో పేర్కొన్నారు. "నిశ్రేణి"లో ఆ ఖండకావ్యం కూర్చ బడింది. కార్తీక మాసపు వెన్నెలల పండు దనానికి ప్రసిద్ధి నందినవి, పరిణత దశకి సంకేత మవుతున్నాయి కార్తీక జ్యోత్స్నలు. ఊర్వశి సాక్షాత్కార సాన్నిహిత్యాలతో కవి ప్రణయం పరిపక్వ దశనంది పరిపూర్ణానం దానుభూతి నందుతుంది అనే భావాన్ని ధ్వనిస్తుంది "కార్తీకి" అన్న పేరు. భావ కవితోద్యమ ప్రభావంతో రచించిన ఈ కావ్యాలు ప్రేమ - విరహం - అన్వేషణ - ప్రేయసీ సాక్షాత్కారం - ప్రణయ సాఫల్యమనె భావసూత్రాని కనుసంధించబడి ఆయన్ని భావకవి చక్రవర్తినీ, ఆంధ్ర షెల్లీని చేస్తున్నాయి.

కృష్ణశాస్త్రిగారు మిగిలిన భావకవులలా కాకుండా కాలంతో పాటు వచ్చిన మార్పులీన్నీ, సర్వ ఉద్యమాలనీ పరికిస్తూ సంపూర్ణంగా ఆకళించు కుని తదనుగుణంగా కావ్యరచనలని సాగిస్తూ వచ్చిన నిత్య ప్రత్యగ్రశీలురు, కనుకనే ఆయన భావ, అభ్యుదయ, విప్లవ కవులనబడే మూడుతరాల కవులకీ ఆరాధ్యులయ్యారు. ఆయన కవితా హృదయం నిత్య యౌవన శీలంతో జాతి అందుకున్న సర్వ ఉద్యమాలను ఆలింగనం చేసుకుని కవితకు ఇతి వృత్తాలుగా చేసుకుంది." అన్నారు శ్రీ ఆవంత్స సోమసుందర్ నిశ్రేణి కావ్య సంపుటిని గురించి చెప్తూన్న సందర్భంలో "నిశ్రేణి" అన్న ఈ చిన్న కవితా సంకలనాన్ని 1943లో నవభారత తిరా మహేంద్రవరం వారు కృష్ణశాస్త్రిగారి భావుక హృదయం మీద వివిధ దశల్లో తమ తమ ప్రభావాలను చూపెన మత, సామాజిక కవితోద్యమాలు ప్రతిబింబించి ఆయన కవిగా, వ్యక్తిగా ఒక్కొక్క సోపానాన్ని అధిరోహించి పరిణతి నొందిన విధానాన్ని సూచిస్తుందీ సంకలనం. కాబట్టే దీనికి "నిశ్రేణి" (నిచ్చెన) అన్న పేరు అర్థవంత మవుతోంది. "రాశి" లో చిన్నదైన

వాటితో మిన్ననే అంటాయి స్త్రీ ఆపంతన్పు. ఇందులో "సుసుంకొను సురి మాపు". "ఆకలి" మరొక ఖండిక మొత్తం ఈ మూడు ఖండికలు తప్ప మిగిలినవన్నీ కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశీ, మహతి, పల్లకీ సంపుటుల లోనివే.

కృష్ణశాస్త్రిగారి విభిన్న దృక్కోణాలని ఆవిష్కరిస్తూ ఒక ప్రత్యేకతని సంతరించుకున్న ఖండకావ్య సంపుటి "పల్లకీ". ఆయన నాటకలు, కావ్య సంపుటులు మొదలైన వివిధ రచనల్లో కూర్చడానికి వ్రాసినవీ స్వాతంత్ర్య దినోత్సవం, ఉగాది మొదలైన కొన్ని ప్రత్యేక సందర్భాలలో రేడియో వారి కోరిక మీద వ్రాసినవీ, మహాత్ముడు, బ్రహ్మర్షి వెంకటరత్నం నాయుడు. రవీంద్ర కవీంద్రుడు మొదలైన మహనీయులపైన తనకున్న భక్తిని వెలారుస్తూ వ్రాసినవీ — ఇలా వివిధ అంశాలతో కూడుకుని విభిన్న కాలాలలో వ్రాసిన వాటిని "పల్లకీ" సంపుటిగా కూర్చి కృష్ణపక్ష స్వర్ణోత్సవ సంఘంవారు 1975లో ప్రచురించారు. కృష్ణశాస్త్రిగారి నవభావసుమాలని ఏర్చికూర్చిన ప్రణయపల్లకీ అది. ఒక చోట అభ్యుదయ భావన తట్టిలేపితే మరోచోట ప్రణయ భావన పరవశింప చేస్తుంది. ఒక చోట ఉమర్ ఖయ్యాం రుబాయత్తులాయన్ని మత్తముద్దుణ్ణిగా విస్తే మరొకచోట బ్రహ్మర్షిమాటలు వేదంలా విని పిస్తాయి. ఒక సారి శ్రీ రంగనాథుడి దివ్యసౌందర్యం ఆయనకి భక్తి తాదాత్మ్యాన్ని కలిగిస్తే మరోసారి హాలికుడి దైన్యం, అన్నార్తుల శోకం ఆవేదననీ ఆవేశాన్ని రగిలిస్తాయి. ఇంతటి వైవిధ్యాన్ని ముడ్చుకుని కృష్ణశాస్త్రి గారిలోని మానవతా సామాజిక స్పృహ, కాలంతో పాటు ఎదుగుతూ వచ్చిన కవితా ధోరణులు, భక్తి ప్రణయభావాలు, అంతర్జ్వాలాదీప్తులూ మొదలైనవాటిన్నింటినీ ఆవిష్కరిస్తున్నందువల్లనే

1. పల్లకీ సంపుటి-కృష్ణశాస్త్రి.

ఆయన రచనల్లో ఒక విశిష్టతని చేకూర్చుకుంది ఈ "పల్లకీ" సంపుటి. భావకవి చక్రవర్తి అయిన కృష్ణశాస్త్రి విరహ విషాదవేదనాకవీ, ఊర్వశీ ఉన్మత్త ప్రేమికుడూ "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అన్న ఊహా స్వర్గనివాసి, గంధర్వలోకానికి చెందిన కవి మాత్రమేకాదనీ "మంది కృతమహాయుగం ముందున్నది ముందున్నది ముందున్న మరిమందే యువ మహాయుగం" అనీ "ఆకాశముకొసట పొడుచు అరుణారుణతార" అంటూ అభ్యుదయ సామ్యవాద గీతాల్నాలపించగల ప్రజాకవీ కూడానని ఈ "పల్లకీ" నిరూపిస్తుంది. దీనిని ఆయన తన కవిమిత్రుడూ, భావుకుడూ అయిన శ్రీ ఆచంట జానకిరామ్‌కి అంకితమిచ్చారు.

1947లో కృష్ణశాస్త్రిగారు మద్రాసు వెళ్ళి చలనచిత్రసీమలో అడుగు పెట్టి "మల్లీశ్వరి" చిత్రానికి పాటలు మాటలు వ్రాశారు. తర్వాత ఎన్నో చిత్రాలకి పాటలని రచించారు. ఆ సమయంలోనే విప్రనారాయణ, క్షీర సాగరమథనం మొదలైన యక్షగానాలు సాయుజ్యం ధనుర్దాసు మొదలైన భక్తిరసాత్మక నాటకలు, శర్మిష్ఠ, కృష్ణాష్టమి మొదలైన గేయాత్మక నాటికలనీ రేడియో ప్రసార నిమిత్తం రూపొందించారు. ఆకాశవాణి ఆహ్వా నాన్ని మన్నించి 1957 నుంచీ హైద్రాబాద్ కేంద్రంలో సాహిత్య ప్రయోక్తగా ఉంటూ ఏడాదిపొడుగునా, ఋతుచక్రం. కొత్తకోవెల, శ్రీ ఆండాళ్ళు మొదలైన నాటికలను రచించి ప్రసారం చేయించారు. కృష్ణశాస్త్రిగారి రేడియో నాటికలను కృష్ణపక్ష స్వర్ణోత్సవ సంఘంవారు "ధనుర్దాసు", "శర్మిష్ఠ" అన్నరెండు నాటికా సంపుటాలుగా ప్రచురించారు. ధనుర్దాసు సంపుటిలో "ధనుర్దాసు", సాయుజ్యము, గుహుడు, శివక్షేత్ర యాత్ర అన్న భక్తిప్రధాన నాటికలు, శర్మిష్ఠ సంపుటిలో "శర్మిష్ఠ", కృష్ణాష్టమి, యమునావిహారి, ఏడాది పొడుగునా, గౌతమి, వేణుకుంజం అన్న గేయాత్మక (lyrical) నాటకలు కూర్చబడ్డాయి. మొదటి సంపుటిని

"భక్తిరసాత్మకములు"గా రెండవ సంపుటని "గేయాత్మకములు"గా పేర్కోవడం ప్రాధాన్య వివక్షననుసరించి కావచ్చు. "ధనుర్దాసు" సంపుటని పి. వి. రామన్నారుకి, "శర్మిష్ఠ" సంపుటని బెజవాడ గోపాలరెడ్డికి అంకిత మిచ్చారు. ఇతివృత్త వైవిధ్యమూ సున్నితహాస్యమూ భక్తి భావనామాధుర్యము, ఆత్మానుభూతి గాఢత, పద్యగద్యగేయరచనా శిల్పాలతో కూడు కున్న ఈ నాటికలను రూపొందించి ప్రసారం చేయడంలో బాలాంత్రపు రజనీకాంతరావు నళినీకాంతరావు, పాలగుమ్మి పద్మరాజూ విశ్వనాథం, ఆచంట జానకిరామ్, జనమంచి రామకృష్ణ చిత్తరంజన్ ప్రభృతుల కృషి అంతర్గతంగా ఉండి ఆకాశవాణి శ్రోతలనలరించడం జరిగింది. "కృష్ణ పక్షం" కవిని ఉత్తమశ్రేణి శ్రవ్యనాటికాకర్తగా చేసిన ఘనత ఆకాశవాణికే దక్కింది.

సాహిత్య ప్రయోక్తగానున్న సమయంలోనే ఎన్నో బాలగేయాలు, గ్రామికగీతాలు, దంపుళ్ళపాటలు, అమ్మలక్కలపాటలు, భక్తిగీతాలు, దేశ భక్తిప్రపూరితగేయాలు రచించారు. కొన్నిటిని నాటకల్లో, చిత్రాల్లో అక్కడక్కడాకూర్చడం కూడా జరిగింది.

రిక్షావాలా, బూట్ పాలిష్, మలుపుతిరిగే, బహుకాలదర్శనం మొదలైన వచనరచనలను (Skits - వ్యాఖ్యారూపకాలు) ప్రసారం చేసి శ్రోతల చిత్తాన్నాకట్టుకున్నారు. సాహిత్యపు విలువలున్న ఈ వచనరచనలన్నిటినీ "విశ్వోదయ"వారు 1965లో "అప్పుడు పుట్టిఉంటే", "బహుకాలదర్శనం", "పుష్పలావికలు" అనే మూడు సంపుటాలుగా ప్రచురించారు. ఏకాంతసేవ పీఠిక, పాతికసంవత్సరాల తెలుగు కవిత్వం, అప్పుడుఉంటే, బసవరాజు అప్పారావు మధురస్మృతి, అన్నమాచారి అప్పుడు పుట్టిఉంటే, అన్న సంపుటిలో కూర్చబడి శ్రీ పి. వి. రామన్నారుకి అంకితమివ్వబడ్డాయి. బహుకాలదర్శనం, అవ్వతిరునాళ్ళలో తప్పిపోయింది, రిక్షావాలా, మైలురాయి,

బూట్‌పాలిష్, అవ్వబస్సు ప్రయాణం, ఇద్దరు సత్యవాదులు "బహుకాల దర్శనం" సంపుటిలో చేర్చబడి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారికీ, పుష్ప లావికలు, కోవెలకొలను, సువాసనద్రవ్యాలు, మా ఊరు పోయింది, మా ఊళ్ళోవీధి అరుగు. శ్రీకృష్ణావతారతత్త్వము గుహుడూ పుష్పలావికలలో గ్రథితమై సూరి నారాయణమూర్తి మహాలక్ష్మమ్మగారికీ అంకితమయ్యాయి. ఈ మూడు సంపుటాలకి వక్తవ్యం ఇల్లింద్ర దగంటి వారు రాస్తారు.

ఇవికాక నా పరిశోధన విషయసేకరణలో 1938 అక్టోబరు 15న ప్రసారమైన "ఆకలి"అన్న రేడియో ప్రసంగం, 1946లో మార్చిలో ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల తృతీయ మహాసభ అధ్యక్ష పీఠాన్నుంచి "రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి" అన్న ప్రసంగం, 1948 ప్రాంతంలో కాకినాడలో చేసిన సరస్వతీగానసభ స్వర్ణోత్సవ స్వాగతోపన్యాసం, 1964 ఆగస్టు 14న విశాలాంధ్రలో ప్రచురిత మయిన "అసత్యమనేగడియ తొలగించి నిర్భీతిగా నిజం పలకాలి" అన్న వ్యాసం, 1966 కాకినాడసభలో చేసిన ఉపన్యాసం "మళ్ళీ ఆ రోజుల జ్ఞాపకాలు", 11-1-70లో తూర్పు గోదావరి జిల్లా రచయితల మహాసభ ప్రసంగవ్యాసం, 28-6-70న రాజమహేంద్రవరంలోని వీరేశలింగం 122వ జయంత్యుత్సవ సభలోని ప్రసంగపాఠం, 1978 ఫిబ్రవరిలో వంశీఆర్ట్సు వాళ్ళు సన్మానించినప్పుడు హైదరాబాద్‌లో ఆయన వ్రాసి చదివించిన ప్రసంగపాఠం (కృష్ణశాస్త్రి స్మృతులు), 1978 మార్చిలో సంక్రాంతి సాంస్కృతికసమితి సన్మానించినసభలోని ప్రసంగపాఠం, 1980 ఫిబ్రవరి 22న వ్రాసిన "బైరాగి" కవిపై వ్రాసిన రచనావ్యాసం నాకు లభించాయి.

1964 నుంచీ సినీగేయరచయితగా మద్రాసులో స్థిరపడి అనేక చిత్రాలకి గీతాలు వ్రాశారు. ఆయన సినిమాపాటలని 1975లో కృష్ణపక్ష

స్వర్ణోత్సవ సంఘం "మేఘమాల"అన్న సంపుటిగా ప్రచురించి 43 చిత్రాల లోని 115 పాటలని కూర్చింది. అది బి. ఎన్. రెడ్డిగారికి అంకితమివ్వ బడింది. 1980 ఫిబ్రవరి 22వరకూ బంగారక్క, అమెరికాఅమ్మాయి, సీతామాలక్ష్మి, పాదుకాపట్టాభిషేకం, వినాయకవిజయం, గోరింటాకు, తూర్పుకువెళ్ళేరైలు, సన్నాయిఅప్పన్న మొదలైన చిత్రాలకి పాటల్ని రచించారు. "సీతారాములు"అన్న వర్ణచిత్రానికి వ్రాసిన "కలలొచ్చే వేళయింది కనుతెరవకుమా"అన్న పాట వారి చివరి సినీగీతంగా పేర్కొ బడింది. "బుజ్జాయి"గారు కొన్ని పూర్తిచెయ్యని పాటలున్నాయన్నారు.

"అమృతాంజనం" ప్రారంభించిన కొత్తలో దానిమీద ఆయన వ్రాసిన "ఆగండీ ఇటు ఆగండీ, ఆ వంతమాట వినిసాగండీ......ఊరక బాధలు పెడుతుంటే సారెకు వేననపడుతుంటే అమృతాంజనమిది మందండీ" అంటూ వ్రాసిన గేయం కృష్ణశాస్త్రిగారి మేనగోడలి కుమారుడైన శ్రీ గరిక పాటి చంద్రదత్‌గారివద్ద లభించింది. 1947 ప్రాంతాలనుంచీ వేమన మకుటంతో అడపాదడపా వ్రాసిన పద్యాలు వందకుపైగా ఉన్నాయి. 35వరకూ "బుజ్జాయి"గారుగీసిన చిత్రాలతో అచ్చయ్యాయటగాని అందు బాటులోలేవు. కొన్నిమాత్రం శ్రీ రమేశ్‌చంద్రదత్‌వద్ద లభించాయి. హాస్య రసస్ఫోరకంగా ఉండి వ్యంగ్యవిమర్శనాత్మకమైనవి ఆ పద్యాలు. శ్రీశ్రీ తన "సిరిసిరిమువ్వ"లలో "అలకృష్ణశాస్త్రి వే మ న మెలుకువలాఘనికపణితి మైమరపించుటచేసులువయ్యెను నాకుభయుల చెలిమి యొకేపద్యమున" అంటూ వాటినైజాన్నావిష్కరిస్తాడు.

---

1. మార్చి 16, 1980 సితారపత్రికలో వేటూరి సుందరరామూర్తి.
2. మార్చిలో కృశా.గారి సంతాపసభకి మద్రాసు వెళ్ళినప్పుడు శ్రీ బుజ్జాయిగారు చెప్పారు.

అనువాద - అనుసరరచనలు :- బ్రహ్మర్షి వెంకటరత్నంనాయుడు గారు ఇంగ్లీషులో రచించిన బ్రహ్మసమాజ సూక్తులని కృష్ణశాస్త్రిగారు "ఋగ్వీథి" అన్నపేరుతో పద్యసంపుటిగా అనువదించారు. 1944లో ప్రథమ ముద్రణనీ, 1962లో నాయుడిగారి శతజయంత్యుత్సవాన్ని పురస్కరించుకుని ఉత్సవసభవారిద్వారా 1967లో ద్వితీయ ముద్రణనీ పొందింది. ప్రాచీనకాలంలో మహర్షులు సత్యాన్ని దర్శించిన తన్మయస్థితిలో వారి ముఖతఃదైవవాణి పలికించినవాక్కులే వేదఋక్కులయి వారి సత్యదర్శనానికి ప్రతిఫలించాలవుతున్నాయి. అదేవిధంగా బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి సత్యదర్శనానికి ప్రతిబింబాలు ఆయన సూక్తులు. ప్రాచీనులకి వేదఋక్కులమీద నున్నంతభక్తిప్రపత్తులు నాయుడిగారి సూక్తులపైన వారి శిష్యవర్గానికుంది. దీనినే సూచిస్తుంది "ఋగ్వీథి" అన్నపేరు. ఆనాడు భారతీయులు పొందగల అత్యున్నతమైన గౌరవాలన్నీ పొందినవ్యక్తి, వక్త, మహామనీషి, తెలుగునాట సంఘ సంస్కరణోద్యమ మూలపురుషులలో ఒకరయి, మానవతావాది, బహిర్వివేకం వంటివారుగా కృష్ణశాస్త్రిచేత స్తుతించబడిన నాయుడుగారు ఏభైసంవత్సరాలకిపైగా శిష్యులెందరి హృదయాల్లో జ్ఞానజ్యోతున్ని వెలిగించి వారి గుండెల్లో గూడుకట్టుకున్న సాటిలేని మేటిగురువు. ఆంగ్లసూఫీ సాహిత్యాల్నీ తత్త్వాలనీ తన అసాధారణ వాక్ప్రతిభతో శిష్యకోటిని మంత్రముగ్ధులనిచేస్తూ కరతలామలక మయ్యేటట్టు బోధించేవారు. "నాయుడిగారునాటి ఆంధ్రయువకులకు ప్రసాదించినవరాలు రెండనుకుంటాను. అవి ఉదారాశయశీలమూ (Idealism) తత్త్వదృష్టినీ, జీవితాన్ని భువమండలానికి తగిలించి యాత్ర సాగించడమూ, ప్రత్యక్షపు సందున్న అనంతతత్త్వాన్నీ ప్రత్యనుభూతితో పరమార్థాన్నీ పరిశీలించ యత్నించడమున్నూ, "వారి పాదసేవ, దయార్ద్రహృదయము, పాప

---

1. "ఋగ్వీథి" మా గురుదేవులు నాయుడుగారు" కృష్ణశాస్త్రి మాటలు.

పంపకముమాటున పవిత్రతను చూడగల విశ్వాసము, దైన్యమున ఆత్మ గరిమను ప్రతిష్ఠింపగల ధీరవృత్తి, దౌర్బల్యమున శక్తిని సాధింపగల ఉపాసనాబలము-ఇవి ఏబదేండ్లపాటు ఆంధ్ర యువజగత్తును వారి పాద పీఠమునకు కట్టివేసినది" అన్న కృష్ణశాస్త్రిగారి మాటలు ఆయనపై వారికున్న ప్రగాఢ భక్తిగౌరవాలని స్పష్టపరుస్తాయి. అపారగౌరవంతో నాయుడిగారి అంతేవాసి కృష్ణశాస్త్రి చేసిన ఈ తెనుగుసేత మూలహృదయాన్నెరిగి చేయడంతో ఒక్కగా రూపొందింది. ఈ పద్యసంపుటలో "బ్రహ్మర్షిమాట" అనే మకుటంతో 87, వైదిక యోగి అన్న మకుటంతో 1, "శుద్ధాస్తిక యోగి, మకుటంతో 7, మతము అన్న మకుటంతో 4, మొత్తం తొంభై తొమ్మిది గీత పద్యాలలో నాయుడిగారి సూక్తులు అనువదించి "ఫలశ్రుతి" ని చేర్చడంతో పద్యాల సంఖ్య వందకి పైగా అయింది. నాలుగు పాదాలని మించిన పద్యాలు కూడా వీటిలో సాక్షాత్కరిస్తాయి.

పరమేశ్వరుడు, శివమ్, ప్రార్థన-సంయోగము, జగత్పిత-మానవుడు, సత్యము, గురువు, జ్ఞానము-ప్రేమ, మతము, నీతి-మతము, నీతి-ప్రేమ, మానవుడు, భాగవతుడు, గృహము-ఆలయము, పాపము, పాపి-శిక్ష, క్షమార్పణ, స్వర్గము-నరకము. స్వర్గము-గేహము, విశ్వాసము, నిష్కామ కర్మ జీవన్ముక్తి, ధర్మము, సృష్టి, విశ్వాసము, తీర్థయాత్ర, స్వార్థవస్తువైరాగ్యం, సత్సంపది, ఆస్తికయోగి, ఆస్తిక మతము, ఆరాధన, అన్న శీర్షికలుగా ఈ పద్యాలన్నీ విభజించబడ్డాయి, క్రొందేనెతేట, చదలేటి యూట, రతనాలపేట, వలిమంచు తేట, అమృత పదవికి బాట అంటూ బ్రహ్మర్షి మాటయొక్క గుణవైశిష్ట్యాలని ఫలశ్రుతిలో అభివర్ణించారు కృష్ణశాస్త్రి.

తిప్పావరాపు అనువాదము :-

కృష్ణ శాస్త్రిగారి అనువాద రచనల్లో విశిష్టమైనదిగా పరిగణించదగినది తిప్పావరాపు తెనుగుసేత - పన్నెండుగురు ఆళ్వారులలో ఒకరిగా

పేర్కొనబడే చూడికుడుత్త నాచియార్‌గా ప్రఖ్యాతి కెక్కిన గోదాదేవి తమిళంలో వ్రాసిన తిరుప్పావు కీర్తనలు (పాశురాలు) వైష్ణవ సాహిత్యంలో బహుళ ప్రచారంలో నున్నవి. ధనుర్మాసంలో గోపికలు, దివ్య వ్రతమనీ, శ్రీ వ్రతమనీ, మార్గళివ్రతమనీ వ్యవహరించబడే ఈవ్రతాన్ని పూని రోజుకొక గీతాన్నాలాపించినట్లుగా రచింప బడ్డాయి. ద్రావిడంలో ఈ గీతాల్ని పాశురాలుగా వ్యవహరిస్తారు. మొదటి పాశురంలో శ్రీకృష్ణణ్ణి కీర్తిస్తూ తెల్లవారు ఝామునే స్నానమాడడానికి రమ్మని ప్రధాన గోపిక తన నెచ్చెలులని మేల్కొలుపుతూ అలాపించడం, రెండవదానిలో వ్రత నియమాలూ, మూడవ గీతంలో వ్రతఫలము, నాల్గవ పాశురంలో వరుణ దేవుణ్ణి వర్షంకోసం ప్రార్థించడం, ఐదవ దాంట్లో శ్రీ కృష్ణణ్ణి చూసి పాడుతూ తన సఖులని శ్రీ నామాలని చెప్పమని ప్రోత్సహించడం అక్కడి నుండి పదిహేనవ పాశురంవరకూ పరిహాసోక్తులతో తనచెలులని నీరాడరమ్మని పిలవడం, పదహారవ దానిలో గోపికలు నంద గోపుడి భవనరక్షకుణ్ణి తలుపుతీయమని వేడడం, యశోదనంద బలరామ కృష్ణులను పదిహేడవపాశురంలోనూ. పద్దెనిమిదవపాశురంలో నీలాదేవిని మేల్కొల్పుతూ పాడుతారు. శ్రీకృష్ణుడిని, అతనిభార్య నీలాదేవినీ బదులు పలుకమని వేడుతూ పంతొమ్మిది. ఇరవైపాశురాల్ని, తరువాతి తొమ్మిది పాశురాలూ కృష్ణణ్ణినుతిస్తూ తమ కోరికలను నివేదించుకుంటారు గోపికలు. గోదాదేవిచేత రచింపబడిన ఈ తిరుప్పావుని చదివినవారికీ, ఇందులో గర్భితమైన వేదాంతార్థాన్ని గ్రహించినవారికీ శ్రేయస్సు కలుగుతుందనే శుభాశంసనతో ఈ వ్రతగ్రంథం ముగుస్తుంది. ఈ పాశురాలు "ఎలోరెమ్బావాయ్" అన్న మకుటంతోనుంటాయి. వేదాంతార్థాన్ని ముడ్చుకుని వ్యాఖ్యాసాపేక్షమైన ఈ పాశురాలకి వ్యాఖ్యానగ్రంథాలెన్నో తమిళంలో ప్రచురితమయ్యాయి. వాటిలో కొన్ని తెలుగులోకి అనువదించబడ్డాయి. అందులో పరవస్తు వేంకటాచార్యులయ్యవారల వ్యాఖ్యానాధారం

గావించుకుని అకలంకమైన మనస్సుతో ఆప్యాయంగా కీర్తనలుగా అనువదించి పిన్నవయసులోనే శ్రీరంగేశుని చేరిన కృష్ణశాస్త్రి ప్రియపుత్రిక చిన్నసీత స్మృతిచిహ్నంగా దేశముఖ్ దంపతులకి అంకితమిచ్చారు. కొన్ని చోట్ల కప్తీకరణలు, కొన్ని వ్యాఖ్యానించినట్లున్న విపులీకరణలు, కొన్ని భావాల పునరావృత్తి అక్కడక్కడా జరిగినా మొత్తంమీద తెనుగుసేత మూలానుగుణంగానే సాగిందనవచ్చు. గేయానుగుణంగా రూపొందించిన ఈ కీర్తనలన్నింటికీ శ్రీమతి అమృతవల్లీ సుందరంగారు రాగాలను కూర్చారు. ఆవిడ, శ్రీమతి వేదవతీప్రభాకరుగార్లు గానంచేసిన రికార్డులు బహుళ జనాదరణనొందాయి.

"మహతి"లోని నేడేరమ్మ "నేడేరమ్మ వాడీన ఈ సుమముగోయ" అన్నగీతం రవీంద్రునిగీతం చదివినపిమ్మట. వాడినతీగెకె గడియ గడియకొక వసంతకాలముదేవా" "కాంచలేను కాంచలేను" అన్నవి బసవరాజు అప్పారావుగారి పాటలను చదివి జాగ్రత! జాగ్రత! మాయజగత్తని" అన్నగేయం దువ్వూరి రామిరెడ్డి పాట చదివి వ్రాసినట్లు ఆయాగీతాలక్రింద పేర్కొన్నారు కృష్ణశాస్త్రి. "కృష్ణపక్షం"లోని "వైరిపాట" అన్నఖండిక బ్లేక్ రచించిన "ది రేడ్స్ ఆఫ్ ఇనోన్సెన్సు"ని చివరలో కొద్దిగామార్చి వ్రాయడం జరిగింది. "పల్లకీ" సంపుటిలోని "హాలికుడు" అన్నఖండిక ఎడ్విన్‌మార్క్‌హామ్ వ్రాసిన "ది మ్యాన్ విత్ ది హో" అనె ఆంగ్లపద్య సారాంశంగా తెనిగించారు. "హాఫీజ్", "ఉమర్‌ఖయాం"ఖండికలు సూఫీసాహిత్య ప్రభావంతోనూ, "లేదోయి నిదుర"లో "లేదోయి సుగతి"

1. "Pluck this little flower"-రవీంద్రుడు.
2.
3.
4.
5. Ruds of Innovence-Blake.
6. ఉదయగానం కావ్యకుసుమానకి వెంకట పార్వతీశ్వరకవులు.

వేంకట పార్వతీశ్వరకవుల "ఉదయగానం" ప్రభావంతో ఆ ఛాయలలోనూ వ్రాయబడినవి.

## బ్రహ్మసమాజ రచనలు

మహతి :- బ్రహ్మసమాజోద్యమ ప్రభావంతో దాని ప్రచారార్థం బ్రహ్మ సూత్రాలతోకూడిన గీతసంపుటి మహతి. ఆయన ఊహలో మహతి కోటిసూర్యుల కాంతిలో ఆరాటమెరుగని శాంతిలో మాటిమాటికిమను దివ్యభావన. కాంతిపూర్ణము, శాంతిమయము అయిన లోకాలని సాధనవల్ల అందుకుని బ్రహ్మానందానుభవరూపమైన ఆనందాన్నిపొంది సమాజానికది అందించడమే ఈ గీతాల లక్ష్యం, ఇదే వీటిల్లో రవళించే మహతీవాదం. శ్రావ్యతనీ, ఆధ్యాత్మికానుభూతినీ ఇముడ్చుకున్నట్టిదీ మహతీనాదం. దీనినే మొదటిగీతంలో సూచిస్తూ కవి కావ్యానికీ పేరుపెట్టడం జరిగింది.

పరమేశ్వరుడి కాంతి ఛాయాంతరానికి ప్రేమార్థులై రమ్మనమని తనలో బోసిన పతితులను పేదలనూ ఎలుగెత్తికేలెత్తి పరమేశ్వరుడు పిలుస్తున్నాడనీ పరుపు పరుపున రమ్మనమని ఆహ్వానిస్తాడు. భగవత్సాన్నిధ్యాన్ని పొందాలంటే అహంకార నిర్మూలనం ప్రథమ కర్తవ్యమనే ఆర్షభావాన్ని అరసంధిస్తూ తనకు భాగ్యముపీడి, పసుపు బిరుదులుపీడి రమ్మంటాడు. చెట్టు చెట్టున చిగురుపుట్టినది, పూపుపూపున కమ్మతావి పుట్టినది, తేటితేటికి తేనె పాట పుట్టినది అంటూ దివ్యజగత్తులోని సౌందర్యాత్మకతను ఆలంకానుకంగాచెప్తూ ఈ నూత్నవసంతోదయ వర్ణనం ఆధ్యాత్మికి చైతన్యానికీ, బ్రహ్మధర్మ భావాగమనానికీ సంకేతంగా చెప్తాడు. లేదోయి నిదురలో లేదోయి సుగతి చూడవా కనువిచ్చి చూడవా జగతి అంటూ నిద్రని అజ్ఞానంగాను, మెలుకువని జ్ఞానంగాను సంకేతిస్తూ ఆధ్యాత్మిక జగతిని చూడమనీ మంద

మంద మంద శీతమధురానిల తరంగమందు తూగాడు "ఆనంద సందేశాన్ని రాగమ్ములో విరిసెడి వేదోక్తిని వినమంటాడు.

బ్రహ్మసమాజ సిద్ధాంతాలలో ఒకటైన సామూహిక మైన ఆధ్యాత్మికానుభవ అన్వేషణని అన్నదమ్ములు చేతులందుకున్నారు, ఆలుబిడ్డలు తోడు నీడలైనారు, ప్రాణులందరు కూడ నిత్యపథికులైనారు" అంటూ వ్యక్తం చేస్తాడు. "కోటతలుపులు విడగమీటినారోయి, కోటలోపల కొలువు కూర్చినారోయి" అంటూ హృదయాన్ని కోటగా సూచిస్తూ హృదయ కవాటాలని తెరవగలిగితే అందులో కొలువుతీరిన భగవంతుడు సాక్షాత్కరిస్తాడని ప్రతిపాదిస్తాడు కవి. పురుషసూక్తంలోని "సహస్ర శీర్షాపురుష స్సహస్రాక్షస్సహస్రపాత్ అన్నవైదిక" సంప్రదాయానుగుణంగా వేయిచేతులుసాచి వెలుగుచున్నాడు పేరుపేరున నిన్ను బిలుచుచున్నాడు "అంటూ కోటలో కొలువున్నమేటి రారాజునభినుతిస్తాడు." ఆ ఏకేశ్వరుడి "మధురనామంబెపరు వినిచిరో మరగి నిముసము వదలలేననీ, దారిపొడుగున బాటగా నా ధైర్యబలముల యూటగా నాయూతగా విడరాని చెలిగా ఉచ్ఛ్వశాంతిగ దీపకాంతిగ "అంటూ ఆ పేరులోని తీయదనాన్ని గొప్పదనాన్ని ఉల్లేఖిస్తాడు. ఆయన పాదాలు అందుకు నేవటకూ ఆశవదలమనీ కదలినడువగలము మేము, బెదరి తిరిగి రాము మేము "అంటూ భగవదన్వేషణకుసాగే తమ అకుంఠితదీక్షనీ స్పష్టం చేస్తూ గళములోన నొకటిగీతి కనుల మోలనొకటె జ్యోతి అంటూ బ్రహ్మసమాజ సామూహికోపాసనా సూత్రాన్నభివ్యక్తం చేస్తాడు. "దూరమైరాని ద్వారతోరణమైన తోచదే నా మ్రోల దేవదేవా అంటూ తాను దారిలోనె అలసి, ధూళిలోనె సొలసితడసి ఏమౌతానోనని నిరాశని ప్రకటించి," "ఇంత తెలియనియాత్ర ఇంతకాల్చే ఆత్రమెంతకాలమొ నకు దేవదేవా" అంటూ

నిస్పృహని సూచిస్తూ "అంతరంమ్ము నశాంతి "అంతటానీకాంతి అలరించవా దేవదేవా" అని భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. యోగీంద్రుడుగానీ త్యాగశీలుడుగానీ కాని తనకు అమృతజీవనధనుడైన భగవంతుడి అడుగులేలాగున అందు తాయి? అందుతాయా! అని శంకిస్తాడు. తన అల్పత్వాన్ని గుర్తించగానే పరమేశ్వరుడి ఔన్నత్యం భాసించి రాజరాజేశ్వర కిరీట రాజఘటితరత్న మాణిక్యకాంతి నీరాజనార్చితాంఘ్రియుగళుడు", తారకారత్న భాసుర తారసౌర సుప్రభామాలికా జాలశోభితుడు "రాజరాజేశ్వరుడు," ప్రభువు హృదయపతి అయిన అతనిని "వీధివీధుల వాడల విపినములను భిక్షుకుడి"లాగ తిరుగాడే పేద "మలయు దీపములేక మనలు చూపులులేక తెలుపు మాటేలేక వలపుపాటేలేక తెలుపు బరువైపోయి అంధకూపపు బ్రతుకు నీడుస్తూన్న తాను అతనిని చేరగలడా? అని కవి హృదయం ఆక్రోశిస్తుంది. కానీ వెంటనే వెఱవకు హృదయమా! పరితాపమేలనే! వెఱవకు! రమణుడు విడుచునే" అంటూ మనస్సుకు ధైర్యాన్నాశ్వాసిస్తూ ఎట్టి పాపినైన, ఎట్టి చెనటినైన చేపట్టిప్రోచు అతడెట్టివాడో అది ఎట్టిదయో నని కరుణాపరుణాలయుడైన భగవంతుడి దివ్యప్రేమమహత్త్వాని తలచుకుని "మెనుదిరగను విసివికోను వేసారని యడుగు లతో ఇరులరేలలో కఱకురాలలోనున్న ఆ తెరువుని" "మసలక మనునంతకు వరతెంతునంటూ గట్టిపూనికతో" గానమే యున్నంతపఱకు కాలమే యున్నంత పఱకు మున్ముందుకు సాగిపోయే ధైర్యస్థైర్యాలని పొందుతాడు.

పరాత్పరుడి ఔన్నత్యాన్ని గుర్తించిన భక్తుడు "పాపోహం కర్మాణాం పాపాత్మా పాప సంభవా త్రాహి మాం కృపయా దేవ." అని తననితాను గర్హించు కోవడం సహజం. పశ్చాత్తాప దగ్ధుడై కన్నీటి ధారలతో ఆత్మ ప్రక్షాళనచేసుకున్ననాడు పునీతుడవుతాడనీ, భగవంతుడి దయకి పాత్రుడవుతా డనే విశ్వాసంతో "కురియుమురా కన్నీటిని మరిమరి విలపింపుమురా "అని అతని కన్నీటిసరాలు భగవవంతుడి యెదనలంకరిస్తా యంటాడు ఆపరమాత్మ పతితపావనడు లోక మోహన కరుడు భయ శోకహరుడు ప్రాణ సఖుడు కష్టంలోతోడునీడ, రోగానికిమందు, "కలుష దుర్దాంత పంకసంకలిత కుహర ములందు జనించేతన మనస్సు ఆయన పాదపీఠిని పారి గంగానదిలో

---

మహతి కీర్తనలలోనున్న బ్రహ్మధర్మసూత్ర వివరణాత్మకమైన వ్యాఖ్యారూపంగా సాగినదీరచన.

పావనత్వాన్ని పొందుతుందంటాడు. ఈ విధంగా భగవంతుడిమీద అచంచల విశ్వాసాన్నొందిన హృదయం" ప్రళయ శీషణమూర్తిని ప్రణయ శీతల వర్తిగా గుర్తిస్తుంది. అవని యంతా పెద్ద అక్షయ పాత్రగాను అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మగాను కనిపిస్తుంది. "దాంతో శిథిలాల యమ్మలో శిపుడు లేడోయ్ అంటూ వాడ వాడల వాడె! జాడ జాడల వాడె! ఇంటి ముంగిటవాడె! ఇంటింటిలో వాడె అని సర్వాంతర్యామి యైన ఏకేశ్వరుడి భగవతత్త్వాన్నావిష్కరించి చీకటి గదులున్నె జగదీశ్వ రాలయములోనే అంటూ విశ్వమంతా పరంజ్యోతి నిలయమైనప్పుడు సంఘ బాహ్యులుగా కొంత మంది చూడబడడం ఎంత అవివేకమో సూచి స్తాడు. ఈ విధంగా గాంధీ హరిజనోద్ధరణోద్యమానికి ముందే బ్రహ్మ సమాజ ప్రభావంతో గురజాడ అడుగుజాడలలో "పూలలమేమో! పనికి మాలినవారమొయేమో! శ్రీలలితేశ్వర గళనవమాలాకుసుమములమేమో" అని "గుణములేనిదేకులమైతేనేమి? తృణమైతేనేమి శ్రీ చరణమంటునెనిఅంటూ కులంకన్నా గుణంమిన్నగా వక్కాణిస్తాడు. ఏ కౌటిల్యం పేటిసెప్పించిందో యుగయుగాలుగానున్నవైనానరే ఈ ద్వేషపు సంకెళ్ళని తెగవెంచండంటూ ఉద్ఘోషిస్తాడు.

"నానోట నీమాటగానమయ్యేవేళ, నాగుండె నీవుండి మ్రోగించవావీణ" అంటూ తనుపాడే వలపుపాట యెదలోనిండిన ప్రభుని వలపుపాట . అయి నప్పుడు ప్రతీమానవుడి అంతరంగం ఆ భగవంతుడి అమృతవీణగా మ్రోగితే ఈ విశాల విశ్వమంతా భగవన్మయంగానె భాసిస్తుందనీ "నాలుగు దిక్కులా నడిమి స్వర్గమ్మంత గంధర్వసీమగాచేయనా" అంటూ తనలో మ్రోగిన ఆత్మానుభవపు అమృతవీణానాదాన్ని సమష్టిగా భగవదన్వేషకు లందరికీ పంచిపెడ్తానంటాడు. అప్పుడు "ప్రతినవ్వు పలికించు పండు పున్నమియె, ప్రతిగుండె పులకించుపాలకడలే" అంటూ జగమంతా శాంత మధుర బృందావనమవుతుందంటాడు. అచంచలదీక్షతో భగవదనురక్తితోనూ వేదనని సాధన గావించుకున్న కవి హృదయం ఆలయంలోని గంటల ఆహ్వానము నాలకించిన పికాలు ప్రణవాన్నాలపించగ, గుడిని శంఖము

మొరసె, విడెను వాకిటద్వారము ఎడద ఎడదనునిండె గుడినుండియా దైవము అని సర్వమానవతాంతఃకరణాలలో నిండిన మాధవుడిని దర్శించి ఆలపించిన జ్ఞానసూనగాన పరిమళాలే మహతీగీతాలు.

ఇలా ఈ మహతీనాదం ప్రతిహృదిలోనూ భక్తిమరంద మాధుర్యాన్ని నింపి వసుధైక కుటుంబంగా మానవులందరినీ చేయగలశక్తి సంపన్నమైనది. ఆ పాతమాధుర్యాన్నీ, ఆలోచనామృతాన్నీ ఇముడ్చుకున్న "మహతీ" కీర్తనలలో సత్య శివ సుందరాల సమ్మేళనం దీపిస్తుంది.

ఈ విధంగా బ్రహ్మ సమాజానికి మూలమైన నిర్గుణమైన ఏకేశ్వరోపాసన, కులమత భేదాతీతమైన సమతాభావం, నిరంతరజిజ్ఞాస సామూహికోపాసన ప్రార్థనా రూపాలను ప్రతిధ్వనిస్తాయి ఈ మహతీ కీర్తనలు ఇలా ప్రాచీనమై ఉపనిషత్సారం నుంచీ ఆధునికమైన రూసో మానవతా వాదంనుంచీ ఈ భావాజాలాన్ని గ్రహించారు. కృష్ణశాస్త్రి కవిత్వంలో ఈ రెండు పాయలు • కనిపిస్తా యంటారు. శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు (విశాలాంధ్ర - 9-3-30)

ఋగ్వేదం:- బ్రహ్మ మత తత్వాన్ని సిద్ధాంతాలనీ వివరించే ఋగ్వేదంలో ఈ సృష్టిస్థితి లయకారకుడైన ఈశ్వరుడొక్కడేననీ అఖిలమానవలోక మహార్తి అనే హాలాహల భక్షకుడైన పరమేశ్వరుడు శాంతిని సర్వజగత్తుకిస్తాడని మంచిగా చెడ్డ, మధుపుగా మంచుకారు తప్ప ఎప్పటికైనా మారి తీరుతుంది అతని ఆజ్ఞలో ననీ, ఎట్టి భేదాలనీ యెంచక నీవు నేనే అనేవాడు ముక్తి పొందు వాడనీ, లౌకికారణ్యపదములలో మార్గాన్వేషణ చేయించే దీపం ప్రార్థన అనే బ్రతుకులోని విడని వ్యూహాన్ని విప్పి తప్పించే మంత్రమనీ, భగవంతుడి కాంతిధామాంతరానికున్న తాళమూ అదేననీ, బాల్యంలో దాది, పరువాన ప్రాణసఖుడు, కష్టంలో తోడునీడ, రోగానికి మందు అంటూ ప్రార్థనా వైశిష్ట్యాన్నిగడిస్తారు. సంయోగమంటే ఉండకుండటం గాను, "అకలుషస్థిత ఋనయుదయమ్ముగాని, చావు బ్రతుకులదాటి నిశ్చలతనాత్మ యమృతమగు గాని అంటారు. జగత్పిత తండ్రియైతే ధరణి తల్లి అనీ, సాటి మానవుడు సోదరుడు అంటూ సోదరుని వీడితే

తండ్రి ఆదారాన్ని కోల్పోతాడు మానవుడంటారు స్వర్గ నరకాలలో ఉండే భగవంతుడే సత్యమంటారు. గురువు మార్గనిర్దేశకుడు ప్రేమ విజ్ఞానాల వైశిష్ట్యాన్నుగ్గడిస్తారు. భగవంతుడే తన అనుగుతండ్రి అనదీ, వాడిపోవక ఎప్పుడు పలచుతావి వెగటు కాబోక ఎప్పుడు రిగులు తీపి, మూగవోవక యెప్పుడు మ్రోగుపాట అనదే మతంగా భావిస్తారు. మతా జీవితబలాన్ని నీతిఇస్తే, నీతిని ఎల్లప్పుడూ పవిత్రంగా ఉంచుతుందిమతం. ఇలాంటిమతమూ నీతి ఒకదాన్ని మరొకటకనుక విడిస్తే వికృతమవుతాయి. ప్రేమతికంటె గొప్పదనీ మానవుణ్ణి అదే శాసిస్తుందంటారు. "ఆదినొక్క చిన్మూర్తిగా నవతరించి యలనల్లన సత్యరూపవతి నతిశయించి పూర్ణమై భవమూర్తి సంపూర్తినందువాడే మానవుడు "అంటూ విపరిస్తారు. అజ్ఞానాంధకార జగతినుండి కాంతిమయ జగదీశ్వరాలయాన్ని చేరడానికి నిత్యము యాత్ర సాగించే బాటసారి మానవుడు. సుఖదుఃఖాలని సమదృష్టితో కాంచేవాడే భగవంతుడు. భగవన్నిలయమైన ఈ జగత్తే అతని గృహమూ ఆలయము కూడా. మానవుడి దౌర్బల్యమే పాపమనీ, పరితాపంతో దాన్ని క్షాళనచేయ వచ్చునీ ఈనాటి ఘోరపాపాత్ముడుకూడా రేపు తాపసిగా మారవచ్చని ఆశంసిస్తాడు. "శిక్ష" అనేదే భగవత్సంసారంలో లేదనీ క్షమార్పణ నడిగితే తప్పక లభిస్తుందనీ ధైర్యవిశ్వాసాలవిస్తాడు. స్వర్గనరకాలనేవి విభిన్న లోకాలుకాక ఆంతరంగిక స్థితులు, సిద్ధాంతాలంటూ భగవంతుడి దివ్య గృహమే నరకమనే వైద్యశాల, వైద్యుడు ప్రేమ, అంతరంగ సంతాపమే ఔషధము, అదే దండనని వోగాక్షేదని వివరిస్తాడు. భగవన్మందిరమే స్వర్గమూ - ఇల్లూకూడాననీ భగవద్విశ్వాసంయొక్క అవసరాన్ని విశదపరుస్తాడు. నిష్కామకర్మనీ, జీవన్ముక్తినీ వివరిస్తూనేవ నాకృషి నీదయ స్వీకరించి యలరచేయుట అనీ నేనెక్కడికి వెళ్తే అక్కడికి అతడు వస్తాడు నేనెక్కడుంటే అతడక్కడుంటాడు "అన్న పరమే వ్రానుభవమే ముక్తినీ అని బోధిస్తాడు. విద్యుక్తధర్మ నిర్వహణాన్ని గూర్చి, నిరంతరం సుంచిరంగా వర్ధిల్లే సృష్టి గురించీ, పరమాత్మ విచ్ఛేసిన అంతఃకరణ దర్శనను భూతే తీర్థయాత్ర అనీ అన్నిదుర్గుణాలకీ కారణభూతమైన స్వార్థాన్ని నశింపజేయాలనీ, సత్యరతి, ధర్మగతి గృహస్థవిధి, అతిథి యర్చన, స్వదేశసేవనం అఖిల మానవానురక్తి ఉండాలనీ ఈశ్వర భక్తులను సప్తపదిగా సంకేతించడం, అహంకారాన్ని త్యజించి అంతటా (బహిరంతరాలలో) భగవంతుణ్ణి సందర్శించేవాడే ఆస్తికయోగి ఏకేశ్వరోపాసనని తెలిపేదేఆస్తిక మతము ప్రతి శ్వాసనిశ్వాసలలోకూడా భగవదారాధననేకాంక్షించడం, సర్వక్రియలనీఆయన ఆరాధనగానె మలచడం చేయాలంటూ బోధిస్తుందీ ఋగ్వేదసంధ్య సంపుటి.

---

ఋగ్వేద పద్యాల్లో ఇమిడున్న బ్రహ్మసమాజ ధర్మాలు, సూత్రాలు బ్రహ్మమత సిద్ధాంతాలను గూర్చినవి.

# భావ కవులు

ఆంగ్ల సాహిత్యంలో 17వ శతాబ్ది ఉత్తరార్థంలో ప్రారంభమయిన కాల్పనికోద్యమ ప్రభావం క్రమంగా ప్రపంచ భాషా సాహిత్యాలమీద ప్రసరించింది. భారతదేశంలో ఆధునికయుగంలో ఈ కాల్పనికోద్యమం వివిధ భాషా సాహిత్యాలమీద తన ప్రగాఢ ప్రభావాన్ని చూపింది. పంతొమ్మిదవ శతాబ్దంలో ఆంధ్ర సాహిత్యంలో నవ్యకవిత్వారంభమయిందనీ కందుకూరి ఈ యుగప్రవర్తకుడనీ పలువురి అభిప్రాయం. కట్టమంచి రామలింగారెడ్డిగారి "ముసలమ్మ మరణం"లో నవ్యకవిత్వ బీజావాపం జరిగి గురజాడ రాయప్రోలువారి పోషణలో ననలుదీరి భావకవుల చేతిలో శాఖోపశాఖలుగా విస్తరించి ఫలపుష్పభరితమయింది "భావకవిత"గా రూఢికెక్కిన నవ్యకవిత్వం. భావకవిత్వ విభిన్న నిర్వచనాలని పరిశీలిస్తే భావప్రాధాన్యం, ఆత్మాశ్రయమైనదై తన సుఖదుఃఖాలనే మాత్రం గోప్యంలేకుండా వెలిబుచ్చడం, ప్రకృతివర్ణనము, మనోనేత్రానికి సాక్షాత్కరించే సుకుమార సౌందర్య తత్త్వాన్ని భివర్ణించడం, ఆత్మార్పణారాధనాతత్త్వాన్ని పొందించుకోవడం, స్త్రీని అత్యుదాత్తంగా భావించి ఆరాధించడం, స్త్రీ పురుషుల బాహ్య సౌందర్యాన్నికాక అంతస్సౌందర్యాన్ని వర్ణించడం, అస్పష్టత. ఖేదంలో మోదాన్నీ, అలౌకికానందాన్నీ పొందడం, నూతనతావాదం దార్శనిక దృక్పథాన్నలవర్చుకోవడం మొదలైన లక్షణాలతో విరాజిల్లుతోంది భావకవితా స్వరూపం. ఆచార్య సి. నారాయణరెడ్డిగారి పరిశోధనా గ్రంథంలో ప్రణయ, ప్రకృతి, భక్తి, దేశభక్తి, సంఘసంస్కరణ, స్మృతికావ్యాలుగా విభజించబడింది ఈ భావకవిత.[1] గురజాడ, రాయప్రోలు, వెంకటపార్వతీశకవులు, విశ్వనాథ. తల్లావఝుల, వేదుల, దేవులపల్లి, నాయని, నండూరి, మల్లవరపు విశ్వేశ్వరరావు ప్రభృతులందరూ పైనుల్లేఖించిన విభిన్న మార్గానుయాయులై భావకవులుగా వినుతికెక్కినవారు. భావకవితా మార్గాలన్నిటిని చేబట్టి విలక్షణమైన వేషభాషలతో "భావకవి"ని తలుచుకోగానే మన మనోనేత్రానికి గోచరించేది కృష్ణశాస్త్రి. ఆయన భావకవి ప్రతినిధి. నవ్యకవిత్వాన్నొక ఉద్యమంగా నడిపి సుమారు పదిసంవత్సరాలపాటు తెలుగునాట ఊరూరా తిరుగుతూ ఆనాటి నవ్యకవుల పద్యాలుగేయాలు సభల్లో చదువుతూ

---

1. ఆధునికాంధ్రసాహిత్యం-సాంప్రదాయాలు-ప్రయోగాలు-పుట-475.

ప్రచారం సాగించింది ఆయనే! ఆయన మృదు మధుర గళా లాపాన్ని నివి ఆకర్షితులైన యువకులెందరో ఆయన వాణినీ బాణినె కాక కట్టూబొట్టూలతో సహా అనుకరించి "భావకవి"కొక ప్రత్యేక రూపాన్నేర్పరిచారు. శ్రీశ్రీ వంటి అభ్యుదయ యుగకర్తమీదకూడా కృష్ణశాస్త్రి ప్రభావం పడిందంటే అదెంత బలీయమైనదో తేటతెల్లమవుతోంది. కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్ష ప్రవాస, ఊర్వశికావ్యాలు, నండూరివారి ఎంకిపాటలు వెలువడ్డాక తెలుగు సాహిత్యరంగంలో గొప్ప అలజడి చెలరేగింది. భావకవులనేక దూషణభూషణలకి గురికావలసివచ్చింది. అందులోనూ కృష్ణశాస్త్రిగారు వాటికి గురిఅయినంతగా మరెవ్వరూ కాలేదు. అక్కిరాజు ఉమాకాంతంగారి "వాఙ్మయ పరిశిష్టభాష్యం-నేటి కాలపు కవిత్వం"లోని, అనంతపంతుల రామలింగస్వామిగారి "శుక్లపక్ష" కావ్యంలోని కర్కశ విమర్శకశాఘాతాని కెక్కువగా పాలయినది కృష్ణశాస్త్రిగారే. ఆయన కవిత్వాన్నే కాక వేష భాషలనీ ఘాటుగా దుయ్యబట్టి "కృష్ణపక్షాత్ కాకమూ" అని వెంటించడం కూడాజరిగింది. అసలు శుక్లపక్ష" కావ్యనామకరణమే కృష్ణ పక్షానికధిక్షేపణగానూ వ్యతిరిక్తంగానూ స్ఫురిస్తుంది కానీ వీటని వేటినీ లక్ష్యపెట్టక భావకవిత్వ ప్రచారాన్ని కొనసాగించడమేకాక సంఘ సంస్కరణోద్యమంలో కూడా పాల్గొని సమాజంచేతా సంఘువర్గంచేతా వెలివేయబడినా చలించక ఉన్నతాశయా దర్శాలకోసం పాటుపడి కార్యశూరులై భావకవితాకాశంలో ధ్రువనక్షత్రంలా విరాజిల్లుతున్నవారూ కృష్ణశాస్త్రి కనుకనే కీ॥ శే॥ విశ్వనాథ కవిసామ్రాట్టులు "ఎవ్వరేమన్నా భావకవిత్వమనేదానికి రూపమిచ్చి పెంపొందించినవాడు కృష్ణశాస్త్రి. అచ్చంగా భావకవిత్వమే వ్రాస్తాడు. అదే అతని వైశిష్ట్యం..........భావ కవిత్వమనేది అర్థమయ్యే విషయంకాదు. హృదయానికి అవగతమయ్యేవిషయం. నీ హృదయంలో ఏదో తారాడుతుంటుంది. అది బాధగా ఉంటుంది. ఆబాధలో ఒకసుఖం ఉంటుంది. అది జీవన్ముక్తి కలిగిస్తుంది. ఇదమిత్థమని మనం చెప్పలేంది. అదే భావకవిత్వంఅంటే అది వ్రాయగలవాడొక్కడే. అతనిపేరు కృష్ణశాస్త్రి. అతనిననుసరించి చాలామంది వ్రాస్తారు. ఎవ్వరూ అతని నందుకోలేరు. అతనికాంతే ఈ సౌధమంతా వ్యాపించి వుంది" [2]అన్న మాటలు కృష్ణశాస్త్రిగారిపట్ల సార్థకమవుతూ భావకవిత్వ జీవ లక్షణాన్ని విస్ఫురిస్తోంది.

---

1. శుక్లపక్షం - అనంతపంతుల రామలింగస్వామి
2. కృష్ణపక్షం స్వర్ణోత్సవసంచిక - పుట - 69 - "అతని కాంతే ఈ సౌధమంతా" "విశ్వనాథ"

# కృష్ణపక్షం — ప్రవాసం — ఊర్వశి

కృష్ణశాస్త్రిగారిని "భావకవి సామ్రాట్టు"గా చేసిన కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశీ, కార్తీకి కావ్యాలు. ప్రకృతి ప్రీతి, స్వేచ్ఛా ప్రియత్వం, వేదనాప్రియత్వం, సౌందర్య తృష్ణ, ఊహాప్రేయసి - ప్రణయం - భగవత్ప్రణయం మొదలైన భావకవితా మౌలిక సూత్రాల కనుసంధింపబడ్డాయి. ఈ ఖండకావ్యాల్లోని ఖండికలు.

నల్లమల అడవులలోని ప్రకృతి సౌందర్యానికి కవిహృదయం పరవశించి "ఆకులో ఆకుగా, పూవులోపూవుగా కొమ్మలో కొమ్మగా నునులేత రెమ్మగా" లీనమైపోవాలని ఆకాంక్షిస్తుంది.

"గలగలమనివీచు చిఱుగాలిలోఁగెరటమై
జలజలమనిపాఱు సెలపాటలోఁ దేటనై" అంటూ జడ - చైతన్య ప్రకృతులలోని సౌందర్యాన్ని దర్శించినకవి "యెద"ఆ ప్రకృతి ప్రత్యణువులోనూ నిండిపోవాలనె కాంక్ష నభివ్యక్తం చేస్తుంది. "పగడాల చిగురాకు తెరచాటు తేటినై, పరువంపువిరిచెడే చిన్నారి సిగ్గునై," అంటూ ప్రకృతిలోని ప్రణయ తత్త్వాన్నావిష్కరిస్తూ ఇటువంటి ప్రకృతి శోభాదిదృక్షలో ఆకలీ దాహమూ, చింతలూ వంతలూ ఏవీ ఉండవనీ, "ఈ కరణివెట్టినై యేక తమ తిరుగాడ "అంటూ అందులోవిలీనమైపోవాలనే తన్మయతని భజిస్తాడు.[1]

ఆప్రకృతిలో హాయిగా స్వేచ్ఛగా విహరించే పిట్టల్ని - పిల్లగాలుల్ని, మేఘాల్ని - మెఱుపుల్ని, చుక్కల్ని - చందమామనీ [2]చూసి తానుకూడా స్వేచ్ఛావిహారం చేయాలని వాంఛిస్తూ "ఏను స్వేచ్ఛాకుమారుడ, ఏమగగన పథ విహారవిహంగమపతిని" అంటూ "నవ్వి పోదురుగాక నాకేటిసిగ్గు? నాయిచ్ఛయేగాక నాకేటి వెఱపు" అంటూ లోకంలో ఎవ్వరేమనుకున్నాతనికి లెఖ్ఖలేదనీ తన స్వేచ్ఛా ప్రియత్వాన్ని స్పష్టంచేస్తారు. ఈ స్వేచ్ఛా సామాజిక పరంగా కట్టుబాట్లనుంచైనా కావచ్చు, నాటిరాజకీయ పుటస్వతంత్రతనుండైనా కావచ్చు, లేక సాహిత్యపరంగా లాక్షణిక బంధనాలనుంచైనా కావచ్చు. ఇలా వైయుక్తిక స్వేచ్ఛనేకాక సమాజానికంతటకీ ఈ స్వేచ్ఛా స్వాతం

---

1. కృష్ణపక్షం — "ఆకులో ఆకునై" - పుట - 1
2. ,, స్వేచ్ఛాగానం - 2 - ,, - 5 - 7

త్ర్యాలు లభించాలని అభిలషిస్తాడు. "తిమిరలత తారకాకుసుమములు దాల్చి కర్కశ శిలయు నవజీవ కళలం దేలి మోడు మోక చివురులొత్తి మురుపు చూప" అంటూ చైతన్యరహిత ప్రకృతిలో చైతన్య వికాసాలావిర్భవించే టట్టు. "క్రౌర్య కౌటిల్య కఠిన కల్పిత దాస్య శృంఖలాలు తమంతతామే చెదిరిపోవ గగనతలము మార్మ్రోగగ కంఠమెత్తి స్వేచ్ఛాగానాన్ని" ఆలపిస్తా నంటాడు. "యుగయుగాలుగా స్వేచ్ఛకోసం ప్రాణ సుమాలర్పించినవారిని ఈశ్వరయోధులుగా" పేర్కొంటూ వారి యశోగానాన్ని చేస్తాననడంలో సాతంత్ర్యోద్య ప్రభావమభివ్యక్తము.[1]

కాని సమాజపు కట్టడులూ నిష్ఠానియమాలూ అతని స్వేచ్ఛా ప్రియత్వానికీ ప్రేమమయైక జీవితానికీ ఆటంకాల్ని కలిగిస్తాయి. దానితో "పక్షినని. పాడగలనని, ప్రణయవీథి నిత్యలీలావిహారముల్ సలుపుదునని, పక్షములదూల్చి బంధించి పంజరాన గానమును ప్రాణమును హరింప బూనినారు"[2]అని ఆక్రోశిస్తాడు. "హృదయ శోణితధారనెదుగు జీవితవల్లి మొదలంటనూర్చినారే, భయదాగ్ని కీలలను ద్రేచ్చినారే"[3]అంటూ సామాజిక నియమాలు ఆశయోపేతమైన తన జీవితాన్ని నాశనం చేయడంవల్ల తనకు కలిగిన దుస్సహదుఃఖంయొక్క తీవ్రతని ప్రకటిస్తాడు. ఆ పంజరబద్ధమైన పరితప్త హృదయానికి "అమలమోహన సంగీతం"లో కూడా "హృదయ దళన దారుణరోదనధ్వనులే"[4]వినిపిస్తాయి. వర్షించే మేఘాన్ని చూసి ప్రకృతి కూడా సహానుభూతిని చెందుతూన్నట్టు భావిస్తూ "ప్రావృడంభోధర స్వామి! నీవు కూడ నావలెనే జాలివాడవై వాపోవుచుంటివం"టాడు. "సగము వాడిన మృదుల పుష్పమ్ము నమ్మ, లేకున్న నెలప్రాలు"[6]అని దుఃఖాన్ని వేడుకుంటాడు. నిరంతర దుఃఖపరిచర్యంతో కొంతకాలానికి విషాదం లోనే ఆనందాన్ని, కష్టంలోనే సుఖాన్ని పొందగలిగిన మానసికస్థితికెదిగి "కన్నీటి కెరటాల వెన్నెలేలా! విట్టూర్పుగాడ్పులో నెత్తావియేలా"[7] అంటూ విషాద మాధుర్యాన్ని చవిచూసి "నేను నా దుఃఖమే తోడునీడకాగ గడిపి

---

1. స్వేచ్ఛాగానం 1 పుట 3,4
2. పక్షినని పుట 49
3. అబ్బ ,, 50

కొనుచుందు నిశయెల్ల కనులు చెఱచి"[1] అనీ, "నన్నుగనియేరు జాలిచెందంగ వలదు, ఎవ్వరని యెంతురో నన్ను?" అంటూ తనని "శోకక్షీకర తిమిర లోకైకపతి"గా పేర్కొంటూ తనకి కన్నీటి సరులదొంతరలు, నిరుపమ నితాంత దుఃఖంపు నిధులున్నాయంటూ అవి తనకి అపూర్వమూ అమూల్యమూ అయిన సౌఖ్యాలని స్తాయంటాడు.[2] "మనసారగ నేడ్వనీరు నన్ను" అని తనని ఒక్కసారి విడిస్తే "యవనికాభ్యంతరమున వెక్కివెక్కి యేడ్తు, విసుపులేక విరతిలేక దుర్భర శోకవిషమగీతులేడ్చిపైతు, ఎలుంగెత్తి యేడ్చిపైతు"[3]నంటూ తన శోకప్రియత్వాన్ని వెల్లడిస్తాడు. తుదిమొదలు కాని కానరాని మహాంధకార కలుషిత కృష్ణపక్షపు వీథిలో చేయిచేయి కలిపి కలిసిమెలసి జీవించిన "సహధర్మచారిణి", "మధుర మధురమూర్తి", "ప్రియురాలు", "సఖురాలు", "పూర్ణరాగకాంత" అయిన దుఃఖం తన అసువులు తొలిగిపోతే తనని వీడిపోతుందేమోనన్న వెరపుతో మృత్యువును వద్దన్నాను కాని మృత్యుభీతితో కాదంటాడు.[4] "వెఱ్ఱిలోకమా! హృదయంపు స్వేచ్ఛాగీతులు పంటించుబడు బంధింతె?"[5] అంటూ ఒక సుందర ఊహాస్వర్గాన్నేర్పరుచుకుంటాడు. "నా నివాసమ్ము గంధర్వలోక మధుర సుషమా సుధాగానమంజువాటి"[6] అని ఒక ఊహాస్వర్గాన్నేర్పరుచుకుని (Utopia) "శూన్యలోకము దాటి శుష్కదేహము దాటి అక్కడికి వెల్తూ "ఆవలిదరి నీపిలుపు పవలు రేలును మ్రోయ ఈ విరహ సంతాప మీ ప్రవాసక్లేశమే పగిది సహింతు? ఇదె వచ్చుచున్నాను ప్రియురాల!"[7] అంటూ ప్రవాసకావ్యానికి నాందిని పలుకుతాడు. "కవికుమార! ఎచటకేగుచునుంటివో యేమొ నేడు"[8] అని ప్రవాసంలోకి కవి సాగటాన్ని సూచిస్తాడు. హృదయగతమైన ఒక సౌందర్యమూర్తికి ప్రేయసిగా రూపకల్పన గావించుకున్న భావుకుడికి ఆమె విరహంతో చుట్టూ చీకటముసిరి అతనిలో విషాదం పొంగిపొరలి దశదిశలనీ ముంచెత్తి దారులనన్నింటనీ మూసివేస్తుంది. ఆ "అగమ్యతమస్వినీ గర్భకుహరాలలోకి[9] మాయమయిన ప్రేయసి కడియాల రవళులు చిరుగాజు మ్రోతలే అతని జీవితపథాన్ని నిర్దేశించేవి, కేలెత్తి నడిపించేవి, ఎలుగెత్తి

---

4. నా జీవితము ,, 9
5. [illegible]కంఠ ,, 54
6. దుఃఖము ,, 56 | కృష్ణపక్షం
7. ఆశ ,, 53 | కృష్ణపక్ష సంపుటి

పిలిచేవి[10] కాగా ఆమెకోసం అన్వేషణనారంభిస్తాడు. ఆవిధంగా వెతుకుతున్న తనకి ఆమె "మృదువసనాంచలాల గుసగుసలు" కూడా కనపడకపోవడంతో దుఃఖం పొంగుకురాగా గొంతెత్తి యేడ్చే తనని చూడలేక తారకలు "కన్నులప్పై మూర్ఛకొనినవి", మొగిళులల్లనల్లన నలనల్లనైభరమ్ములైన నిట్టూర్పులంతరలైనవి" అంటూ ప్రకృతి కూడా తనతో సహవేదనని పొందిందంటూ "అప్పుడీ విశ్వమే నిత్యయాత్రనాగి శ్రవణములు మూసికొన్నినది" అంటాడు. అంతమేలేని తన యాత్రాపథంలో తన పదచిహ్నాలవంటివెన్నెన్నో అడుగుజాడలు తన "ఆర్ద్రహృదయం"తో "నిశికడుపులో తారలై నిశ్శబ్దవాటిలో చిఱుపాటలై"[2] రవ్వంత వెలుగునీ అవంత ఆలంబనాన్నీ అందిస్తాయి, దానితో కొత్త బలంతోనూ ఫలంతోనూ పగలూరేలూ అజ్ఞాతభావిలోని ఆశాకిరణాన్నాధారంగా చేసుకుని తన ప్రియాన్వేషణయాత్రని కొనసాగింపచేసుకుంటాడు. ప్రేయసిలేని జీవితం శూన్యంగానూ భారంగానూ కనిపిస్తుంది. "నాకు గాదులులేవు, నాకుషస్సులు లేవు, నాకు కాలమ్మొక్కటే కాళరూపు, నాశోకమ్ము పలెనె, నా బ్రతుకువలె నావలెనె"[3] అని తన నిరాశా నిర్వేదాలన్ని వ్యక్తం చేస్తాడు. ప్రియురాలిని "అమావాస్యా తమస్విని"గానూ, "గగన సీమంతిని"గానూ ఉల్లేఖిస్తాడు. "పగలెఱుగని ప్రవాసమునకు వేకువరేకు విరియదో"[5] అంటూ నిస్పృహ చెందినా "అనిమేషాలోకనముగా లోకమెల్ల పీనుగా కాలాంతమునకు కాచియుందునా! అసలేన్ని ఆనవు ప్రాణాంతమే వేచియుందునా!"[6] అని తన

---

1. నిశాలోచనము కృష్ణపక్షం పుట 53
2. నన్నుగని ,, ,, 60
3. మిఱుమనసారగా ,, ,, 62
4. నాకు మరణమ్ము ,, ,, 79
5. లోకమా ,, ,, 47
6. "నా నివాసమ్ము" ప్రవాసం పుట 103
7. ఇదె వచ్చుచున్నాను కృష్ణపక్షం ,, 82
8. నిర్యాణము ,, ,, 83
9. దారులన్నియు మూసె ప్రవాసం ,, 88
10. ,, ,, 39

అంతూదరీలేలేని నిరీక్షణలోని దీక్షని సూచిస్తాడు. తనది ముగియబోని, ఏ అర్థమెరుగని వేసటలేని వెఱ్ఱి అన్వేషణమ్ము"[7]గా తనలోని సౌందర్య తృష్ణనీ. అంతర్జ్వాలనీ స్ఫురింపచేస్తాడు. "ఒక్క నిట్టూర్పువోలిక, ఒక్క మౌన బాష్పకణమటుల ఒక గాఢవాంఛపగిది"[8] కదిలిపోతానంటూ ఉత్తరోత్తర బలవత్తరాలైన ప్రవాసయాత్రాలోని వివిధ దశలనీ పేర్కొంటాడు. ప్రవాస భారాన్ని మోయలేక "ప్రవాసినై ఉండలే"నంటూ చివరకి మరణవాంఛనభివ్యక్తం చేస్తాడు. "ఏనుమరణించుచున్నాడ![9]నామరణశయ్య పఱచుకున్నాను నేనె, నేనె నాకు వీడ్కోలుపులిప్పించినాను"[9] అని మరణ వాంఛావనిగా సాగిన తన విషాదభావన మళ్ళీ కొత్త ఆశల ఊతాన్నిపొంది "ఎవరహో! ఈ నిశిథినెగసి నీడవోలెనిలిచి పిలుతురెవరహో!"[1]అంటూ నిరాశానిశిథిలో ఆశాకిరణంలాంటి పిలుపునందుకుంటాడు. ఇలా ఊహా ప్రేయసి ఊర్వశి సాక్షాత్కారాన్ని సూచిస్తాడు కవి.

అసుందరతా నిరాశా నిస్పృహల కాలవాలమైన తనన్ని రుజ, జర మృత్యువులుగా సంకేతించుకుంటూ నిశావసానంలో "ఏశుభానిలమ్ము నిట్టూర్చెనో జాగరాగ సేతు" అన్ని తన నిరీక్షణ ఫలించి తనపైని కరుణతో "తారగా", "దివ్యమందార సుమం"గా, "మోహనీహాస మల్లీ ప్రఫుల్లరుచి"గా, శ్రీలత వైజయంతీ పరీమళమ్ము", "హరజటాపారిజాత లతాంతంగా"[3] ప్రేయసి కవిముందు సాక్షాత్కరిస్తుంది. అటువంటి ఉజ్జ్వల సౌందర్య సౌకుమార్యలావణ్యరాశి, కరుణామయి అయిన ఆమెను తన "వడకుకేల స్పృశించలేననీ, "వెరిగు రెప్పరేకుల విరియలేనంటూ సుదీర్ఘ వియోగంతో "మోడువారిన ఎడదనెటుల దిమికోగలననీ", చెరగి నెరసిన చింపిరి

---

1. అపుడు ప్రవాసము పుట 90
2. ఈ పయనపుం చెరుపు ప్రవాసము పుట 93
3, నాకుగాములు ,, ,, 98
4. ప్రేయసీ; ప్రేయసీ ,, ,, 99
5, 6. వినరావీ విభావరీ .. .. 101, 102
7, 8. నా నివాసమ్ము-ప్రవాసం .. 104
9. ఏను మరణించుచున్నాను .. 108

కురులలో ఎట్లుదాల్తునని"[4] తన సంకోచాన్ని, అశక్తతనీ వెల్లడిస్తాడు. "నిద్దురవోపు వల్లకాడు" వంటి తననిరాశా నిశ్చేతన్య సౌందర్య విహీనపు బ్రతుకికి ఆమె సాక్షాత్కారం "విభాత మహోత్సవాన్ని కూర్చింది. దానితో "తన మనస్సులో సంతోషసాగరతరంగ తరంగాల సవ్వడి "నూత్నకల్యాణ తూర్యమనోజ్ఞగాన నృత్యకోలాహలం"గా ధ్వనించి, "ఆనంద తరంగాల శీకరాలే సువర్ణ మంగళాక్షతాశీర్వర్షంగా భాసిస్తుంది. "త్రిజగతీపతి కోటీర దివ్య రత్నరాజినెలు వజ్రాల తురాయి"గానూ, మఘవమస్తక మకుట మాణిక్యరాజ్ఞిగానూ అభివర్ణించడంలో ఆమె ఔన్నత్యాన్నీ "పాతాళంపు లోయకు సంబులందు దిగబ్రాకవెలుచు గాఢాంధకార రేఖ"గా[7] తనను తెలుపుకోవడం తన దైన్యాన్ని ప్రస్ఫుటం చేస్తాడు. తమిద్దరి వివాహవేదిక "తారకా పూర్ణచంద్ర మార్తాండ బింబమండితమ్ము మహాకాశ మంటపమ్ము" అని తెలిపి దానిని చేరడానికి ప్రేయసి తనఅత్యున్నత స్థానమ్మునుంచి దిగిరావాలి, తాను తనహీన స్థితినుంచి పైకి ఎగరాలి "పతిత పెట్లపుడు? నెనెట్లుపక్షినౌదు అంటూ ఎంతో దుస్సాధ్యంగానే భావించి తమ కలయిక ఏవిధంగా పొసగుతుందని వాపోతాడు. ఇన్ని కల్పాలుగా కవిలో రగులుతున్న వేదనాసుఖం ఆమె సాక్షాత్కారంలో పలకరించిందంటూ ఆమెను తన చిరకాలవేదనా స్వరూపంగా భావిస్తాడు. ఆ శోకంలోని సౌందర్య సౌకుమార్యాలా వ్యాపే ఘనీభవించి ఊర్వశి ఆకృతిని పొందాయి. ఆ భావాన్ని "ఉషకాల కౌముది సొగసు"గా, "తొలిప్రొద్దు నునుమంచు తీవనాన"గా, "బయిరునిశ్వాసముల మాసిపోయిన వియోగ కపోలపాళిక"గా, "విశ్వవేదనా మూల్య భాగ్యము"గా, "దాను గళమ్మారపాడుకొనిన అఖాత శోకగీతమ్ములలో నొక శోకగీతి[1]గా ఆమె అలౌకిక సౌందర్య వర్ణనలో ధ్వనింపచేస్తాడు. ఆమె "చిరుణారుణా మణికణమ్మె" కనుక దొరికితే మూడులోకాల సుఖాన్ని ఒక్కముడి నిమిడ్చి విసురుతాడట! కాలాంతాన్ని వెనక్కి పోయేటట్టు చేస్తాడట![2] సనాతన, నిత్యనూతన అయిన ఆమె విరహం "హాలాహలానలం", ప్రణయం "అమృతశీతల రసం", యుగయుగాలుగా ఆమెకోసం అతని నిరీక్షణ సాగుతూనే ఉంది. కనుకనే "తొలివియోగిని", తొలి ప్రేయసి" అయిన ఆమె

1. ఇన్ని కల్పాలు - ఊర్వశి - పుట 116
2. నాడు "శాపో" విరహ ,, ,, 117

"ఆనాటికీ ఈనాటికీ" అతనిదే ![1] అతనికి ఆమె కన్నులలో అనంతాంబరపు నీలినీడలు కనిపిస్తాయి. అవి ఏదో అపూర్వ మధురశక్తిని స్ఫురింపచేస్తాయి. గాని అర్థంగాని భావగీతాలవంటివట[2] ! ఆమె తన "యెదలోపలి యెదలో నెమ్మదిలో జీవిత రహస్య మార్గమ్ములలో వదలనికోరిక"[3] అంటే అతని లోని సౌందర్య భావసకంతతకీ ఆకరమైన విశ్వసౌందర్య సారమూర్తి. ఆమె ఆజ్ఞకనుక లభిస్తే గొంతు ముడివీడి హాయిగా యుగయుగాల కలలనీపాడి దిగంతాలకీ తారాపథానికీ సౌందర్యోజ్జ్వల సందేశాలని పంపుతానంటాడు. నిర్ఝరాంగనాదరస్మితమయిన తన జీవితము ప్రపంచమంతా వ్యాపించి ప్రేమతో ఈరేడు లోకాల్నీ పిలుస్తుంది.[4] చరాచర జగత్తుపట్ల ప్రేమ భావాన్నిపొందించుకుంటుంది అతని హృదయం. దశదిశలనీ తంత్రులుగా చేసి చుక్కల్ని సోపానాలుగాపేర్చి నిర్మించిన విశ్వవీణని తన గళంలో మేళవించి అలపిస్తాడు. తన అంతర్యాన్ని క్షీరసాగరంచేసి మధించి అమృతాన్ని పంచుతానంటాడు. "మోయలేనింక లోకాలతీయదనము; ఆలపింతునానంద తేజోంబునిధుల"[5]నంటూ ప్రణయభావనతో ఉద్దీప్త డవుతాడు. "కలుగునా నాకు నీ వియోగమ్మొకక్షణమైనకనీయ" అంటూ తనకీ ప్రేయసికీ వియోగముండదనే అద్వైతభావనలోకి సాగుతాడు. అభౌతికమూ అలౌకిక మైన ప్రేయసి సోయగం అమూర్తమయినది. తన తీయని ప్రేమా అమూర్త మైనదే. యెడబాటిక వాళ్ళకేవిధంగా ఉంటుంది? వియోగమనేది భౌతిక మైనదేగాని రూపరహితాలకి అన్వయించదుగదా! ఇలా అమలిన శృంగార భావాన్నావిష్కరిస్తారు. ఈ సత్యదర్శనంతో కవి ప్రణయభావన సత్యశివ సుందరాలని సంతరించుకుని, ఆతడందులో అంతర్ముఖుడవడానికి దోహద మవుతుంది. అది భగవదభిముఖమై మధురభక్తి భావనలోకిసాగి తనవి

---

1. కాలమే ,, ,, 119, 120
2. ఆమె కన్నులలో ,, ,, 123
3. ఎదలోపలి ఎదలో ,, ,, 124
4. నవనవ వసంత ,, ,, 131

"అస్పష్టత" అనే భావకవిత్వ లక్షణం వ్యంజింపబడింది. దీనినే విశ్వనాథ "అవిస్పష్ట వాంఛాంకురం"మన్నారు. "భావకవులవలె యేవో తెలియని పాటలు పాడుతోయ్"
— సినీగీతం

5. నాహృదయమందు - ఊర్వశి - పుట - 134

(ఆత్మ) ప్రేయసిగా, పరమాత్మణ్ణి ప్రియుడిగా భావించుకుని అతనికై పరితపించనారంభిస్తుంది. సుదీర్ఘ వియోగమూ, నిరీక్షణా కవికి అలసటను కలిగిస్తాయి. భగవత్సాక్షాత్కారంతో ఆ నిరీక్షణ సఫలమవుతుందిగానీ బాగా బడలి ఉండడంతో కడలివంటి నిద్దుర బరువుతో కన్ను మూసుకుపోతున్నాయి. ఆ నిద్దురమరపులో తానుండే తనకి లభించిన స్వామి సన్నిధి అనే పెన్నిధి తనకి ఎక్కడ దూరమవుతుందోననే భయంతో తనదగ్గర సెలవు తీసుకోకుండా వెళ్ళవద్దనీ,[1] "బాసిపోకు నిర్భాగ్యపు బ్రతుకుబాట"[2]అనీ భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. "గాయక సార్వభౌముడు,[5] ప్రతి దినసాంతమందు నిత్యనూతన తాండవకేళితో అవతరించే నటరాజైన ఉగ్రత్వభువును చూచి నెఱ్ఱివాడై తను కూడా ఆయనలాగా ఆడబోతాడు-పాడబోతాడు.[3] సౌందర్య రసైకజీవి అయిన తన జీవిత శుష్కమార్గంలో భగవంతుడి పాదమంజీరాలు మ్రోయలేకపోతే తానెట్లు జీవించగలనంటాడు,[4] ఈ విధంగా ఊర్వశీ ప్రణయం భగవత్ప్రణయంగా పరిణమించి పరిణతినిపొంది కార్తీకిగా సూచ్యమవుతోంది.

సత్ప్రతి సంస్తుతి కావ్యాలు :- మనకత్యంత సన్నిహితులు, ఆత్మీయులూ మన హృదయాలపైన ప్రగాఢ ముద్రవేసినవారూ మరణించినప్పుడు తీవ్రమైన వేదనకి లోనపడం సహజం. భావుకుడైన కవి ఈ వేదనా తంత్రుల కదలికతో స్మృతిగీతాలాలపిస్తాడు. "శోకశ్లోకత్వమాగతః" అని ప్రాచీనులంటే "ఊపి ఊపి మనసు నొక్కొక్క వేదన కావ్యమౌను మరియు గానమౌను" అన్న కృష్ణశాస్త్రిగారి మాటలు వ్యక్తమవుతాయి. ఈ విధంగా స్మృతి కావ్యాలావిర్భవించి విశ్వజనీనమై విరాజిల్లుతున్నాయి వివిధభాషా సాహిత్యాలలోను, వాల్మీకి "మానిషాద" శ్లోకము: రఘువంశంలోని "అజవిలాపం" కుమార సంభవంలోని "రతివిలాపం" వంటివీ కోవలోకి చెందినవే ఆధునిక యుగంలో పాశ్చాత్యుల "ఎలిజీ"ల ప్రభావంతో గురు, మాతృ, సతీ, పుత్ర పుత్రికా,

1, 2. ఏను నిద్దురవోదునో ,, ,, 142, 143
3. ఈ మిడిసిపాటు ,, ,, 149
4. అవతరింతు ,, ,, 150

మహాపురుష, కవి, మిత్ర, సోదర సోదరీ స్మృతులుగా అనేక రూపాల్లో ఈ స్మృతి గీతాలు విరచితమయి ఈ శాఖను విస్తరింపజేసాయి. వీటిని స్మారక గేయాలుగా కూడా పేర్కొనడ కద్దు. కృష్ణశాస్త్రిగారు ఈ స్మృతి గీతాలకోవకి చెందే అనేక ఖండికలు వ్రాసారు. విషాదస్ఫూర్తినే స్మృతి కావ్య జీవలక్షణంగా భావించినట్టయితే ఆయన రచించిన ఖండికల్లోని "కన్నీరు" కావ్యము, చిన్నపూవె", "నావిరులతోట", "ఓమానవోత్తమా", "ఏమిమిగిలే" అన్న వాటిని స్మృతికావ్యాలుగాను, "మహాకవి", మాబాబయ్య-నాన్నగారు "గురుదేవుడు" మహాత్ముడు" మొదలైనవాటిని సంస్తుతి కావ్యాలుగానూ పరిగణించవచ్చు.

<u>స్మృతి కావ్యాలు :-</u> కృష్ణశాస్త్రిగారి మొదటి భార్య చనిపోయినప్పుడు "కన్నీరు" కావ్యాన్నాలపించింది వారి వేదనాతప్తహృదయం. ఆమె వియోగ దుఃఖంతో తన హృదయం ఎలా కరిగి కన్నీరుగా ప్రవహించిందో సూచిస్తాడు. ద్వితీయ వివాహానంతరం ఆయనకి రెండవ భార్యవలన కలిగిన మొదటి సంతానం కొద్దికాలానికే కనుమూయడంతో కలిగిన విషాదాన్ని "నావిరులతోట" అన్న ఖండికలో వెల్లడిస్తారు . తన "విరులతోట"లో ఒక్క పవడపు (ఎర్రని - అనురాగపు) గులాబిమొక్కని నిత్యమూ ప్రణయ జీవనాన్ని వర్షమ్ముగా కురిసి పెంచుకొన్నాడట! కొన్నాళ్ళకి సుకుమార కుసుమ మొకటి ఆవనంలో కిలకిల నవ్వింది. దానితో తన జీవితాశయమే ఆపూవుగా మారినట్లు వలచుకొన్నాడు. పరస్పరానురాగ హృదయాలతో పలుకరించుకుంటూ కాలంగడుపుతుండగా ఒక్క క్రూరార్క కిరణము ఉర్విపాలనా గులాబి సోకూరి నన్నువీడె" అని బిడ్డ మృత్యువాతపడినట్లు సూచిస్తాడు కవి. ఇక్కడ భార్యని గులాబి మొక్కగానూ, "అలరులేని మోడు మ్రాకుగాను

---

1. కృ. శా. గారి మేనగోడలు "సీత"వలన తెలిసిన విషయాన్నాధారంగా తీసుకోవడమయింది. తల్లావఝులవారి పీఠికలో "మొదటిభార్య చనిపోవడంతో" వ్రాసినదని ఉంది. కాని అప్పుడు "కన్నీరు" వ్రాసారనేది ప్రసిద్ధం "నన్ను, నామోడులేని మ్రాకును చూచి" అనడంలో "మోడుమ్రాకు" భార్యని సంకేతిస్తూ దీని కుపబలక మవుతోంది.

మృత్యువుని క్రూరార్క కిరణంగానూ, "గులాబిని" బిడ్డగాను (తమ ప్రణయ జీవనానికి ఫలము) సంకేతిస్తూ సంతాన వియోగ వ్యథార్ద్ర హృదయులైన తమని (భార్యాభర్తలని) చూసి "ఒక్క కోకిలమ్మ "కో" యని యేడ్చె గొంతు నెత్తి, మాకొఱకు దారిఁబోయెడు మందపవనుడు కడుజాలిగ నొక్క నిట్టూర్పు విసరె" అని ప్రకృతికూడ సహవేదనన పొందిందనడంలో తోటి కవిమిత్రులు చూపిన సహానుభూతి వ్యంజింపబడుతోంది.

"చిన్నిపూవె" అన్న ఖండకలో "కాంతునెఱుగని కన్నెగదా! సిగ్గు పీడని మొగ్గగదా! మొన్నమొన్ననే ముద్దువల్లిని మొనలుదీసెనుగా" అంటూ జీవితంలో ఏ ప్రణయానుభూతిని పొందని ఒక కన్యమృతిని "చిన్నెలన్నియు మన్నులో గోల్పోయెనా" అని విషాదభావాన్ని పరమసుకుమారంగా వ్యక్తం చేస్తాడు. ఇక్కడ "చిన్నపూవు"అకాలమరణాన్ని పొందిన ఒకబాలికకు సంకేతం.

"గాంధీ నిర్యాణంలో ఆయనలో కలిగిన తీవ్రమైన నిర్వేదాన్ని" నా అనుంగునేల నలుఁబదికోట్ల గుండియల అలలనిండి నేడు పొంగు నార్తిశోక మరిపేద నాగుండెవారులలొరిసి వెలికి పారునిటుల" అంటూ "నన్ను గన్న తండ్రి, నాకంటివెల్గునాయూత, నాజీవనంపుటూట, బాట, న మెడంద యోర్పు. నాయూర్పు ననువీడి చన్న - ఏమి మిగిలెనన్నయింక!" అని తనమీదపడిన గాంధీ ప్రభావమెంతటిదో వ్యక్తంచేస్తారిలా" నటిబాధ నన్ను మాటాడగా నీనిశ్శ్రయమట్లు వచ్చిపడియెపైని "అంటూ గాంధీస్మృతి తనకి ఎంత వ్యథని కలిగించిందో స్పష్టపరుస్తారు, "మానవోత్తమా" అన్న ప్రవాసంలోని ఖండిక కృష్ణశాస్త్రిగారికి అత్యంత సన్నిహితుడూ మిత్రుడూ "ప్రవాస" కృతిపతీ శ్రీ మొక్కపాటి రామ్మూర్తి పైనవ్రాసినది. పరిమళాభుకుడు, సంస్కార ప్రియుడూ అయిన రామ్మూర్తి జీవితమంతా ఘర్షణలకీ లోనై వాటిల్లోనే ఆత్మార్పణ చొనర్చినవాడు. మానవోత్తముడిగానూ, పిం మూర్ధన్యుడిగానూ, అమృతభాసమానోన్నత ప్రేమ సామ్రాజ్యైక చక్రవర్తిగానూ "స్నేహశీలిగానూ అతనిని పేర్కొంటూ అతని అమూల్యరాగ సంపద, నిర్మలాశయాల ముందు విషాదమోదాలు, ఆశానిరాశల వైవిధ్యభావంతో కూడిన ఈపాటి బ్రతుకే పాటది" అంటూ "నెచ్చెలీ నెచ్చెలీ" అని అతనికీ తనకీఉన్న అనుబంధాన్ని తెలుపుతాయి.

సంస్తుతి గేయాలు :- కృష్ణశాస్త్రిగారు మహాకవులమీద విశిష్ట వ్యక్తులమీద, తమకున్న గౌరవాదరాభిమానాలనీ, భక్తిప్రపత్తులనీ వెల్లడిస్తూ వారి గుణాలనీ, వ్యక్తిత్వ వైశిష్ట్యాలనీ కీర్తిస్తూ రచించిన ఖండికలని "సంస్తుతికావ్యాలు"గా భావించవచ్చు. ఆధునిక యుగంలో ముత్యాలసరాల్ని ప్రచారంలోకి తెచ్చిన గురజాడని స్తుతిస్తూ "ఛందస్సు"చేతనే స్ఫూర్తిని కలుగచేస్తూ "మహాకవి"[1] అన్న ఖండికని వ్రాసారు. గురజాడ ముత్యాలసరాల" ఎత్తుగడలాగానే గుత్తునాయని జాతిముత్యాల్ గుచ్చినాడే మేసరముల"[2] అని ప్రారంభించడం కూడా గురజాడనుద్దేశించి వ్రాసినదేననడానికుపబలకమవుతోంది. గురజాడని "నవనవవసంతం, నవ్యరమగాను. సమాజంలోని నూత్నచైతన్యానికి, "చిన్ని పికములను" ఆయనవలన ప్రేరణ పొందిన తరువాతి కవులుగా సంకేతిస్తూ మొదట గురజాడకవితాప్రస్థానాన్ని వర్ణించి ఆయన మరణానంతరమే ఆయన ఆదర్శాలని లోకం గుర్తించిందని సూచిస్తూ "చుక్కలన్నియు స్రుక్కి సోలెను, గిరులు కదలెను, తిరుగబడెను. లోకమోహన మధురగానాస్వాద మోదమున" అంటాడు కవి. యుగయుగాలనుండీ ప్రొగేచియత్తరంగిణి భంగములనుపొంగునాతని గీతశీకరములంటూ విశ్వచైతన్యంలో తన ఆత్మ చైతన్యాన్ని విలీనంగావించాడనిచెప్తూ గురజాడని "చిన్నిపికములు పరుగ పాటలలో పిలుచు"చున్నాయంటాడు.

తండ్రి తమ్మన్నశాస్త్రినీ, పెత్తండ్రి సుబ్బారాయశాస్త్రినీ ప్రస్తుతిస్తూ మా బాబాయి-నాన్నగారు" అన్న శీర్షికక్రింద ఏడు ఖండికలు రచించారు కృష్ణపక్షంలో. అందులో వేంకటపల్లి సోదరకవులైనవారి కవితావైభవాన్నీ పిఠాపురాస్థానాధీశులు వారికి జరిపిన ఘనసన్మాన పత్కారాలనీ రామరాయా వనీంద్రులకీ వారికీ మధ్యనున్న రాగానుబంధాల్నీ, సూర్యారావుబహద్దరు పై వారికున్న వాత్సల్యాన్నీ, తనపైన వారి ప్రభావమెంతగా ఉందో- పీటన్నిటినీ ఆ ఖండికలలో విశదపరుస్తారు కృష్ణశాస్త్రి.

---

1. కృష్ణపక్షం మహాకవి
2. "మహాకవి" కృష్ణపక్ష సంపుటి పుట 90
   " "గుత్తునా ముత్యాలసరములు కూర్చుకుని
   ,, తేటైన మాటల"-గురజాడ రచనలు.

ప్రతిఫలమిమ్మ సుమంత వలవక కర్మముల్ సేయు నీ మెయి కురుక్షేత్ర మగును ఆశాంతములకు చరాచరమ్ములకును తరలు నీ యెడద బృందావన మగును" అనీ వివిధ జ్ఞానవేణీ సమాశ్లేషమైన నీ మనసు ప్రయాగయగును, పాతాళమును స్వర్గపదమొక్క ముడిలోన నతుకునీవే వారిజాసిహొదు" బ్రహ్మర్షి వెంకటరత్నం నాయుడుగారి మహోన్నత వ్యక్తిత్వాన్నావిష్కరిస్తారు. ఈ జడజీవితము పరికించితివీ యఘపంకమందు నంరోజము మొల్వ చేసితివంటూ "నా యెదలో త్వదీయ చరణమ్ముల చిహ్నములెన్నడేనియున్ మాయవ యేనిశితతమస్సులు మాసినగాని జీవయాత్రాయత వీథి నొక్క ప్రయాణము చేయుదు నక్షయంపు ప్రాధేయముగా గ్రహించి గురుదేవ ముఖ ప్రసుతగీతికాసుధల్"[1] అంటూ తనపైని ఆయన ప్రభావాన్ని ఆయనపైన తనకున్న గౌరవప్రపత్తులు ప్రకటిస్తాడు కవి.

గాంధీజీని ప్రశంసిస్తూ వ్రాసినఖండిక "మహాత్ముడు", "మన అఖండ భూతి, మనజాతి, మననీతి ఉన్నవరకు గాంధి ఉండితీరు" అంటూ "ఎల్ల జనులు చల్లనికుటుంబమయి మనజాలువరకు మహాత్ముడు మా గాంధి మనియె తీరు" అంటాడు. "నా శిరస్సు శీతనగమంత ఎగద్రోసి, నరాల జీవనదులు పోసి నన్నుమానవునిగ భారతునిగా నలిపినాడు పరువు నిలిపినాడు" అంటూ తనమీద గాంధీప్రభావాన్ని వర్ణిస్తాడు. "ప్రాత ఘనతమెచవడి జీవితమ్ముల నీడ్చియేమి! కదలి చన్న గాంధి గట్టిపునాదిగా క్రొత్తజాతి కట్టకొందుమింక" అని పాతఘనతని తల్చుకుంటూ జీవితాన్ని గడపడంవల్లగాని, గడిచిపోయిన వాటిని తల్చుకుంటూ దుఃఖించడంవల్లగాని లాభం లేదంటూ గాంధీవేసిన పునాదిమెద మానవశ్రేయోరాజ్యాన్ని నిర్మించుకుందామంటాడు.[2] "చరణ సన్నిధిని" అన్న ఖండిక కవీంద్ర రవీంద్రుడినుద్దేశించి స్తుతిస్తూ రచించింది. కవి తన కావ్యాలాపన నారంభించే తరుణంలోనె కవీంద్రుడి అజరామరవాణిని గ్రహించి తనలో ఇముడ్చుకున్నాడుట! అలంకారాలన్నిటినీ త్యజించిన తన కవిత ఆయన చరణసన్నిధిని ప్రణమిల్లుతోంది. "అభినవసుందర కవితా రాజ్య దురంధరుడు, రసికమనోమందిర కవి పురందరుడి"గానూ ఆ మహా

---

1. గురుదేవుడు పల్లకి సంపుటి పుట 22, 23
2. మహాత్ముడు ,, 30. 31, 32
3. చరణసన్నిధిని కృష్ణశాస్త్రిగారిని అడిగి నిర్ధారించుకున్నది.

కవిని కీర్తిస్తూ ఆయనపై తనకుగల ప్రగాఢ ప్రత్యయాన్ని ప్రకటిస్తాడు కృష్ణశాస్త్రి.

బ్రహ్మసమాజమతప్రవక్త రాజారామ్మోహనురాయ్‌ని కీర్తిస్తూ వ్రాసిన ఒక్క పద్యంలోనూ రామ్మోహనుడి వ్యక్తిత్వపుటౌన్నత్యం భాసిస్తుంది. రామ్మోహనుడి శిరం "నక్షత్రమండలాన్ని దాటి స్వర్గ పథాన్నంటి నట్టుగాతోచి ఉత్తుంగ శీర్షముకల హిమవత్పర్వతంలాగ కవిభావుక హృదయానికి దర్శనమిచ్చాడుట. శీతనగంలో జన్మించి ప్రవహించిన జీవనదులయిన గంగాయమునా ప్రవాహాల్లాగా ఆయన స్వాంతంనిండి రాగామృత వాహినులు పొరలి వచ్చాయట మానవులకేదారాలని పండించడానికి,[1]

కృష్ణశాస్త్రిగారు స్మృతి - సంస్తుతి ఖండికలని భావావేశంతోనూ మనోజ్ఞంగానూ రచించి ఆయావ్యక్తుల విశిష్టవ్యక్తిత్వాల నావిష్కరించారు.

---

1. రాజారామ్మోహనుడు - పల్లకీ సంపుటి - పుట - 70

# అభ్యుదయ కవిత

అభ్యుదయ భావన:- సామాజిక స్పృహ

కృష్ణశాస్త్రిగారు చాలామంది దృష్టిలో భావుకుడిగానే నిలిచిపోయారు గాని ఆయనలోని అభ్యుదయ భావన సామాజిక స్పృహల నవగాహన చేసుకోలేకపోవడంతో అవి అజ్ఞాతంగానే ఉండిపోయాయి. ఆయనకి అత్యంత సన్నిహితుడు, స్నేహితుడూ అయిన చలంకూడా "కృష్ణశాస్త్రి బాధ లోకానికి బాధ"[1] అని అంటూ ఆయనలోని వేదననీ భావుకతనే పేర్కొన్నాడుగాని ఆయనలోని అభ్యుదయ కాముకతలని గుర్తించలేదు. తిలక్ ఆయనలోని అభ్యుదయభావనలపై అవిశ్వాసాన్ని ప్రకటిస్తాడు[2].

ఆకాశమునొసటపొడుచు అరుణారుణ తార[3] (1938) అనేది సామ్యవాదాన్ని ప్రతిబింబిస్తుంది. 1925-30 ప్రాంతాలలో రచించిన "శిథిలాలయమ్ములో శివుడులేడోయీ"[4] అన్న గీతంల "మాలలమే" అన్న గీతం హరిజనాభ్యుదయాన్ని ప్రబోధించే గీతాలు.

1945లో ఆయన స్టూడెంట్ ఫెడరేషనుకి వారికోరికపై వ్రాసి యిచ్చిన "యువగీతం"[5]లో కలికాలం ముసలి ముసలి చలికాలం వంటిది, అభ్యుదయ వ్యతిరేకతది మారుపేరు, సంకుచితత్వమే తప్ప విశాలదృక్పథం లేనటువంటిది. అది "ముసరి ముసలి కొండచిలువలాగ పెద్దబండలాగా దొర్లిపోయింది. శాంతి సౌఖ్యాలకీ న్యాయధర్మాలకీ, సమానతా సౌభ్రాతృత్వాలకీ ప్రతీకైనా "కృతమహాయుగం" మనముందున్నది. దాని నిర్మాణం యువ

---

1. శ్రీశ్రీ మహాప్రస్థాన యోగ్యతా పత్రంలో చలం "కృష్ణశాస్త్రిబాధ లోకానికి బాధ"
2. తిలక్ "అమృతంకురిసిన రాత్రి"లోని త్రిమూర్తులు ఖండిక మల్లెపూలమెదపరుంటాడు, మంచిగంధం రాచుకుంటాడు మరెందు కేడుస్తాడు? మంత్రనగరం వెళ్ళొచ్చినవాడు మామంచిపనివాడు మాతో నడుస్తానంటాడు నడుస్తాడా మరి?
3. "అరుణ పతాక - 1938, నవశక్తి పత్రిక - 2-3-80 విశాలాంధ్ర
4. "శిథిలాలయం" - మహతి
5. యువగీతం - పల్లకీసంపుటి - పుట 64, 65

కుల చేతిలోనైఉందని సూచిస్తాడు. "మంది కృతమహాయుగం (కృత - చేయబడిన) ముందున్నది మందే మరిమందే యువమహాయుగం" అంటాడు కృష్ణశాస్త్రి. "మంది ప్రాతర్వియదావాసం ప్రాతరుజ్జ్వలాకాశం భావి మందిరావాసం" అంటూ ఒకఉజ్జ్వల సమాజాన్ని మన మనోవీథిలో సాక్షాత్కరింప చేస్తారు. నాకనేతలుగానూ విధాతలుగానూ పేర్కొంటూ "స్ఫీతచలత్ ధాతలసత్ చేతనులమూ నూతనులమూ" అయిన మనకింక లోటేముందంటారు[5].

కాలానుగుణమైన మార్పులులేక బూజుపట్టిన ప్రాచీన సంప్రదాయాలని బూజు ధూళిపట్టిన దివాణంతో పోల్చి దివాణంలోని బూజు ధూళులని దులిపినట్టే సాంప్రదాయాలలోని మౌఢ్యాన్ని దులిపి దివాణంలో కొత్తదీపాలు వెలిగించినట్టే హృదయంలో జ్ఞానజ్యోతుల్ని వెలిగించుకుని అభ్యుదయ మార్గంలో సాగిపోవాలనే భావాన్ని వ్యక్తంచేస్తు రచించిన ఖండిక "అమ్మ"[1] ఇక్కడ "నిశావసానంలో" చీకట్లని పారద్రోలే కాంతిమూర్తి "అమ్మ" అవతరించి నూత్న చైతన్యాన్నిస్తుంది. విశ్వమానవ శ్రేయోభావానికి సంకేతము ఆమె. "చిదికినవీ వికృతమైనవీ ముదిసినవే నాటకుంచబోమమ్మ" అంటూ కాలంతో పాటు మార్పుచెందని సాంప్రదాయాలను మారుస్తానంటాడు. మరొక ఖండికలో సమాజంలోని అంధ విశ్వాసాలని రాత్రిగా సంకేతిస్తు "కుళ్ళి కుళ్ళి పిసినారిలాగ కుమిలికుమిలి ఏడుస్తుందంటారు. "గోలపెట్టురాత్రి గుండె బాదుకో రాత్రివెళ్ళిపోయేలోగా వెక్కివెక్కియేడు, అప్పుడుగాని అరుణోదయంకాదు[2]" అంటూ మూఢాచార పరాయణులు సమాజంలోవస్తున్న మార్పులకి పడేబాధని కటువుగావిమర్శించి రాత్రిలాగే అంధవిశ్వాసాలు తొలగి అభ్యుదయంకాక తప్పదనీ, ఎంత తీవ్రమైన ప్రతిఘటన ఎదురైతే అంత తొందరగా సమాజంలో అభ్యుదయకరమైన పరిణామం వస్తుందంటాడు కవి.

మనకింక నిద్రలేదు - వీల్లేదు: మనకింక ఇల్లులేదు - అక్కర్లేదు:

అనుకున్న తడపలనందుకునేదాకా అనలవర్షంకింద మనం నడవాలి తప్పదు"[3] అంటూ విశ్రాంతి విరామం లేకుండా ఎటువంటి కష్టాలనైనాసరే

---

1. "అమ్మ" ఖండిక పల్లకీ సంపుటి పుట 1, 2
2. అప్పుడుగాని అరుణోదయంకాదు ,, ,, 74, 75

ఎదుర్కొంటూ సమాజాభ్యుదయంలో ఆశించిన గమ్యాన్ని చేరేవరకూ వయనిస్తూనే ఉండాలని "జీవన శంఖా"[1]న్ని పూరిస్తారు. లోకంలోని స్వార్థం క్రోధాలు మితిమీరి మానవమారణహోమానికి దారితీసే భయంకరస్థితినుంచి రక్షించుకోవడానికి ఉదగ్రమైన "ఆగ్రహము" అంటే సత్యాగ్రహము, ఉదాత్తమైన ఆవేశము తన్నావహించాలని కోరుతాడు. ఈ సత్యాగ్రహ ధర్మాలేశం ఒక మహత్తరశక్తి, ఆ "నవ్యశక్తి"[2] చేకూరినాడు మానవుడిలో దౌర్బల్య సంకుచితత్వాలు రూపుమాసి అతడు అమరుడవుతాడు. లోకంనాకంగామారి సమసమాజాభ్యుదయోదయమై సమభావం సమసౌఖ్యాలు వర్ధిల్లుతాయి. అటువంటి నిత్యశుభదాత్రియైన శక్తి మానవుడిని నిరంతరం ఆవహించాలని కోరుతాడు.

సాంఘిక వ్యవస్థలోని అన్యాయాలను తీవ్రంగా నిరసిస్తూ పీడితతాడిత దళితవర్గాలవాళ్ళ అభ్యుదయాన్ని కాంక్షిస్తు "హాలికుడు"[3] అన్న ఖండికను రచించారు. సమాజంలో తంతరాలుగా కర్షకశ్రామికులేవిధంగా లోక భారంతో అణగారిపోతున్నారో, చేతనారహితంగా జీవిస్తున్నారో సూచిస్తు "కొయ్యా, రాయీ యెద్దు వీటకీ తోబుట్టువువాడు" అంటారు. అతని ఈ దుస్థితికి సమాజమే కారణమనీ ఈ విధంగా సామాజికంగా, శారీరకంగా, మానసికంగా అన్యాయం గావించబడిన అతన్ని ఉద్ధరించాల్సిన బాధ్యత సమాజానిదేనంటాడు.[4] "ఆకలీ నాశం, సంకెళ్ళు ఇవి పీడితులకు రోషం ద్వేషం హెచ్చి మానం వచ్చేవరకేనని హెచ్చరిస్తు "అన్నార్తులకి రోషం వస్తే మందాకినీ ఝరులు మరుగర్భమందింకుతాయనీ[5], "పీడితులకు ద్వేషం

1. జీవన శంఖం — పల్లకి - 57, 58వ పుట
2. నవ్యశక్తి — ,, 71వ ,,
3. 4, హాలికుడు — పల్లకి పుట 77
5. నిశ్రేణి సంపుటిలోని ఖండిక

హెచ్చితే మందారతరులు హేమంతమనసమందుతా"యనీ, ఈ సంకెళ్ళు తెంచుకునే మానం వచ్చినప్పుడు మఘవకోటీరమే మంటికౌగిలినంటుతుందనీ" గొంతు చించుకుని మరీ చెప్తాడు. ఇందులోని విప్లవాత్మకభావాల్ని నేటి విప్లవకవుల రచనలకేమాత్రం తీసిపోవనిపిస్తుంది. తాను "ఎగుడు దిగుడు లేని సొగసైన పీడుగా మననాడుని చేస్తానంటాడు.[1] ఈనాడు నేనేలు నానాడులో మకుటధారినట, నేను స్వచ్ఛందభారతకవిని!"[2] అంటూ ప్రజా ప్రభుత్వ మహత్త్వాన్ని ప్రకటిస్తాడు. ఆసేతుహిమాలయ పర్యంతం ప్రతీ మనిషికీ ఒకేసారి ఆకాశవాణి తన వాణిని విన్పించి కావేరినీ కాశ్మీరాన్నీ ఒకే సూత్రంలో బంధించడంద్వారా సమైక్యతని సాధిస్తోంది కనుకనే ఆయన ప్రశంసలనందుకుంది.[3] దేశసంపద అందరిదీ అయిననాడు కరువు కాటకా లుండవనే ఉదాత్తాశయాన్ని "సుప్రియా - బుద్ధ భగవానుడు"[4] అన్న కవితలో ప్రతిపాదిస్తారు. 1949 జనవరి భారతిలో కవితారచన ఒక తపస్సులాంటిది... మేలుకొన్న 'కొత్త సమాజంలో తనకు లభించిన ఏ ఒకటిరెండు అనుభవాలో, కష్టసుఖాలో కవి తన కావ్యాల్లో పొదుగుతాడు... అనంత జీవంతో చలించిపోయే నవసమాజంలో నడుస్తు స్నేహం చేస్తు జీవిస్తే కొత్త అనుభవాలువస్తాయి. కొత్త కావ్యాలు వస్తాయి. సమాజం మనది దానితో మనం మారాలి, దానిని మార్చాలి.[5] అంటారు ప్రగతిశీలి కృష్ణశాస్త్రి.

---

1, 2. ఆగస్టు 15 — పల్లకి పుట 59, 57

3. రేడియో — పల్లకి సంపుటి పుట 66

4. సుప్రియా బుద్ధభగవానుడు — ,, 85, 88

5. 1948 జనవరి భారతిలోని కృష్ణశాస్త్రి వ్యాసం

# వచన – వైవిధ్యం

కృష్ణపక్షకవిగానూ, బ్రహగీతోపాసకుడిగానూ, రేడియో నాటక కర్త గానూ. సినీ గేయరచయితగానూ లోకంలో చాలామందికి కృష్ణశాస్త్రిగారు సుపరిచితులుకానీ వచనరచనని అత్యంతఅద్భుతంగా వ్రాయగలరనీ ఎంతో మందికి తెలియదనడం సత్యదూరం కాదేమో! కవిత్వ సంగీతాలకంటే కూడా ఆయనకి మనుష్యులంటే ఉన్నపెత్తి మమకారం, వాళ్ళకోసం "పడివచ్చే" గుణమే ఆయనచేత హృదయాల్ని కదిలించి వానిపైన ప్రగాఢముద్రని వేయ గల వచనరచనలని చేయించగలిగింది చలం,[1] తిలక్ ప్రభృతుల మాటలు ఆయనలోని వేదనాగళాన్ని మాత్రమే నూసి అన్నమాట లయ్యుండవచ్చు మానవతావాది, ప్రగతిశీలి, అభ్యుదయ కాముకుడు, లోకంబాధని తనబాధగా భావించి ఆలపించినకవీ[3] అప్పటికే ఆయనలో కనిపిస్తారు. ఈ విధంగా ఆయన ప్రాచీన నవీన ప్రగతివాదాల త్రివేణీ సంగమం.

పైన ఉల్లేఖించిన లక్షణాలేకాకుండా వ్యంగ్య పరిహాస కుశలత, నవ్య తపైన అదరంతోపాటు ప్రాచీనతమీద ప్రీతి, సూటిగా హృదయాలకి హత్తు కునేటట్లుగా రచించగలనేర్పు, తెలుగువచనా సౌందర్యానికి అద్దంపట్టగల పరిణతశిల్పం (పర్‌ఫెక్షన్), విషయవైవిధ్యం - దానికి తగిన భాషావైవిధ్యం. ప్రాచీన ఆర్యా చీన తెలుగు సాహిత్యాలతోపాటు సంస్కృతాంగ్ల సూఫీ సాహిత్యాలలో ఆయనకున్న అపార పరిజ్ఞానం, కవీంద్ర రవీంద్రుని సాహిత్య ప్రగాఢ పరిచయము మొదలైనవన్నీ ఆయన వచన రచనల్లో

---

1. "కృష్ణశాస్త్రి తనబాధను అందరిలోనూ పలికిస్తే, శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు. కృష్ణశాస్త్రిబాధ ప్రపంచానికి బాధ, ప్రపంచపు బాధఅంతా శ్రీశ్రీది" మహాప్రస్థానం - యోగ్యతా పత్రం -చలం.

2. "మల్లెపూలమీద పరుంటాడు మంచిగంధం రాచుకుంటాడు మరెం దుకు ఏడుస్తాడు? తిలక్ "అమృతం కురిసిన రాత్రి" - ఖండిక "త్రిమూర్తులు" — పుట 61

3. మహతీ,, నిశ్రేణీ ఖండికలు.

ప్రస్ఫుటమయి ఆయన వచన రచనలు మిగిలినవాటికన్నా ఏమాత్రం తీసిపోక మిగిలిన రచనలని మించిన సందర్భాలు కూడా ఉన్నాయని నిరూపిస్తూ "గద్యం కవీనాం నికషం వదన్తి" అన్న ఆర్యోక్తిని ఋజువుచేస్తున్నాయి.

ఆయన వచనరచనలని పరిశీలిస్తే విషయ ప్రధానమైనవి, ఆవేశ ప్రధానమైనవి, భావుకతా ప్రధానమైనవీ, భావుకతతోకూడిన సూటిదనం. ఆవేశం కలిగినవీ-అని నాలుగు తరగతులుగా విభజించవచ్చు. "ఏకాంత సేవ"పీఠిక, శ్యామపర్ణిభూమిక, "పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం" అనే సాహితీ సమాలోచనా, సమీక్షావ్యాసాలు, బసవరాజు అప్పారావు మధుర స్మృతి, అన్నమాచారి, బైరాగి, కందుకూరిపైని ప్రసంగపాఠాలు విషయ ప్రధానమైనవి. ఆకలి, రిక్షావాలా, బూట్ పాలిష్ మొదలైన రచనలు ఆవేశంతో కూడుకుని సూటిగా హృదయాల్లోకి చొచ్చుకుపోయేటట్టు రచించినవి. కృష్ణశాస్త్రిగారి భావుకతకీ భక్తిభావనకీ సౌందర్యతృష్ణకీ అద్దంపడ్తాయి "సుగంధద్రవ్యాలు", "పుష్పలావికలు". అప్పుడు పుట్టిఉంటే, కోవెల కొలను, గుహుడు, కృష్ణావతారతత్త్వం మొదలైన రచనలు. మైలురాయి, బహుకాలదర్శనం, "అవ్వతిరునాళ్ళలో తప్పిపోయింది" మొదలైనవాటిలో భావుకత, సమాజంలోని లోటుపాట్లనూ లొసగులనూ సూటిగా విమర్శించే తత్త్వమూ-ఈ రెండూ వ్యక్తమవుతాయి.

మరొకవిధంగా వర్గీకరిస్తే "ఏకాంతసేవ" పీఠిక, శ్యామపర్ణిభూమిక, "పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం" అనేవి సాహిత్య సమాలోచనా సమీక్షలనీ, బసవరాజు అప్పారావు మధురస్మృతి, అన్నమాచారి. కందుకూరి, బైరాగి మొదలైనవారిపైని వ్యాసాలు, ప్రసంగపాఠాలు ఆయాకవుల మీద సంస్కర్తలపైన కృష్ణశాస్త్రిగారికున్న గౌరవప్రపత్తులనీ, బహుకాల దర్శనం, మైలురాయి సంఘంమీద వ్యంగ్య విమర్శననీ. లోకజ్ఞతనీ, "ఇద్దరు సత్యవాదులు" సాహిత్యంలోని కల్పనలమీద వ్యంగ్య విమర్శననీ. అవ్వం తిరునాళ్ళలో తప్పిపోయింది", "అప్పు బస్సు ప్రయాణం" అనేవి. తెలుగు దేశపు మధ్యతరగతి కుటుంబాల గత స్మృతులనీ, "మా ఊరుపోయింది", మా ఊళ్ళో ఓ పెళ్ళయింది" దేశకాల పరిస్థితుల్లో కలుగుతున్న మార్పులకి దివిలో

కలిగే భావాలకిఅద్దంపట్టే ఈ మార్పులవల్ల పోతున్న సత్సంప్రదాయాలనీ, జాతిమతాతీతమయిన విశ్వమానవ సౌభ్రాతృత్వాన్నీ. మానవతనీ, సమసమాజ నిర్మాణ ధ్యేయాన్ని, సామాజిక స్పృహని "రిక్షావాలా" "బూట్ పాలిష్" "ఆకలి", "రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి", అసత్యపు గడియతొలిగించి నిర్భీతిగా నిజంపలకాలి" అన్నవ్యాసాలు, ప్రసంగాలు, "అప్పుడు పుట్టిఉంటే", "పుష్పలావికలు" గతకాలపువైభవ వైశిష్ట్యాలనీ, సౌందర్యానుభూతి మార్దవమాధుర్యాల సాక్షాత్కారాన్ని, కోవెల - కొలను "సుగంధద్రవ్యాలు", "గుహుడు", కృష్ణావతార తత్త్వము" అనేవి బాహ్యాంతర సౌందర్య తత్త్వాలకే కతనిసాధించే యత్నాన్నీ ప్రతిబింబించేవి. "మలుపు" అన్నరచన జీవితంపట్ల కృష్ణశాస్త్రిగారి సమగ్రావగాహనని ద్యోతకం గావిస్తుంది. ఇంతటి విషయ వైవిధ్యమున్నవి ఆయన వచనరచనలు.

వేంకటపార్వతీశ కవులు తమ "ఏకాంతసేవ" కావ్యానికి కృష్ణశాస్త్రి గారిచేత పీఠిక వ్రాయించడం (1922) అతి చిన్నవయసులోనే ఆయన సాహితీ వేతృత్వాన్ని సాహిత్య జగత్తు గుర్తించిందనడానికి తార్కాణం ఈ పీఠికలో "ఏకాంతసేవ" కావ్యంపైన సమాలోచన జరిపి సమీక్షించారు ఇందులోని కవిత్వ వివరణతోపాటు ఆత్మాశ్రయత్వ, ప్రకృతిప్రీతి, ఉదాత్త భావనాశక్తి ప్రధానలక్షణాలుగాగల భావకవిత్వాన్ని తేటతెల్లంచేస్తూ ఉత్తమ కవిత్వంపైన తనకున్న భావాన్ని వెల్లడిస్తారు. "హృదయాన్ని తన్మయీభవనంచేసే కవిత్వం ఈశ్వర ప్రసాదమనీ "ఏకాంతసేవ" అటువంటికవిత్వ గుణమున్న మహాకావ్యాలలో అగ్రశ్రేణికి చెందిననని నుతిస్తారు[1]. "మధుర భక్తితత్త్వం" ఈ కావ్యంలో ఎంత మనోజ్ఞంగా తీర్చిదిద్దబడిందో వివరిస్తూ "భక్తియుతుడైన భక్తుడు పరమేశ్వరునిగూర్చి ఆలపించిన ప్రణయగీతము ఇది భాగవతము వలెనె పఠింపదగినది; ప్రేమింపదగినది; శిరసావహింప దగినది"[2] అని నొక్కివక్కాణించిచెప్తూ తెలుగు భాషకు లభించినది గీతాం

---

1. ఏకాంతసేవ పీఠిక - అప్పుడు పుట్టిఉంటే సంపుటి - పుట - 11
2. & 3. ,, ,, ,, 13
4. ,, ,, ,, 9

జలి వంటిదనే[3] తమ అభిప్రాయాన్ని సుస్పష్టం చేస్తారు. కవిత్వానికి కావలసినది "భావనాసోప్వరకత్వము, హృదయాకర్షణము, రసోజ్జృంభణము" అని వెల్లడిస్తాడు ఈ వ్యాసమంతా సరళగ్రాంథిక భాషలో సాగింది. ఆయన కవిత్వాదర్శాలు ఇందులో సుస్పష్టమై ఆయన కవిత్వాన్నవగాహన చేసుకోవడానికి తోడ్పడుతుందిది.

పాతిక సంవత్సరాల తెలుగుకవిత్వంలో 1923 ప్రాంతంనుంచి 1948 వఱకూ తెలుగు కవిత్వంలో వచ్చిన మార్పులనీ, దాని స్థితిగతులనీ వివరిస్తారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిల వంటి సనాతన కవుల, రాయప్రోలు, గురజాడ, నండూరి, బసవరాజువంటి కాల్పనిక కవుల (భావకవుల), అభ్యుదయ యుగకర్త శ్రీ శ్రీ, పఠాభి, ఆరుద్రవంటి అతినవ్యకవుల వఱకు మూడుతరాల కవుల కవిత్వతత్త్వాలని సమీక్షిస్తారు. సుమారు నలభై ఆరు పుటలుండి పన్నెండు ప్రకరణాలుగా విభజించబడిన ఈ సుదీర్ఘ వ్యాసాన్ని ఆంధ్ర కవులందరూ ఒక మహాపరిషత్తున సమావేశం కావాలనికోరుతూ ఆ మహా మేళంలోంచి జగత్తంతా మానవాలయం కట్టగల ఏ తెనుగునాటి వ్యాసుడు పుట్టుకునివస్తాడో"[1]నంటూ ఆశాభావాన్ని ప్రకటిస్తూ ముగిస్తాడు. ఈ విధంగా పాతికేళ్ళ కవిత్వపు ప్రభావాల్ని పరిణామ పరిణాహాల్ని దిక్ప్రదర్శనం గావిస్తారు ఆయన ఈ వ్యాసంలో.

రవీంద్రుడి "గార్డనర్"కి శ్రీమతి టి. ఎన్. అనసూయాదేవి అనువాదమైన "శ్యామపర్ణి" కావ్యానికి కృష్ణశాస్త్రిగారు వ్రాసిన భూమిక భావకావ్య జీవాతువునీ, మౌలిక లక్షణాలనీ విశదీకరిస్తూ రవీంద్రుడి కవితామూర్తిని ఆవిష్కరిస్తూ[2] శ్రీ బుద్ధదేవబోసు, ఫ్రెంచి రచయిత మలార్మేల దార్శనికతలని ప్రస్తావిస్తూ "శ్యామపర్ణి" అనువాదంలో రచయిత్రి చూపిన నేర్పు ప్రశంసార్హమైనదిగా సోపపత్తికంగా నిరూపిస్తారు కృష్ణశాస్త్రి. ఈ

---

1. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం
అప్పుడు పుట్టిఉంటే సంపుటి పుట 59
2. శ్యామపర్ణి భూమిక
3. " "

విధంగా భూమికారచయితలకిది చక్కని మార్గాన్నిచూపుతూ సాహిత్య జగత్తులో అమూల్యమైనదిగా కొనియాడబడుతోంది.

వీటన్నిటిలోనూ కృష్ణశాస్త్రిగారి సాహిత్యదార్శనికత, ప్రాచీనాధునిక సాహిత్యాలతో ఆయనకున్న ప్రగాఢ పరిచయావగాహనాధికారాలు, పాఠకులకి సులభంగా అర్థమయ్యేటట్లు సమీక్షించి వివరించగల నేర్పరితనం సువిదితమవుతాయి.

జీవితంలో కదిలించిన ప్రతీ అనుభూతినీ పాటగా మలచుకుని "పాట పాడుతూండగనా ప్రాణిదాటి యేగేనా ప్రాణదాటి యేగుతుండ పాట నోట మ్రోగేనా"[1] అని అంటూ ఆలపిస్తూనే కనుమరుగైపోయిన బసవరాజుని గూర్చిన రచయిత వ్యాసం చదివినవాళ్ళ కళ్ళు చెమర్చి స్మృతికావ్యాన్ని పఠించిన అనుభూతి కలుగకమానదు.

"అన్నమాచారి" ఉత్సవ ప్రారంభోపన్యాసంలో సంగీత వైశిష్ట్య ప్రాశస్త్యాలనీ, మానవ జీవితాలకి దాని ఆవశ్యకతనీ, అన్నమయ్య కీర్తనల లోని విషయవైవిధ్యం, నూతనత్వాలనీ, జీవద్భాషనీ, అందులోని అవ్యక్త మధురిమనీ త్యాగరాజ అన్నమయ్యల తత్త్వంలోని తారతమ్యాన్నీ సునిశితంగా, సుబోధకంగా వివరిస్తారు. భగవంతుడి ఆస్థానంలో కవులూ గాయకులుగా ఉండడంలోనే కవుల గాయకుల జీవితాలు సార్థకమవుతాయనే భావాన్ని ప్రకటిస్తూ వెంకటేశ్వరుడి ఆస్థానంలో కవిగా గానాన్నాలపించాలనే తన కోరికని వెల్లడిస్తారు,[2] కృష్ణభజనిలోని గేయంతో ఆ ప్రపంగ వ్యాసాన్ని ముగిస్తారు.

పాటకి మలుపులున్నట్టే బ్రతుకుపాటలోనూ మలుపులుంటాయనీ; గొప్ప మలుపులున్నమనిషి జీవితం మహాకావ్యమవుతుందని నొక్కిచెప్పే

1. "బసవరాజు అప్పారావు మధురస్మృతి"
"అప్పుడు పుట్టి ఉంటే" సంపుటి పుట 78
2. అన్నమాచారి అప్పుడు పుట్టి ఉంటే సంపుటి పుట 99
3. మలుపులుంటే - పుష్పలావికలు సంపుటి పుట 101

వ్యాసం "మలుపు తిరిగితే" అనేది. "జీవితాన్ని మలుపులుండాలనీ, ఆ మలుపు వెనకాల మసనముండనీ మధువనముండనీ"[3] అంటూ సుఖ దుఃఖాన్ని సమభావంతో దర్శించగల ఆర్షత్వాన్ని సంతరించుకున్న కృష్ణశాస్త్రి గారికి జీవితంపట్లనున్న అభిప్రాయాలకిది అద్దంపడుతుంది.

నగర జీవితంతో విసిగినోయి "అమ్మఒడి"లాంటి తన స్వగ్రామంలో సేద తీరుదామని వెళ్ళిన రచయితకి దేశకాల పరిస్థితుల ప్రభావంతో పట్టణ వాతావరణాన్ని పొందించుకున్న "చంద్రపాలెం" సాక్షాత్కరించి అంత వరకూ నెమరేసుకున్న స్మృతిపథంలోని పల్లెతాలూకు మధురస్మృతులని చెల్లాచెదురు గావించటంతో ఆయనకు "మా ఊరుపోయింది" అనిపిస్తుంది. అలాగే "మా ఊళ్ళో వీధిఅరుగు"లో ఊళ్ళోని రాయణింగారి దివాణపు టరుగు కరణంజగ్గరాజు, మునసబు శేషాద్రి, పెద్ద శాస్త్రులగారి అరుగులు-మొత్తం ఈ నాలుగు అరుగుల గత వైభవ ప్రాభవాలని వర్ణిస్తూ ఈనాడు స్మృతి చిహ్నంగా మిగిలినవాటిస్థితిని చిత్రిస్తాడు రచయిత. ఇలా వీధి అరుగుని దేశకాల పరిస్థితుల్లోని మార్పుకొక సంకేతంగా నిలిపి ఈ మార్పులో పోయిన సాంప్రదాయాన్ని పరమసున్నితంగానూ, మనోహరంగానూ నిరూపిస్తాడు రచయిత. "కవికి పాతవీ కొత్తవీ అంటూలేవు. జీవంఉన్న అన్నిటితోనూ అతనికి సంబంధముంది. పాతవాటితోటీ కొత్తవాటితోటీ కూడా అని ప్రాచీనత నవీనతలపై తన సమాదరాన్ని స్పష్టపరుస్తారు ఆయన!

సమాజంమీది వ్యంగ్య విమర్శవంటిది "బహుకాలదర్శనం" అన్న చిన్ని నాటికారూపమైన కృష్ణశాస్త్రిగారి రచన. సహాయ నిరాకరణోద్యమంలో తన సర్వస్వాన్ని అర్పించి దారిద్ర్యాన్ని దానికి ప్రతిఫలంగా పొంది పెళ్ళాం పిల్లల్ని పోషించుకోడానికిగాను రైల్వేస్టేషన్లలోనూ, బస్టాండ్లలోనూ అవతలి వ్యక్తుల మాటల్నిబట్టి వాళ్ళ ఊళ్ళూపేళ్ళూ పసిగట్టి చాకచక్యంతో వాళ్ళ దగ్గరికిచేరి మాటలుకలిపి చుట్టరికాన్ని తిరగవేసో, ఆత్మీయతని ప్రకటించో వాళ్ళని ఆకట్టుకుని చివరికి ఏదో ఒక ఆర్థిక ఇబ్బందిని ఏకరువుపెట్టి మొహ

---

1. బహుకాల దర్శనం పుట 17
2. ,, ,, 18

మాటపడ్తూనే వాళ్ళిచ్చే డబ్బుని తీసుకుంటున్నట్టు నటిస్తూ బ్రతుకనేర్చిన శ్రీరాముల ఇతివృత్తమే ఇందులోని కథ. స్వాతంత్ర్యోద్యమంలో తమ సర్వస్వాన్నీ అర్పించి నిరాధరులైనవారి త్యాగాలకీ, నిజాయితీకి ఎటువంటి గుర్తింపూలేదనీ, మరేమార్గంలేక పొట్టపోసుకోవడానికి వాళ్ళు అడ్డత్రోవ త్రొక్కడానికి కారణం ఈ సమాజమేనని స్పష్టపరుస్తారు కృష్ణశాస్త్రి. “తక్కువవాడు తక్కువ మోసంచేస్తే అది దారుణమైన నేరం! ప్రభుత్వ ప్రముఖులూచేస్తే అది రాజకీయతంత్రం మంత్రాంగం”[1] అంటూ మనచుట్టూ ఉన్న గోముఖ వ్యాఘ్రాలకన్నా శ్రీరాములువంటివారెంతో ఉత్తములుంటారు. ఈ విధంగా నేటి సమాజానికిది అద్దంపడ్తుంది. చాలావఱకూ హాస్యరస స్ఫూర్తితోసాగి చివర కరుణరస స్పర్శతో ముగిసి పాఠకుల హృదయాలని బరువెక్కించి చెరగని ముద్రని వేస్తుంది. ఇందులోని శ్రీనివాసరావు పాత్రలో రచయితే సాక్షాత్కరించి నేటి సమాజ స్వరూప స్వభావాలనావిష్కరించి “మళ్ళీ ఎప్పుడో” అన్న శ్రీనివాసరావు మాటకి గద్గదకంఠంతో శ్రీరాములు బహుకాల దర్శనం”[2] అనడం కొసమెరుపు.

గ్రాండుట్రంక్ రోడ్డుమీద సత్తిపాలెంసత్రం పక్కనున్న 23వ మైలురాయి కంఠంతో కవి అరవైఏళ్ళ జీవితంలో తాను చూసిన మంచీచెడూ సంఘటనలకి సాక్షిగా నిలిచి గతాన్ని వర్తమానంతోపోలుస్తూ విశ్లేషించి చూసి ప్రకటించే భావాలే “మైలురాయి” అన్న ఏకాంకికగా రూపొందాయి. ఇందులో నేటి సమాజంమీద అనేక విసుర్లు (వ్యంగ్య విమర్శలు) హాస్యంతో కూడుకున్నవి ఉన్నాయి. రోజురోజుకీ భారమైపోతున్న సామాన్యుడి జీవితాన్ని స్ఫురింపచేస్తూ “మానవులు తిప్పలేక ఏడుస్తుంటే తిరునాళ్ళూ తీర్థాలు ఏమిటండీ?” అంటాడు. మైలురాయిని నూకాలమ్మగాచేసి కొబ్బరి కాయ కొట్టడాన్ని దేశంలో ప్రతీరాయి ఎవరి స్వార్థానికో దేవతగా ఎల్లా మారి పోతూంటుందో సూచించి విగ్రహారాధనని అవహేళనచేస్తూ. మైలురాలు కంఠంతో “నేను దేవతనవను” అంటూ తిరుగుబాటుని ధ్వనింపచేస్తాడు. ఇందులో రచయిత ప్రాచీనతపైన మమకారం కొత్తపైని ఆదరణా వ్యక్తమవుతుంది.

సత్యవాదులుగా ఖ్యాతికెక్కిన పురాణపురుషులు “హరిశ్చంద్రుడు” “ధర్మరాజు”ల పేర్లను ఇందులోని పాత్రలకిపెట్టి వాళ్ళ అభూతకల్పనలతో

గూడిన సంభాషణద్వారా ప్రబంధాలలోని అతిశయోక్తుల శుష్కకల్పనలమీద హాస్యంతోకూడిన వ్యంగ్యవిమర్శని చేస్తాడు రచయిత. ఆ పాత్రలపేర్లే మనం మహాత్ముల" మహనీయులపేర్లు పెట్టుకోవడంమీద విసురు.

"రిక్షావాలా" కృష్ణశాస్త్రిగారిలో నిండిన జాతీయతాతీతమైన విశ్వమానవ సౌభ్రాతృత్వ భావనకి మూర్తికల్పనగా భాసిస్తుంది. రిక్షావాలా అహమ్మద్‌కీ కవికీ మధ్య క్రమక్రమంగా పెరిగి ఆత్మీయతగా మారిన అనుబంధం దినదినప్రవర్ధమానమై ఈద్ పండుగలలో పరాకాష్ఠనందుకోవడం పైదానినే వ్యక్తపరుస్తుంది.

శ్రమజీవి భారమైన జీవితానికి రిక్షానీ, అందులో అరుదుగా రవళించే సరిగమలకి మువ్వలనీ ప్రతీకలుగాను, అహమ్మద్‌ని సగటు శ్రామికజీవికి ప్రతినిధిగానూ చిత్రించి మువ్వలులేని అతని రిక్షాద్వారా జీవితభాగస్వామినిని పోగొట్టుకున్న అతని వేదనమయ జీవితాన్ని సూచిస్తాడు. మానవతావాదియైన కృష్ణశాస్త్రి "చీకిలూ వాకిలైన బట్టలోనున్న అహమ్మద్ ఇతరులముందు చేయిచాచని ఉదాత్తస్వభావంతో "పాచ్చా" (పాద్షా) వంటివాడనీ, ఆశ్రమజీవి శీపీముందు ఈ కృత్రిమపు హోదాలు తెల్లబోయి ధూళిలో దాచేయాలని పిస్తుందంటూ" అసలే ఉన్నతుడైనా అహమ్మద్ ఇప్పుడు వేదనాకిరీటంలో మరీ ఉన్నతుడైపోయాడు" అంటూ వేదనాప్రియత్వాన్ని వెల్లడిస్తారు కృష్ణశాస్త్రి.

"బూట్‌పాలిష్" అనే రచనలోనూ సంఘంలోని అట్టడుగు మనుష్యుల అభ్యుదయాన్ని కాంక్షించేవాడూ, సమసమాజాన్ని కాంక్షించేవాడూ, సంస్కరణాభిలాషీ, దార్శనికుడూ, సంఘజీవి అయిన కృష్ణశాస్త్రి సాక్షాత్కరిస్తాడు. బూట్‌పాలిష్ చేసే సరయ్యచుట్టూ అల్లిన ఈ వాక్చిత్రం (Pen Picture)లో భగవంతుడు మన బ్రతుకుల్లోని కల్మషాన్ని పోగొట్టే రజకుడు బట్టలకు రంగులువేసే వాడూకూడాను. సందెవన్నెలు తెచ్చి మన బాధలకీ, ఉషఃకాంతులని తెచ్చి మన ఆనందాలకీ అద్దుతాడు. [1]పాలిష్‌చేసే కుర్రాడు ఆలీ, రైల్వే

1. "బూట్‌పాలిష్" — బహుకాలపు దర్శణం — పుట 68
2. ,, ,, ,, 69

కూలీ నారాయణ మొదలైన వాళ్ళందరూ రచయిత దృష్టిలో భగవత్స్వరూపాలే. "నారయ్యకొడుకు చెప్పులు కుట్టడు. వాడు చదువుకుంటున్నాడు[2]" అనడంలో నారయ్యతరంలో కాకపోయినా వాడి కొడుకుతరంలోనైనా వాళ్ళ బ్రతుకుల్లో మార్పువచ్చి బ్రతుకులు బాగుపడుతాయనె ఆశంసని వ్యక్త పరుస్తారు.

కృష్ణశాస్త్రిలోని సంఘసంస్కరణ ప్రియతనీ, సామాజిక స్పృహనీ, మానవతావాదాన్నీ సమగ్రస్వరూపంతో ఆవిష్కరిస్తుంది 1938 అక్టోబరు 15వ తేదీన ఆకాశవాణిలో చదివిన ప్రసంగవ్యాసం "ఆకలి". ఆనాటి బెంగాల్ కరువుకు కదిలిపోయిన ఆయన హృదయం తీవ్రాతి తీవ్రంగా మనదేశంలోని ఆర్థిక వ్యవస్థలోని అసమానతల వెత్తిచూపి దీనికిపరిష్కారం సంపదని నాది అనుకోకుండా "అందరిదీ" అని భావించడమేనంటూ దీని కుప బలకంగా భిక్షుబాలిక సుప్రియా బుద్ధభగవాన్ల కథ నుదహరిస్తారు. ఇందులో సంఘసంస్కర్త, సామాజిక స్పృహతోటి సామ్యవాదిగా గోచరిస్తాడు కృష్ణశాస్త్రి.

తనలోని సంఘసంస్కరణాభిలాషనీ, దానిని గూర్చి తనకున్న భావాలనీ 23-6-1970న రాజమండ్రిలో జరిగిన కందుకూరి వీరేశలింగం పంతులుగారి 122వ జయంతోత్సవ సభా ప్రసంగపాఠంలో అభివ్యక్తీకరిస్తారు. వివిధరంగాలల్లో మార్గదర్శకత్వాన్ని వహించిన వీరేశలింగం వ్యక్తిత్వం, అందులోని పై లక్షణ్యాన్నీ వీరేశలింగం వెంకటరత్నం గార్ల తులనాత్మక పరిశీలననీ చేస్తారు రచయిత. "ఈ మానవ సాగరిమన్యాన నవ యుగారంభవేళ నిలబడిన మానవుడు తొలి విశ్వమానవుడు తెలుగునాట వీరేశలింగ[1]"మంటూ ఆయన్ని దేవతగా కీర్తించి తనపైన ఆయనవేసిన ముద్రని స్పష్టపరుస్తారు.

కృష్ణశాస్త్రిగారిపై తన ప్రభావాన్ని చూపిన కవిమిత్రుడైన బసవరాజుని గూర్చిన మధుర స్మృతిలో బసవరాజు అప్పారావు భావుకతనీ రచనలోని

1. కందుకూరి వీరేశలింగంపంతులుగారి 122వ జయంత్యుత్సవంగా సావనీర్.

ఆప్తత, ఆర్ద్రతనీ, అభిప్రాయాభిరుచులనీ, నిసర్గ మనోహరమైన కవితా శైలినీ, సంస్కృతినీ, జీవద్భాషని కావ్యభాషగా మలచడంలోని ఆయన యత్నాన్ని ప్రశంసిస్తాడు.

మహార్నవమి ఉత్సవాలలో పెద్దన కావ్యకన్యకని రాయలవారు స్వీకరించడం, ఆ ఉత్సవనిమిత్తం కవులందరూ ఒకచోట చేరడం, పెద్దన-రాయలవారి మధ్యనున్న పరిహాస ప్రసంగాలు, తుంగభద్రానదీ తీరంలోని కవుల కావ్యగోష్ఠి, ప్రచ్ఛన్నుడైన, రాయల సాక్షాత్కారాలు ఇతివృత్తంగా కలిగిన రాయలనాటి మధుర స్మృతులకొక చక్కని అపూర్వమైన ఊహాచిత్రం "అప్పుడు పుట్టిఉంటే" అప్పుడు పుట్టిఉంటే నేనే పెద్దననై యుండి ఉందును" అన్నకవి ఆత్మవిశ్వాసం కొసమెరుగునిస్తుండగా ముగుస్తుందీ ఊహాచిత్రం. ప్రబంధాలలోది కవుల రచనల నాధారంగాఆయా కవుల మూర్తికల్పన చేయడం[2]లో కృష్ణశాస్త్రిగారి ప్రబంధ సాహిత్యంపైనున్న ప్రీతి: ప్రగాఢ పరిచయం సువ్యక్తమవుతాయి.

బలవత్తరమైన తనభావనాశక్తితో పుష్పలావికలతోనూ విరివి పణివీధుల కలకలంతోనూ కూడుకున్న గతకాలపు ఔన్నత్యవైభవాలని సంతరించుకున్న ఒక సౌందర్య జగత్తుని మనముందు ప్రత్యక్షంగానిస్తారు. పూలపరిమళాల్ని, పూబోణుల ఒయ్యారాలనీ పొందుపరచిన అనుభూతిని వర్ణ, పద, వాక్య విన్యాసాలు ప్రకటిస్తుంటే తెలుగుభాషా పరిమళం, పూలపరిమళంకన్నా, పూబోణుల వయ్యారాలకన్నా తెలుగుమాటల ఒయ్యారాలు మన మనస్సు నాకట్టుకుని వ్యాసం చదవడం పూర్తయ్యేదాక మనన్ని ఆభావాల పరిమళం పట్టుకుని వదలదు.

ప్రతీ తీర్థక్షేత్రంలోని దేవాలయాంగణంలోనూ ఒక కొలనుంటుంది. దాన్ని కోనెరుగా పేర్కొంటారు. స్వచ్ఛమైన కోనేటి నీటిలో మన శరీరాలు, ఆత్మలూ ప్రతిభించించి అది గలగలమనడం, ఉసురుసురుమనడం జరుగుతూ

1. "అప్పుడు పుట్టిఉంటే..................పుట — 74
2. ,, ,, 64 & 64

ఉంటుంది. ఈ మానవ శరీరమే పరమాత్మని నిలయమైన కోనేరు పరమాత్మని నిలయమైన కోవెలకాగా మన కల్మషాల నన్నిటినీ ప్రక్షాళించి పవిత్రులనీ చేసే మనస్సే కోనేరు అవుతుంది. కానీ భగవత్సాక్షాత్కారాన్ని తమలో పొందలేనివారి మనస్సులు కోనేరులు కాలేవు అనే అంతస్తత్త్వాన్ని ధ్వనింపచేస్తు పరరమణీయంగా భావచిత్రణ చేస్తారు "కోవెల - కొలను" అన్న రచనలో.

వివిధ సుగంధ ద్రవ్యాలనీ. వాటి వాడకంలోని వైశిష్ట్య వైవిధ్యాలనీ మేలురకపు పరిమళద్రవ్యాలు లభించే ప్రాంతాలని గూర్చిన పరిజ్ఞానాన్నీ, వాటి వినియోగవేళలనీ, సమానార్థకపదాలయిన సువాసన, సౌరభం, సుగంధం, పరిమళం, ఆమోదం అన్నపదాలలోని భావనావిభిన్నతనీ,[1] వీటిలో గుబాళించే ప్రాచీన కవితాసౌరభాలనీ వివరిస్తూ వీటి పరిమళంలోనుంచి భగద్భావనా భాసితమైన అంతస్సాక్షాత్కారంవైపు నడిపించే వ్యాసం "సువాసన ద్రవ్యాలు. బాహ్యాంతర సౌందర్యాలకేకత్వాన్ని సాధించే యత్నఫలమే ఈ రచనగా కనిపిస్తుంది. "ఈ వాసనలన్నిటినీ మించిన సౌరభం దేవాలయంలోనిది. ఆ చోట కూడా ఆ పచ్చకప్పురమే, ఆ చందనమే, ఆ పుష్పమే, ఆ కుంకుమే. అయితే ఆ కుంకుమకు అమ్మవారి చరణసాన్నిధ్యం మరీ రక్తినిచ్చింది, ఆ పుష్పాలకు స్వామి పాదపరిమళంకూడా అంటుకున్నది. ఆ ద్రవ్యాలన్నీ తులసినీటలో దొప్పతోగినవి"[2] అంటూ బాహ్యసౌందర్యానికి పరమావధి భగవత్సౌందర్యంలో విలీనం కావడమేనన్న రచయితభావం సువ్యక్తమవుతుంది.

కృష్ణశాస్త్రి మధుర భక్తితత్త్వాన్నావిష్కరించే రచన "కృష్ణావతార తత్త్వం; విశ్వసౌందర్యరూపుడైన శ్రీకృష్ణుడి ప్రణయవార్ధిలో ఓలలాడి పరవశించింది గోకులమంతా. అందులో పరాకోటినందినది రాధ. రాధా కృష్ణుల ప్రణయం తరతరాల ప్రేమైక జీవులకాదర్శమైనది. నిత్యతరుణ శృంగార

---

1. "సువాసన పిలుపువంటిది, సౌరభం పక్షివంటిది, పరిమళం పట్టుకుని విడవని బంధువుకాదు. తరిచూచిదరియ వచ్చేనేస్తం ఆమోదానికి స్వార్థంలేదు, కలసినటుచేసంఎక్కువ......... "పుష్పలావికల సంపుటి పుట — 37
2. సువాసన ద్రవ్యాలు-పుష్పలావికల సంపుటి ,, 38

మూర్తులైన రాధాకృష్ణుల ప్రణయం ఆత్మపరమాత్మల అనురక్తికి సంకేతం. అందుకనే కృష్ణలీలలన్నీ విశ్వమోహనమైనవే అయినా రాధా మాధవ ప్రేమే కృష్ణశాస్త్రిగారికి ప్రియతమమై తదనుభూతి వైశిష్ట్య మాధుర్యాలని ప్రతిఫలిస్తోంది.

నవవిధ భక్తిమార్గాలలో ఒకటైన సఖ్యభక్తికి రామావతారంలో గుహుడు ప్రతినిధిగా నిలుస్తాడు. ప్రాచీన కవులు ఎంతోమంది చమత్కారంగా రాతిని నాతినిచేసిన రామపాదాలు సోకితే తనపడవే మౌతుందోననే భయంతో రామ చరణాలని కడిగి మరీ పడవనెక్కనిచ్చాడని వర్ణించారేగాని దానివెనుక నున్న గుహుడి అంతర్యాన్నావిష్కరించలేదు. కృష్ణశాస్త్రిగారుతప్ప. తానే గుహుడై వియోగవేదనాభరితమైన మాటలతో ఆయన పాదపద్మాలని ఒక్కమారైనా తాకి కడగాలనే తపనని, కడుగుతూండగా కలిగిన అనుభూతినీ అక్షరరూపంలో మన ముందుంచుతారు. సుగ్రీవుడికిగాని మరెవ్వరికిగానీ లభించని రామమిత్ర పదవికి యోగ్యుడైన గుహుణ్ణి తనలో దర్శించి తన వాక్కులద్వారా మూర్తి కల్పనచేసిన కృష్ణశాస్త్రిగారి ప్రతిభ అమోఘం.

"వేదన మనిషికి ఔన్నత్యాన్ని, ప్రత్యేకతనిస్తుంది. నాకూ చాలా బాధా భారమూ, వేదనావరమూ లభించాయి. అదినాకు కొంత ఔన్నత్యము నిచ్చిందేమో!" నంటారు 1964లో తన మధురగళాన్ని కోల్పోయిన కృష్ణశాస్త్రిగారు 1966 ఆగష్టు 17న కాకినాడలో తనకు జరిగిన సన్మాన సభలలో ఈలోకమూ, సంసారమూ, మానవుడూ, ఈ జీవితమూ మహాఇష్టంవల్ల జరనూరుజనూ గేలవచ్చు "నంటూ విశ్వప్రేమలో తనకున్న అచంచల విశ్వాసాన్ని వ్యక్తంచేస్తారు. కాకినడంటే తనకున్న అభిమానాన్ని తెలియజేస్తు అక్కడకనుక తానుంటే తనకుటీరంలో ఎటువంటి సుందర వాతావరణముందాలో వివరిస్తూ తన సౌందర్యారాధనని వెల్లడిస్తూ "కోయస్న పనప్రియూరావానికి బదులుమాత్ర చెప్పలేను" అని ఆపరేషనైన మర్నాడు తాను డైరీలో వ్రాసుకున్న పంక్తులతో పాఠకుల హృదయాలని కరుణ రసార్ద్రంగావిస్తారు.

---

1. 1966 ఆగష్టు నెల 11న జరిగిన కాకినాడసన్మానసభా ప్రసంగపాఠం

1970 11న తూర్పు గోదావరిజిల్లా రచయితల మహాసభలో శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారిచేత చదివించిన ప్రసంగపాఠం "మళ్ళీ ఆరోజుల జ్ఞాపకాల"లో ఆ సభకి రాజకీయ నాయకుల నున్నతస్థానంలో కూర్చోబెట్టక పోవడానికి ప్రశంసిస్తు సాహిత్యసభలకి రాజకీయ నాయకుల నధ్యక్షులని గావించడాన్ని, ప్రయోజనాల నాశించి భజనచేయడాన్నీ, పూర్వపు ప్రాంతీయతా దృష్టితో సాహిత్య సంస్థల నేర్పరచడాన్నీ గర్హిస్తూ సాహిత్యమండలి వార్షికోత్సవాన్నిర్మిస్తారు. ఆ సభలోనున్న గుణలోపాలెత్తిచూపుతూ సమాజంతో పాటు మారని సాహిత్యధోరణులని చెప్పి, సమాజ ప్రగతికి రచయిత వహించవలసిన బాధ్యతలనీ, అభ్యుదయకాముకతోపేతమైన ఉత్సాహం రచయితలో ఉండాలని హెచ్చరిస్తాడు. "అసత్యమనే గడియ తొలగించి నిర్భీతిగా నిజంపలకాలిరచయితలని" హెచ్చరిస్తారు 1964 ఆగష్టు 14 విశాలాంధ్రలో ప్రచురితమయిన వ్యాసంలో రానున్న విధానంలో సాధారణమానవుడే మకుటధారి" అని భవిష్యద్దర్శనం చేస్తారు. 1946 మార్చిలో అభ్యుదయ రచయితల తృతీయ మహాసభాధ్యక్ష పీఠనుంచి.

కృష్ణశాస్త్రిగారి ప్రగతిశీలతను ప్రతిబింబిస్తుంది సరస్వతీగానసభ ఉత్సవాలలో ఆయనచేసిన ఉపన్యాసం[1]. సరస్వతీ గానసభ చరిత్రను చెప్పి దాని పరిపోషకులని ఉగ్గడిస్తు బి.ఎన్. రెడ్డిగారి సన్మానంలోగల ఔచిత్యాన్ని వివరిస్తారు. కళాభివృద్ధిలో నేటి చలనచిత్రాల పాత్ర విశదపరుస్తారు. సంగీత సాహిత్యాది కళలని జుబ్రుపదునుచేసి సామాన్యులందరికీ అందుబాటులోకి తేవడానికి చలనచిత్రరంగాన్ని ప్రముఖ సాధనంగాభావిస్తారు.

1-2-78 'నాకు వంశీఆర్టు థియేటర్స్‌వారు జరిపిన సన్మానసభలో చి॥ సౌ॥ హేమలత చదివిన ఆయన ఉపన్యాసంలో సన్మానాలంటే తనకిష్టం లేవనీ, బిరుదు ప్రదానాలలో ఉండే అసమంజసతలని, సున్నితంగా పరిహసిస్తారు. కవి మతాలకీ పార్టీలకీ అతీతుడంటూ "పార్టీలకన్నా కుల మతాల కన్నా గొప్పవాడు కవి" అంటారు. రాత్రిని తల్లిగానూ అమ్మ ఒడిగానూ

1. కృష్ణశాస్త్రిగారి నద్దనున్న టేపురికార్డు చేయబడిన ఉపన్యాసం.

భావిస్తూ "ద్రష్ట అయినవానికి సృష్టిలోని ఏకత్వం బాంధవ్యం రాత్రివేళ ఎక్కువకా స్ఫురిస్తుందేమో" నంటారు. హైద్రాబాద్ నగరవాసంలో తమ అనుభవించిన చేదుల్ని నెమరువేసుకుంటారు. మనిషికోసం, సహవాసం కోసం తపనపడే తపననీ, వసుధైక కుటుంబ భావననీ వ్యక్తంచేస్తారు. "ఘామ పుడి స్వేద-బిందుపుష్పులు రాలినచోట, అశ్రుకణమొలికినచోట దేవళ్లాలు మొలుస్తాయంటారు మానవతావది కృష్ణశాస్త్రి.

1978 మార్చి 5వ తేదీ "సంక్రాంతి" సాహితీ సంస్థచేసిన సన్మాన సభా ప్రసంగంలో తన ఆశావాదాన్నీ, సంగీత కవిత్వాలకన్నా తనకి మనిషి మిన్న, అని అంటూ మనిషిలో ఎడతెగని సావాసమూ, ప్రేమిస్తే ఆనందం, దప్పు అయితే కొట్టుకుపోవడాలే తనకు తెలిసినవంటారు. ఆయన కవిత్వంపై పరిశోధనచేసి డాక్టరేటు పట్టానొందిన శ్రీమతి నిర్మలాదేవి[1] చేసిన ఆనాటి ప్రసంగావ్మెంతో ప్రశంశిస్తూ ఆమెకు తన ఆశీస్సులనందచేసారు.

"నాకవిత్వాన్ని మెచ్చుకోకపోతేనాకేం? నన్ను ప్రేమించండి. నేను పోయాక నాకోసంకూడా మీకన్ను రవంత తడి స్తేచాలు. నన్ను మరచిపోకండి. "ఏటికినేను బిడ్డను, తోటకుతోబుట్టువును, పాటనాకు కూడు, పక్షినాకు సైదోడు నాపేరు బికారి మరోపేరు బాటసారి, మనసున్నచోట నామజిలీ మరి కాద్దంటే బదిలీ" అంటూ కడపజిల్లా రచయితల సన్మానసభలో అన్న ఆయన మాటలో (వచనంలో) ఎంతకవిత్వం తొణికిసలాడుతోంది!

"ఈ నెరసినజుట్టు మూగతనం - వీటితో మౌనానందస్వాములు లాగున కనబడుతున్నాను కదూ! అయితే నాదిమూగతనం. మౌనంకాదు" అన్న చమత్కారయుతమైన మాటల్లో భావార్ద్రిత అనుభవైకవేద్యం, ఆయన "ఈ మూగతనాన్ని 1925 నుంచీ పసిగట్టినట్టు "గొంతుచీకటిగా సుప్తశిలగా" "మూగవోయిన నాగళమునను", కంఠనాళమందు మ్రోగక చరించు చెలువడ్డ మూగబాధ" అభివర్ణించడంలో భవిష్యద్దర్శియైన ఋషికల్పుడుగా గోచరిస్తాడు.

---

1. ఈ వ్యాస రచయిత్రి.

# యక్షగాన నిర్మాణ నైపుణి-విప్రనారాయణ యక్షగానం

దేశికళలలో తెలుగువారెక్కువగా ఆదరించి అభిమానించిన వాటిలో యక్షగానమొకటి. తెలుగు సాహిత్యంలో పాల్కురికి సోమనాథుడి పండితారాధ్యచరిత్రలో మొట్టమొదట ఈ యక్షగానప్రసక్తి లభిస్తుంది. తర్వాత శ్రీ మేశ్వరపురాణం క్రీడాభిరామాలలో వీటినిగూర్చిన ప్రసక్తులుగోచరిస్తాయి. ఇలా అతిప్రాచీనకాలంనుంచీ వస్తున్న ఈ యక్షగానాలు దక్షిణాంధ్రాయుగపు సాహిత్యంలో స్వరూప స్వభావాలలో క్రమపరిణామ వికాసాలనిపొంది ఆయుగపు సాహిత్యంలో అత్యున్నత స్థానాన్నలంకరించి విరాజిల్లాయి. తంజావూరు నాయకురాజుల తర్వాత మహారాష్ట్ర ప్రభువుల ఆదరాభిమానాలతో పరమోచ్ఛదశనొందాయి. మొదట మతసంబంధమైన ఇతివృత్తాలే కలిగిన యక్షగానాలు క్రమక్రమంగా రాజుల ప్రణయ పరిణయోదాంతాలని కూడా తమలో ఇముడ్చుకున్నాయి. కూచిపూడివారి పోషణలో పండితపామర మనోరంజకమయి అందరి మన్ననలనుపొంది సాంఘిక ప్రయోజనార్థం రచింపబడసాగాయి.

ఈ యక్షగానాలలో మొదట తాళ లయలతో గూడిన గేయప్రాధాన్య మెక్కువగా ఉండేది. రగడ వికారమైన ధృవగానం లేకదరువులు (రేకులు), ద్విపదలు, ఏలలు, అర్ధ చంద్రికలు, ధవళ శోభనములు, అల్లోనేరళ్ళు మొదలైనవి ఉండేవి. క్రమంగా ఆటవెలది తేటగీతులు, కందాలు మొదలై జాత్యుపజాతులు. వృత్తాలు చేరాయి. కథను అనుసంధించడానికోసం చేర్చిన సంధి వచనాలేకాకుండా సంభాషణారూపమైన వచనాలుకూడా ఇందులో క్రమంగా చోటుచేసుకున్నాయి. నెమ్మది నెమ్మదిగా మార్గకవితా ప్రభావంతో నాందీ ప్రస్తావనలు, అంకవిభాగం, సంధులు, భరతవాక్యాలు ప్రవేశించి మార్గరూపక ప్రక్రియకు చేరువయింది.

పాశ్చాత్య సాహిత్యావలోకనంచేత సంగీతరూపకాలకెక్కువ ఆదరం లభించసాగింది. ఆ సమయంలోనె ఈ యక్షగానాలపైకి ఆధునిక కవులదృష్టి ప్రసరించనారంభించింది. యక్షగాన ప్రక్రియని చేబట్టిన ఆధునిక కవులలో శ్రీ కృష్ణశాస్త్రిగారు ప్రముఖులు. రేడియో వారికోసం బాలాంత్రపు రజనీ

కాంతరావుగారి ప్రోద్భలంతో ఆయనక్షీరసాగర మథనం, శ్రీ విప్రనారాయణ మాళవికాగ్నిమిత్రం మొదలైన యక్షగానాలని సంగీత సాహిత్యాలని సమ్మిశ్రితమొనర్చి శ్రోతలకర్ణరసాయనంగా రూపొందించారు. తరువాతవాటిని కూచిపూడివారు తీసుకుని ప్రదర్శిస్తున్నారని వినికిడి. అముద్రితాలైన వీటిల్లో నాకు విప్రనారాయణ వ్రాతప్రతి ఒక్కటే శ్రీ రజనీగారివద్ద లభించింది. మరేవీ ఎవరివద్దా నాకులభించలేదు. కనుక లభించినవ్రాతప్రతి నాధారంగా తీసుకుని కృష్ణశాస్త్రిగారి యక్షగాన రచనా విధానాన్ని స్థాలీపులాకంగా వివరించడం జరిగింది.

శ్రీ మహావిష్ణువు ఉరోభూషణమైన వైజయంతీమాల యొక్క అవతారంగా భావించబడే విప్రనారాయణుడు తొండరడిప్పొడి యాళ్వారు (భక్తాంఘ్రిరేణువు)గా ప్రసిద్ది పొందినవాడు. అతని చరిత్ర వైష్ణవ సాహిత్యంలో సుప్రసిద్ధమైనది. సారంగు తిమ్మయ్యచేత వైజయంతీ విలాసమనేపేర శృంగార ప్రబంధంగానూ ఇంకా ఎంతోమందిచేత ఎన్నోరూపాలలో రచింపబడింది. కృష్ణశాస్త్రిగారు కూచిపూడి సంప్రదాయానుగుణంగా సర్వాంగ సుందరంగా దీన్ని మలిచారు.

సూత్రధారుడు ప్రార్థనాపద్యం చదవడంతో ఈ యక్షగానం ఆరంభమయి తరువాతి బృందగానమైన దరువొకదానిలో "కుంతీమాధవు-కూర్మిసోదరి కుక్కుటార్ధేందుశేఖరుని దేవేరికి హెచ్చరిక కూచిపూడి సంప్రదాయానుగుణంగా చెప్పబడింది. "శ్రీ కృష్ణదాసచకోర పూర్ణిమా రజనీకాంతోదయా" అని ఒకచోట అంటూ తనపేరునీ, ఈ యక్షగాన రచనకి ప్రేరేపకుడూ, సంగీతసారధీ అయిన "రజనీ"కాంతరావు పేరునీ సూచిస్తాడు కవి. తర్వాత సూత్రధారుడు రాజరాజేశ్వరీదేవినొక సీసపద్యంలో స్తుతించి "శ్రీ విప్రనారాయణ చరిత్రంబను యక్షగానంబునకు కథాక్రమం బెట్టిదనిన" అని అంటూ శ్రీరంగపుర వర్ణనతో కథనారంభిస్తాడు. ఈ విధంగా నాంది ప్రస్తావనలతోకూడుకున్నదీన్నిపూర్వరంగమనవచ్చు. "ఓరంగశాయీ" అన్న బృందగానాన్ని దేవదేవీ విప్రనారాయణుడు, దేవదేవి, విప్రనారాయణుడు, దేవదేవి చెలికత్తె మధురవాణి, విప్రనారాయణుడి శిష్యుడు శ్రీనివాసుడు,

అర్చకుడు, వేశ్యమాత ఇందులోని పాత్రధారులు. "వెడలెరా ఒయ్యారులు - వెలనారులు" అన్న వర్ణనపాటతో దేవదేవి మధురవాణులు విప్రనారాయణుడి పూదోటకి బయలుదేరడంవఱకు ఒక రంగంగానూ మిగిలినదంతా రెండవ రంగంగానూ తీర్చబడింది. సగం కథ సూత్రధారుడి మాటల్లోనూ మిగిలిన కథ పాత్రల పాటలు పద్యాలతోగూడిన సంభాషణలోనూ సాగుతుంది. రామప్రియ, ఆనందభైరవి మొదలైన రాగాలు దరువులకి కూర్చబడ్డాయి. సీసపద్యాలు మూడూ నాలుగు కందపద్యాలు, ఒక లయగ్రాహి, చంపకమొకటి, ఒక మత్తేభమూ చివరలో భరతవాక్య స్థానీయమైన "ఓ రంగసాయీ" అన్న బృందగానమొకటి కూర్చబడ్డాయి. "గుడిగంటలూ పూజాధ్వనులూ" అనే ప్రయోగ సూచనలివ్వబడ్డాయి. ఈ విధంగా యక్షగాన ప్రాచీన అర్వాచీన సంప్రదాయాలన్నిటినీ కలిగి అభినయానుగుణాలైన గీతాల వల్ల రంగస్థల ప్రదర్శనాయోగ్యతని కూడా ఈ యక్షగానం సంతరించుకున్నట్లు నిరూపిస్తోంది కాబట్టే తర్వాత దీనిని మరికొంత పెంచి శ్రీ వెంపటి చినసత్యం నృత్యరచనని, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు సంగీత సారథ్యాన్నీ వహించగా, నేపథ్యగాయకత్వాన్ని బాలమురళీకృష్ణ వింజమూరి లక్ష్మి వహించగా చంద్రమోహన్ రత్నపాపలు నాయికా నాయకులుగా శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి రంగస్థల దర్శకత్వంలో ప్రదర్శితమయినట్లు 1968-69 సం॥పు వినోదినీసభ పావనీరువలన వెల్లడవుతోంది. ఈ విధంగా పరిమితకాలంలో ప్రసారం చేయడానికిగాను వ్రాయబడ్డా పాత్ర చిత్రణా పాటవం, పాత్రోచితభాషావైదగ్ధ్యం, రసపోషణానైపుణ్యం, వృత్తపుచిత్య సంవిధానం, గేయప్రాధాన్యం, భావసౌకుమార్యం పదలాలిత్యాలతో విరాజిల్లుతూ కూచిపూడీ సంప్రదాయబద్ధంగా విరచితమయి యక్షగానాలలో విశిష్ట స్థానాన్నలంకరిస్తోంది.



కోయ్ మురళీ మ్రోయించకోయ్ కృష్ణా! తీయతేనీయబరువు మోయలేదీ బ్రతుకు"[1] అంటూ "మురళిపాటకు రగిలి మరుగు నీ వెన్నెలలు సొగయు నాయెదకేల తగని సౌఖ్యజ్వాల" అనీ "భరమోయి నీ ప్రేమవరమే నేటిరేయి" అంటూ పరమోదాత్తంగా కృష్ణప్రణయ మాధుర్యాన్ని ప్రకటిస్తారు.

కృష్ణప్రేమలో మునిసిన ఆయనయెద ఆలపించిన మరోగేయం "మురళి మధుమురళి, మురళి మృదుమురళి" అనేది.

ఈ చరణమే "మధు" "పదం" "మధురం"గానూ, "మృదు"పదం "మృదుల"గా గానూమారి "మదురమురళి మృదుల మురళి"గా సాక్షాత్కరిస్తుంది.

ఆ మురళీభాగ్యమెటువంటిది? అంటే శ్రీకృష్ణుని అధరామృతాన్ని గ్రోలేది. ("అధర సీధుపులాను మురళీ")

"కడిమి తెరుపులా నడీమితరుపులా నడచివచ్చేది"

"అలపొదపుల పాలకడవల అమృతముంచేదీ

"నీలి నీలిపిసాళికనుల నీరునించేదీ", క్షుభిత హృదయవెతలను తీర్చేదీ ఆ మురళీ. ఇలా వంశీనికృష్ణుడికి సంకేతంగా కృష్ణగానమహాత్మ్యాన్నీ, మాదుర్యాన్నీ వర్ణిస్తాడు కృష్ణశాస్త్రి. ఆ పదాలకూర్పు అత్యంత మాధుర్యంగానూ మంజులంగానూ ఉండే మురళీగానరవళిని విన్న అనుభూతి శ్రోతలకి కలుగుతుంది.

<u>ప్రకృతి వర్ణనాత్మకగేయాలు :-</u> "మధూదయంతో మంచి ముహూర్తం మాధవీలతకి పెళ్ళి" అంటూ ఆ పరిణయోత్సవానికి "మల్లీ మాలతిమందారాలు పేరంటాండ్రు" అంటాడు కవి. "కొమ్మకొమ్మ కొకసన్నాయి రెమ్మరెమ్మకొక గవాయి", "కొమ్మా రెమ్మా కలసి మామిడి గుబురంతా ఒకటే

1. "పైతాళికులు"—గీతం—పుట

హాయి" అంటూ వసంతర్తు శోభని మనోజ్ఞంగా చిత్రిస్తాడు "నందన మంతా పందిరి అయితే మన్మథునికి సలయమంటపమైతే మాధవీలతకు మాధవ దేవుడు మంగళసూత్రం కడతాడు" అంటూ శృంగారభావాన్ని పరమ రమ్యంగా చిత్రిస్తూ మానవీకరణ చేస్తాడు. ప్రకృతి (మాధవీలత) "స్త్రీ"గా, మాధవ దేవుడిని (వసంతుడు) పురుషుడుగా భావించి పరిణయాన్ని "మంగళ సూత్రం"తో సూచిస్తూ వారి మధ్యనున్న అనురాగబంధాన్ని రూపొందిస్తాడు.

"నదీసుందరి సువాస్యందిని నగాధీశ్వరనందినీ" అంటూ నదిని సుందరిగా భావించి ఆ పదాలకూర్పులోనే ఆమెనడకల హొయలని సూచిస్తాడు. ఇక్కడ "నగాధీశ్వరనందిని" అనడంలో పర్వతరాజు హిమవంతుని పుత్రిక గంగా నది అనే అర్థంతోపాటు పార్వతీదేవితో సమాన ప్రతిపత్తిని కల్పిస్తారు. గంగాపార్వతుల సపత్నిత్వాన్ని సహోదరత్వాన్ని వ్యంజిస్తాడు. ఈ విధమైన శ్లేషచమత్కారాన్ని భాసింపచేస్తాడు కృష్ణశాస్త్రి.

"కడిమితోపుల నడిమిబాటల ఇసుకబైళుల మిసిమిదారుల

రాసీ రాసులుగా-ఎవరో పోసినారమ్మా! వెన్నె పోసినారమ్మా" అంటూ వెన్నెలరాత్రిని వర్ణిస్తాడు. ఇలా ప్రకృతివర్ణనలో ఆయన భావుకత పరిమళిస్తుంది. "తపకు లతార్ బుటాలద్దిన నీలపలయమ్మొగుడారం, అఖిల సుఖదమ్మొబిడారం, చేయిచేయి మెయిమెయి తగిలిచి చెంతనే ఉండాలిప్యారీ, చెలియయేమూ పాలిహోరీ" "రావెసాకీ రావెసాకీ" అంటూ ఉర్దూ, అరబీ, పారశీక పదాలతో "ఉమర్ ఖయాం"ని సాక్షాత్కరింపజేస్తారు.

ప్రస్తుతిగేయాలు :- రవీంద్రుడిని "ఓ కవీంద్ర రవీంద్ర! ఉజ్జ్వల యశస్సాంద్ర" అంటూ రవీంద్రుడిపైని తనకున్న భక్తిప్రపత్తుల నావిష్కరిస్తారు.

"వందనమయ నీ సుందరవాణికి, రసదానికి

కేలుమోడ్తు ని నిర్జరకీర్తికి, మధురమూర్తికి! అంటూ "ఓ ప్రవాకాళిదాస! రసికజన హృదయభవనవాస!" అనీ ఆయన కవిత్వాన్నతాన్ని

భినుతిస్తారు. ఇలాగే "కమ్మగా బ్రతికితే గాంధీయుగం" అంటూ గాంధీయుగ మహత్త్వాన్ని భివర్ణిస్తారు. గాంధీ బోధించిన పర మతసహనాన్ని "నారాయణ నారాయణ అల్లా అల్లా అంటూ మాపాలిటి తండ్రీ నీ పిల్లల మేమెల్లా" అంటూ భగవంతుడొక్కడే మతాలుభిన్నమైనానవీ మానవులంతా సోదరులని సూచిస్తారు.

"మనిషి మారితె కొ వెలగ గాంధీ"తనమంటారు.

"తన కంఠమున దాచి హాలాహలం, తలనుండి కురిపించి గంగా జలం మనిషి శిప్రడవడమే గాంధీమతమని కష్టల్లో తనున్నా ఎదుటవాడికి ఆనందాన్ని పంచివ్వాలి, కలుగచెయ్యాలని చెప్పే శివతత్త్వపారమ్యబోధనని చేస్తాయి.

అభ్యుదయగేయాలు :- "పదవోయిక పదవో ఇది నిజమే పదపద తరలిందిదె ప్రజారథం పొలిందిది ప్రపంచపథం" అంటూ అభ్యుదయ కాముకత్త్వాన్ని సూచిస్తారు. "ఇది మాత్రం నిజమనవోయ్ ముదిలోకం పోయిందని ఎదు రైనది సమభావం, పదునైనది యువజీవం" అంటూ నిన్నప్రహారానైశ్యాలతో గూడిన జీవితం పమసిపోయి ఉత్సాహభరితమైన యవ్వనంవంటి జీవితం యొక్క తీక్షణతని "పదునైనది" అంటూ "నమభావాన్ని" బోధిస్తారు. ముది లోకం పూసిందనీ, ప్రతిజాతికి స్వాతంత్ర్యం పరపీడన రాహిత్యం కలిగి "వికసించే విధానంలో మానవుడే మకుటధారి" అని మహోన్నత మానవతా వాదాన్ని ఎలుగెత్తి చాటుతాడు.

ప్రణయగీతాలు :- ప్రణయగీత రచనలో కృష్ణశాస్త్రిగారు ఒహానిపుణులు. లలితశృంగారభావాలని వ్యక్తపరచడంలో ఆయనకాయనేసాటి. "పేసంగి ఎపూపేటి విరిమల్లిపేదేవి! నడిరేయి నడమూపు జాబిల్లివే నా ప్రేమమందార సుమమల్లిపేదేవి నాలోన లోలోన నటియింపవే" అన్నగీతం పైదాన్నె నిరూ పిస్తుంది.

అనార్కలీ నాటకానికి నాందీగీతంగా ఏలాగు మెప్పింతో ఈ పదస్యుల మ్రోల పేదవానిమహాపుగాథ" అని రచిస్తారు.

"బ్రతుకులేమో భస్మమైనా ప్రణయమైనా బ్రతికియుంటే, స్వర్గ మంటే మరుగుపెదలకు శాంతిసుఖములు రాకపోవు" అంటూ సలీం అనార్కలీల విఫల ప్రణయాన్ని సూచిస్తూ ఆశావాదాన్ని ప్రకటిస్తాయి.

"తోట తోటల నేలు మేటి యామని పాదపీఠాన పడినదే పేదదానిమ్మ పూవు" అంటూ భంగ్యంతరంగా సలీం అనార్కలీల ప్రణయగాదని చెప్తారు.

ప్రభువు లోకముసూట తోట తోటలన్నీ మించు మేటికాదేవలపు దాటగలదే ప్రియుడు దానిమ్మవలపు, దానిమ్మపువ్వుపాట" అంటూ కథను వ్యంజిస్తారు. ఇందులో ఆధ్యాత్మికస్పర్శ కూడా అభివ్యంజితమవుతుంది. ఇలాగే "గడ్డిపూవు"లో "నీ పూలదండలో మెరసిపోనీవోయి, ఈ లేత గీతాలు నీగూటి మూలనే మూగవోనీయవోయ్, ఈ చిన్ని సెలయేళ్ళనో కొండకోనలో యింకిపోనీవోయ్", నీ ప్రేమరాసిలో నిండిపోనీవోయ్ అంటూ భగవంతుడిలో విలీనమవ్వాలనే వాంఛనభివర్ణిస్తాడు.

**గ్రామికగేయాలు :-** నవవధువును అత్తారింటికిచేర్చే పల్లెకి బోయీల "మొయ్యర అమ్మోర్ని మొయ్" అనేపాటా, "ఎలుకా చిల్లెలుగా ఊరికే చూస్తావెందుకు ఉరికు కిపడవెందుకు" అనే దంపుళ్ళపాటలు, "గున్నాసారి గున్నమ్మ! ఓ గున్నసారీ గున్నమ్మా! ఊడుపులూడ్చేకాడా నీకూ ఒడినిండా పసుపెంటుకే" అన్న ఊడ్పులపాటలూ, "చువ్వీ చువ్వన్నలాలో చువ్వన్న లాలో" అనె పాటలు.

"సెంద్రైలేజోర్ లంగర్, జోర్ లంగర్ రోడ్డుకోలర్" అంటూ "ఏయ్యరా అడుగెయ్యరా! భాయ్! కొండరాళ్ళతో వడ్డాణం మన కృష్ణమ్మేటికి కడదాము" అన్నపాటా, "జోప్సాయ్ బార్సాయ్ కోటపల్లి రేవుకే, అది రొయ్య, ఇదిమీను అదిజెల్ల" అంటూ బెస్తవాళ్ళ కంఠం అన్నీ ఆయన గళంనుంచీ కలంనుంచీ జాలువారి, గ్రామిక కర్షకజీవులమీద ప్రీతినభివ్యక్తం చేస్తాయి. "చౌరస్తా అహిస్తా! ఏక్సవారి చార్అనా" అంటూ రిక్షావాలా కంఠంతో ఆలపిస్తారు.

గళం మూగవోయినా కలం సాగుతూనే ఉందంటూ చివరిపరకూ వ్రాస్తూ "శితవేళరానీయకు శిశిరాని చౌటీయకు" అని నిరాశా నిస్పృహాలని

దరికిరానీయక అనవరత సాహిత్యప్రస్థానాన్ని సాగించారు కృష్ణశాస్త్రి "దూకుతుపోతే కుందేలూ, పాకుతూపోతే తాబేలూ, దూకిపాకి ఇలా ఏకాకి బ్రతుకుకెట్టాగో నెట్టేస్తా"" అంటూ రిక్షావాలా కంఠంతో జీవితసత్యాన్ని వెలారుస్తారు.

## సినీగేయాలు

కాకినాడ సరస్వతీగానసభ స్వర్ణోత్సవ సందర్భంలో కృష్ణశాస్త్రిగారు వెల్లడించిన "సంగీతాదికళలు సకల జనామోదంపొంది అందరికీ భోగ్యం కావాలంటే సినీమాయే పరమసాధనంగా కనిపిస్తోంది. సంగీత కళాభిరుచిని ఒక్కొక్కమెట్టే ఎక్కించేందుకు సినీమాలు చక్కని సాధనాలు"1 అన్న అభిప్రాయానుగుణంగా 1942లో బి.ఎన్. రెడ్డిగారి ప్రోత్సాహంతో కవిగా చలనచిత్ర రంగంలోకి ప్రవేశించారు. మల్లీశ్వరి చిత్రానికి కథ, పాటలు, మాటలు అన్నీ ఆయనవే. ఆనాటినుంచి తుదిఘడియవరకూ సుమారు వంద చిత్రాలకి కొన్నివందల పాటలని వ్రాసి సినీసాహిత్యానికి సాహిత్యజగత్తులో ఒక ఉన్నత స్థానాన్ని కల్పించారు. ఆయన సినీగీతాలు కూడా ఉదాత్త కవిత్వ పరిమళాలను కూర్చుకునుంటాయి. ఆయన కవిత్వంలోని విలక్షణత వాటిల్లోనూ స్పష్టంగా భాసిస్తూ కృష్ణశాస్త్రిగారి ప్రత్యేకవాణినీ బాణీనీ ప్రస్ఫుటం చేస్తుంది. ఈనాటి కొన్ని సినిమా పాటల్లోలాగా ఎక్కడా అసభ్యతకాని అశ్లీలతగానీ ఆయన గీతాల్లో కనపడదు. అయన రచించిన ప్రతీగీతం శ్రోతల హృదయాల్లోకి చొచ్చుకుపోయి జిహ్వాగ్రాలమీద ఎల్లప్పుడూ నర్తిస్తూంటుంది. వాటికి పాతబడడమంటూ ఉండదు. మల్లీశ్వరిగీతాలే ఇందుకు తార్కాణం.

ఆయన తొలిచిత్రం "మల్లీశ్వరి"లోని "ఆకాశవీధిలో హాయిగా ఎగిరేవు" అన్న పాటలో అందాల- చందాల, నీలాల, రాగాల, మమత లెరిగిన, మనసు తెలిసిన, జాలిగుండెల మేఘమాలగా సాక్షాత్కరించే మేఘ మాల పాట వైశిష్ట్యాన్ని ప్రాధాన్యాన్ని పురస్కరించుకుని కృష్ణపక్ష స్వర్ణో

త్సవ సంఘంవారు ఆయన సినీగీతాల సంపుటికి "మేఘమాల" అనే పేరుంచడం జరిగింది. మేఘమాల అత్యున్నత కవితాంబరవీథుల్లో విహరించే కవి భావుకతకి సంకేతంగా తోస్తుంది. ఒక్క 'మేఘమాల' పాటతో మహో మేఘ సందేశాన్ని సృష్టించిన అపర కాళిదాస కవీశ్వరులుగా కృష్ణశాస్త్రిగారు పలుపురి ప్రశంసలనందుకున్నారు. మల్లీశ్వరిలోని పాటలన్నీ రసగుళికలే కనుకనే ఇన్ని సంవత్సరాలైనా మరుగునపడకుండా నిత్యనూతనానందాన్నిస్తు న్నాయి. ఆనాటి మల్లీశ్వరి నుంచి ఇటీవలి "అమెరికా అమ్మాయి", "సీతా మాలక్ష్మి", "బంగారక్క", "కార్తీకదీపం", "వినాయకవిజయం", "గోరింటాకు", "తూర్పువెళ్ళేరైలు", "సన్నాయిఅప్పన్న" మొదలైన సినిమాల్లోని పాటలన్నీ తెలుగునాట ప్రతిపేటా ప్రతిచోటా ప్రతినోటా మార్మోగుతూనే ఉన్నాయి. "రావికన్నా వాసిమిన్న"గా భావించే కృష్ణశాస్త్రి గారి సినీగీతాలు ఇతర సినీగీత రచయితల వాటితోపోలిస్తే సంఖ్యకి స్వల్పంగా కనపడినా సాహిత్యపు విలువలదృష్ట్యా అపూర్వము, అమూల్యము సార్వకాలికము, విశ్వజనీనమూ అయినవవడంలో విప్రతిపత్తిలేదు.

ఆయన సినీగేయాల్లో ప్రకృతి సౌందర్య వర్ణనాత్మకమైనవీ, లలితపరి హాసాత్మకమైనవీ, భక్తి మధురభక్తిభావనావిలసితమైనవీ, సంయోగశృంగార మాధుర్యోపేతమైనవీ. వియోగవేదనాభరితమైనవీ, విషాదాత్మకమైనవీ మానవత సామాజిక స్పృహలతోకూడుకున్నవీ, జాతీయభావనిర్భరమైనవీ గోచరిస్తాయి.

ప్రకృతి వర్ణనాత్మకమైనవి :- "మావి చిగురు తినగానె కోయిలకూసేనా, కోయిల గొంతు వినగానే మావి చిగురు తొడిగేనా[2]" అంటూ వసంతాగమ నాన్ని మనోజ్ఞంగా వర్ణించి ఆ వసంతర్తులోని ప్రకృతిని "పచ్చనితోటల విచ్చిన పూవులు, ఊగేగాలుల తూగేతీగలు, కొమ్మలమోగే కోయిల జంటలు,

---

1. "మేఘమాల" పాట మేఘమాల సంపుటి—పుట—617.
2, "సీతామాలక్ష్మి" చిత్రం.

జుమ్మనిమూగే తుమ్మెదగుంపులు[1]" అని హృద్యంగా వర్ణిస్తారు. ఆ అహ్లాదకరమైన ప్రకృతిలోని ఉదాత్తప్రణయం ఇలా సాక్షాత్కరిస్తుంది-"వొరిగింది చంద్రవంక వొయ్యారి తారవంక; విరజాజితీగనుంత జరిగింది మావి చెంత"[2] దీనిలో స్త్రీ-పురుషుల పరస్పరానురాగాన్ని కూడా రమ్యంగా ధ్వనింపచేస్తారు. "పొదలో కదిలే వెదురుగోలలు, గాలిఈలలు పిల్లనగ్రోవి పిలుపులా"గా, "కరగే వెన్నెల పాలతరగలో మరిగే నురుగులు" ఇసుక బయళ్ల మల్లెలశయ్యలుగానూ, చెదరేనిదుర యమున హృదయమున బెదిరే ఊర్పులు చెవిలో కొసరికొసరి గుసగుసగానూ[3] విన్పించి ప్రకృతిలోని శృంగారభావన భాసిస్తుంది కవికి. గగనసీమలో ఆడే అందమైన చందమామ తేలితేలిపాడే చల్లనైన పిల్లగాలి, జగమంతానిండిన వెన్నెలలూ[4] తనకోసమే ననిపిస్తాయి.

"వచ్చెనమ్మ సంక్రాంతి" అంటూ ఊగే జనపా చేలల్లో తూగే సెనగా పూలల్లో"[5] అంటూ గురివిందా పొదకిందా-గొరవంకాపలికే, గోరింట కొమ్మల్లో కోయిల్లుపలికే"[6] అని "తెల్లారిపోయి పల్లియలోని ప్రతియిల్లు కళ్ళు తెరిచి కడిపెడునీళ్ళు కళ్ళాపిచల్లి, కావెడుపసుపూ గడపకుపూసిన ముత్యాల ముగ్గులున్న ముంగిట ముగ్గుల్లో గొబ్బిళ్ళు! రతనాలముగ్గుల్లో! ముగ్గుల్లో గొబ్బిళ్ళు"[7] అంటూ కళకళలాడే పల్లెవాకిళ్ళనీ, "పాడిచ్చే గోవులహూ పసుపూకుంకం[8]" పనిచేసే జనవనికీ పత్రిపుష్పం, గాదుల్లో ధాన్యం!

1. "మల్లీశ్వరి" ,, మేఘమాల సంపుటి-పుట- 4
2. ఏకవీర ,, ,, ,, 114
3. మల్లీశ్వరి ,, ,, ,, 11 ;
4. నాయిల్లు ,, ,, ,, 18

5, 6, 7, 8—"ఉండమ్మబొట్టుపెడతా" చిత్రం—
మేఘమాల సంపుటి—పుటలు—
81, 82

క్షావిళ్ళాభాగ్యం! కష్టించే కాపులకూ-కలకాలం సౌఖ్యం" అంటూ గ్రామీణ పండుగ వాతావరణాన్ని వివర్ణిస్తారు.

లలితపరిహాసంతో కూడిన గేయాల్లో బావామరదళ్ళ హాస్యంతో కూడిన "కొమ్మ్మొరిగి రెమ్మ్మొరిగి జారినారాలినా అమ్మాయి నీమీద దూకేను, అబ్బాయి పట్టు రాలేను" అనేది ఒకటి. తన బొమ్మల్ని చెక్కమన్న మరదలిని డికిస్తూ "నా మల్లి బొమ్మలు చెక్కనే! పిల్లి బొమ్మలు చెక్కనే" అన్న బావకి తీసిపోకుండా "రాతిబొమ్మలు చేసేవా! కోతిబొమ్మలు చేసేవా-కొంగా బొమ్మల్లు చేసేవా" అంటూ "వేపాచెట్టు బోదీచుట్టూ వెర్రీబావను కట్టేరోయ్, వేపాబెత్తం పట్టేరోయ్, వీపూ పగలకొట్టేరు"[3] అంటూ ఆటలు పట్టిస్తుంది. కోతిబావకు పెళ్ళంట! కోవెలతోట విడిదంట!" అంటూ బావ పెళ్ళివేడుకల న్నిటినీ ఊహించి వర్ణిస్తూ "పల్లకినెక్కి కోతిబావ పళ్ళికిలిస్తాడు మా కోతి బావ పళ్ళికిలిస్తాడు"[4] అంటూ పరిహాసాలాడుతుంది.

"చిరునవ్వుదివ్వె ఏమన్నదే? అరమోడ్పుకన్ను ఏమన్నదే?"-"తన కన్నమ్మునెన్నె మగడున్నచోటికి మనసుపోయెనంటున్నదె" అనే సఖుల పాటల్లోనూ ఈ లలితపరిహాసమే ప్రతిబింబిస్తుంది.[5]

"ఏమి రామకథ శబరీశబరీ"[6] లవకుశకంఠంలో "విన్నారా జనులారా వీనులార శ్రీరామకథ" అనే, మిసమిసలాడే పసితిలేడికదా" అన్న హరి కథలోనూ, కరుణ రసాత్మకమైన రామచరిత్ర నాలపిస్తూ "చీకటివేళల నడి పించేదీ, ఒంటరి ఘడియల వినిపించేదీ, ఏదీ... ఏదీ... నీ చేయూత ఏదీ... ఏదీ... నీ పిలుపు" అంటూ రామభక్తిలో పరవశిస్తాడు కవి.

"కృష్ణా! గోవర్ధన గిరిధారీ! కృష్ణా! గోపీహృదయవిహారీ! కృష్ణా, బృందావనసంచారీ! కృష్ణా! సుందరమురళీధారీ! కృష్ణా" అంటూ కృష్ణలీలని

---

| | | | |
|---|---|---|---|
| 1, 2, 3, 4. | మల్లీశ్వరి | ,, | ,, |
| 5. | జగత్ జెట్టీలు | ,, | ,, 136, 137 |
| 6. | భక్తశబరి | ,, | ,, 74 |
| 7. | నాయిల్లు | ,, | ,, 22 |

షుతిస్తారు. "నేరుతునోలేదో ప్రభూ! నీ పాటలుపాడ!"[1] అంటూ "మువ్వల మురళిని, నవ్వే పెదవుల ముద్దాడేవాడే వన్నెలువాడు"[2] అంటూ మధుర భక్తిలోకి వెళ్ళిపోయి "నీలమోహన రారా" అంటూ "సారెకు దాగెదవేమీ! నీరూపము దాచిదాచి ఊరించుట కాస్వామీ? నీకన్నులతోడు! నీ కలికి కన్నులతోడు! నీకోసం ఎంత వేగిపోయానో కృష్ణా"[3] అంటూ తన కృష్ణ ప్రణయాన్నావిష్కరిస్తారు. "విందువా వీనులవిందుగా గోవిందు నాండాళ్ళ పరిణయమైనగాథ"[4] అంటూ మొల్లకథకి ఉపబలకంగా గోదాదేవి పరిణయ గాథనభివర్ణిస్తారు.

"భాగ్యరేఖ" చిత్రంలోని "నీవుండేదాకొండపై నా స్వామి నేనుండే దీనేలపై"[5] అనేగీతం బాహ్యంగా భక్తిని దీపిస్తూ ఉన్నతస్థితిలోనున్న ప్రియుడికి బీదరాలైన నాయిక అన్యాపదేశంగా తన ప్రణయాన్ని నివేదించు కోవడాన్ని ధ్వనిస్తుంది.

లలితశృంగారభావాన్ని చిత్రించడంలో కృష్ణశాస్త్రిగారినేర్పు అనన్యల సామాన్యమైనది. "మనసున మల్లెల మాలలుగేనే, కన్నుల వెన్నెలడోల లూగేనే" అంటూ ప్రణయభావనవల్ల పొందిన అనుభూతిని ఉదాత్తమధుర మనోహరంగా ఆవిష్కరిస్తారు.

"కొమ్మల గువ్వలు గుసగుసమనినా[6]
రెమ్మలగాలులు ఉసురుసురనినా
అలలుకొలనులో గలగలమనినా

---

| | | | | |
|---|---|---|---|---|
| 1. పూజాఫలం | ,, | ,, | ,, | 56 |
| 2. చెల్లెలికాపురం | ,, | ,, | ,, | 124, 125 |
| 3. చెల్లెలికాపురం | ,, | ,, | ,, | 122, 123 |
| 4. కథానాయకమొల్ల | ,, | ,, | ,, | 124, 125 |
| 5. భాగ్యరేఖ | | ,, | ,, | 49 |
| 6. మల్లీశ్వరి | | ,, | ,, | 14 |

దవ్వుల వేణువు సవ్వడి వినినా"[8] అంటూ నిరీక్షణా మాధుర్యాన్ని ప్రకటిస్తారు.

పచ్చని మధువనిలో-వలపులు విచ్చిన ఊయలా"[1] అంటూ లలిత శృంగారాన్ని వివర్ణిస్తారు. "నడిసేయకోగాలి నడిసేయబోకే! ఒడలిబడిలో రాజు పవ్వళించేనే! ఏటిగలగలలకే ఎగిరిపడిలేచేనే, ఆకుకదలికకే అదిరి చూసేనే, "నిదుర చెడిందంటే నేనూరుకోనే"[2] అంటూ ముగ్ధప్రణయానికి రూపకల్పన చేస్తారు.

"మలుపు మలుపుకడ నిలిచి చెవిలో, మంతనాలు ఊదాలి

కలసిమెలసి కలకాలమిలాగే మధురయాత్ర సాగాలి"[3] అంటూ సంయోగ శృంగారపరమావధిని సూచిస్తారు.

"చుక్కలతో చెప్పాలని! ఏమని!

ఇటుచూస్తే తప్పని! ఎందుకని?

ఇక్కడ ఏకాంతంలో ఏమో ఏమోననీ"[4] అంటూ సంయోగ వర్ణనలో కూడా మేరమీరని కృష్ణశాస్త్రిగారి ఔచిత్యపరిపాలనా దృక్పథమే ఆయన్ని చిత్రసాహిత్య జగత్తులో అత్యున్నతుడిగా నిలబెట్టింది.

జానపద ప్రణయభావాన్ని "గట్టుకాడ ఎవరో"[5] అనే బంగారుపంజరం లోని పాటలో వెల్లడిస్తారు.

---

| | | | | |
|---|---|---|---|---|
| 1. బంగారుపాప | చిత్రం—మేసుమాల సంపుటి—పుట—44 | | | |
| 2. రాజమకుటం | ,, | ,, | ,, | 71 |
| 3. భాగ్యరేఖ | ,, | ,, | ,, | 52 |
| 4. ఉండమ్మాబొట్టుపెడతా | ,, | ,, | ,, | 86 |
| 5. బంగారుపంజరం | ,, | ,, | ,, | 105 |

వియోగవ్యథనత్యుదాత్తంగా చిత్రిస్తారు తన రచనల్లో విరహ విషాద కవిగా ఖ్యాతికెక్కిన కృష్ణశాస్త్రి. "మల్లీశ్వరి"లోని "ఆకాశవీధి"లో[1] అన్న గీతంలో ఈ భావన పరాకోటినందుకుంది-"ఎన్నాళ్ళునాకళ్ళు దిగులుతో రేపగలు ఎదురుతెన్నులు మాచెనే-బావకై చెదరికాయలుకాచెనే, "కళ్ళుతెరిచిన గాని, కళ్ళుమూసినగాని మల్లిరూపే నిలిచెనే-నాచెంత మలిమాటే పిలిచెనే" అంటూవిరహవ్యథతీవ్రదశని ప్రకటిస్తారు. "కురియునాకన్నీరు గుండెలో దాచుకుని వానజల్లుగ కురిసిపోవా! కన్నీరు ఆనవాలుగ బావ ముందోల" అంటూ ప్రకృతిని పాత్రలతో సహవేదనని పొందినట్లుగా వర్ణిస్తారు. మేఘమాలని మమతలెరిగిన మేఘమాలగా మనసు తెలిసిన మేఘమాలగా, జాలి గుండెల మేఘమాలగా సంబోధించడం పైభావాన్నే బలపరుస్తుంది.

ప్రేమపై ఫల్యానికి కలిగిన దుర్భరవేదనని బంగారక్క చిత్రంలోని "ఘూరాన, ఘూరాన తారాదీపం", మాయనిమమత చిత్రంలోని "రానిక నీకోసం సఖీ రాదిక వసంతమాసం" అన్న పాటలు ప్రతిబింబిస్తాయి. "ఆరనీకుమా యీదీపం కార్తికదీపం", గోరింటాకు చిత్రంలోని గోరింట "పూచింది" అనే పాట, సుఖదుఃఖాలు లోని "ఇది మల్లెలవేళయనీ" అనేగీతం ఇతివృత్తాంశాన్ని ధ్వనింపచేస్తూ విషాదభావనతో శ్రోతలని కరుణరస సార్ద్రహృదయులని చేస్తాయి. కథావస్తువుని ధ్వనింపచేస్తూ (dramatic irony) కథాగతికి దోహద మయ్యేటట్టుగా గీతాల్ని మలచడంలో ఆయన సిద్ధహస్తులు అనే విషయాన్ని నిరూపిస్తాయి ఈ క్రింది చరణాలు:-

"ఇది మల్లెల వేళయనీ

ఇది వెన్నెల మాసమనీ" — పదాల తారుమారు (మల్లెల మాసం వెన్నెలవేళ) నాయిక జీవితం విపర్యయమవడాన్నీ,

---

1. మల్లీశ్వరి ,, ,, ,, 00
2. సుఖదుఃఖాలు చిత్రం మేఘమాల సంపుటి పుట 172

"పదనీయరాదమ్మా పాపాయిమీద
పాపిష్టికళ్ళూ కోపిష్టికళ్ళూ[1]" —ఆ చిట్టిపాప జీవితం కోపిష్టి తండ్రి కారణంగా అకాల మృత్యువాతపడడం,

"మరచిపోకుమా తోటమాలీ
పొరబడియైనా మతిమాలి[2]" — నాయికాస్మృతిని నాయకుడు కోల్పోవడం, వీటిల్లో నాటకీయధ్వనిగా కూర్చబడ్డాయి.

మల్లీశ్వరిలోని "పోయిరావేతల్లి," సుఖదుఃఖాలలోని "మేడంటే మేడాకాదు" అన్న పాటలు కరుణాగర్భితంగా వాత్సల్యభావాన్ని వెల్లడిస్తాయి.

కాలనదిని కదలునావ తేరి, ఏమో ఎటకో, ఎవరో
వేలువేలు స్త్రీపురుషులు వెడలిపోదురెవరెవరో
అన్నదమ్ములున్నవారు ఆప్తులు నాయన్నవారు
అవలిరేవు అందగానే ఎవరికెవరో ఏమౌదురో[3] అనేదీ,

"కళ్ళుగలవేళనే ఒళ్ళు మరవకురా, యౌవనము తీగవలె అలసి తూలేనురా, పూవువలె వైభవమునాలసి రాలేనురా "తెల్లవారికమునుపె తెలిసికోరా" అనేదీ, "జరిగిందీ జరగనున్నదీ పరికించిపాలించేదీ ఉడికించి నిన్నూ నన్నూ బొమ్మల్లా ఆడించేదీ కరుణించేదొకరేఒకరు, తెరవెనుక దాగి దొరకరు"[4] అనేవి మార్మికతా ఛాయలో (తాత్త్విక) వేదాంతాన్ని బోధించేవి.

"మమతలన్ని చంపుకో! ప్రేమ, కరుణ, స్నేహం మదినింపుకో
సకల బంధముల తెంపిన జగమంతా బంధువులే, ప్రతి వాకిలి,
ప్రతి హృదయం ఎదురుచూచు నీకొరకు[5]" అంటూ నీతినీ
"ఇల్లూ వాకిలి ఒళ్ళూ మనసూ ఈశుని కొలువనిపించాలి ఎల్లవేళలా మంచు కడిగిన మల్లెపూవులా ఉంచాలి"[6] అంటూ ఉపదేశాన్ని చేస్తారు.

---

| | | | |
|---|---|---|---|
| 1. గోరింటాకు | ,, | ,, | 172 |
| 2. చీకటివెలుగులు | చిత్రం | ,, | 76 |
| 3. రక్తకన్నీరు | ,, | ,, | 42 |
| 4. బంగారుపాప | ,, | ,, | 24 |
| 5. నాయిల్లు | ,, | ,, | 68 |
| 6. ఉండమ్మా బొట్టుపెడతా | | ,, | 87 |

"ఇంటగల అబలల కంటగించేరు, దాసియని బానిసని గాసిపెట్టేరు... నోరుగల పురుషుల ధర్మమిదేమో పేరుగల పెద్దవారి న్యాయమేమో"[1]నంటూ స్త్రీదాస్య నిరసనని చేస్తారు. ఆమె వేదనపట్ల కరుణని చూపిస్తారు. "పూజలిడరా తల్లి పాదములపై పూవువలె చూడరా నీపాలతిమిన్న ఆడది లోకానికెల్ల ఆదివేలుపే"[2] అని స్త్రీజనాభ్యుదయాన్ని కాంక్షిస్తారు.

"ఇదిగో స్వర్గద్వారం" అనే పాటలో సమాజకౌటిల్యా నిరసనని తెలియజేస్తూ "పోరాపోరా నీకాస్వర్గం క్రూర స్వార్థపిశాచీ

పేదలసాదల రక్తం పీల్చినదేవేషివి, రాకాసీ!"[3] అంటారు "నిరుపేదపై ప్రేమపాపమా - క్రూరనరలోకమున కింతకోపమా"[4] అంటూ వర్గభేదాలని నిరసిస్తారు. కార్మికులం మేమే కర్షకులం మేమే"[5]నంటూ శ్రామికులతో కంఠాన్ని కలుపుతారు. ఇలా కృష్ణశాస్త్రిగారిలోని సామాజికస్పృహ అభివ్యక్తమవుతుంది.

"నిండాలి అనురాగము మనలో ఉండిన సహకారము, మన భాగ్యాలు పండాలి, అన్యోన్యముండాలి"[5] అన్న పాదాల్లోనూ, అంటరానితనము ఒంటరితనము, అనాదిగా మీజాతికి అదే మూలధనము, ఇక సమభావం సమధర్మం, సహజీవన మనివార్యం, తెలుసుకోనుట మీధర్మం, తెలియకుంటె మీ కర్మం"[6] అన్న పాదాల్లోనూ అభ్యుదయభావన వ్యక్తమవుతుంది. ఇందులో ఉపమానవైచిత్రి భావస్ఫోరకతా స్పష్టమవుతాయి.

"మనిషైతే మనసుంటే కనులు కరగాలిరా

---

| | | | |
|---|---|---|---|
| 1. రక్తకన్నీరు | ,, | ,, | 67 |
| 2. ఆకలి | ,, | ,, | 67 |
| 3. ఆకలి | ,, | ,, | 32 |
| 4. తండ్రి | ,, | ,, | 37 |
| 5. రాజగురువు | ,, | ,, | 54 |
| 6 మంచిరోజులు వచ్చాయి | ,, | ,, | 152 |

కరిగి కరుణ కురియాలిరా, కురిసి జగతి నిండాలిరా"[1] గీతంలోతక "అడుగడుగున-గుడి ఉంది"[2] అన్న పాటలోనూ కవి మానవతావాదం ద్యోతమవుతుంది. "అంతాపెద్దలే"[3] అన్నగీతం సమాజంపైని విమర్శని కలిగినది

"అందాల మనదేశం, అందచందాల మనదేశం పెంపొందాలి కలకాలం -[4] అని జాతీయాభిమానాన్ని (దేశభక్తిని) వ్యక్తం చేస్తాడుకవి మాతృభాషా మాధుర్యానికి పరవశించి "పాడనా తెలుగుపాట! మంచిముత్యాల పేట మధురామృతాలతేట" అని ఆలపిస్తాడు. తెలుగునాడుయొక్క వైశిష్ట్యాన్ని ప్రాభవాన్ని వర్ణిస్తూ "త్యాగయక్షేత్రయ రామదాసులూ తనివితీర వినిపించేది

నాడునాడులా కదిలించేదీ. వాడవాడలా వినిపించేదీ

చక్కెరమాట మూట........"ఒళ్ళంత ఒయ్యారికోక, కళ్ళకి కాటుకరేక మెళ్ళొతాళి-కాళ్ళకు పారాణిమెరిసేనుదట కుంకుమబొట్టు[5] అంటూ. తెలుగువారి వేషభాషలనీ మనోహరంగా వర్ణిస్తారు.

"ఊగే గాలులు, తూగే తీగలు, గువ్వల గుసగుసలు, వెన్నెల దోలలు మల్లెల మాలలు మొదలైన సుకుమార పదాల కూర్పులతో, పగలు లేని రేయి వోలె పలుక లేని రాయివోలె" అను ప్రాస ఘటిత భావ నిర్భరతతో కూడిన ఉపమానాలతో వైలక్షణ్యమాధుర్యాలని కలిగిన కృష్ణశాస్త్రి పాటలని ఇట్టేపట్టి చూపగలం.

---

2. అమాయకుడు " — " — 94
3. ఉండమ్మా బొట్టుపెడయ " — " — 88
4. రాజగురువు " — " —54,55
5. ఆమెరికా అమ్మాయి. " 'పాడనా తెలుగుపాట

<u>అనువాద రచనా వైశిష్ట్యం :-</u> తిరుప్పావు, ఋగ్వేధుల పరిశీలన :-

సామాన్యంగా సాహిత్యానువాదాలు భావానువాదాలవుతాయి మూలం లోని భావాన్ని మాత్రమే స్వేచ్ఛగా అనువాద భాషలోకి తేవడం ఇది ఒక అసిధారావ్రతం లాంటిది. దీనికి అనువాద కర్తకి ఉభయ భాషా పరిజ్ఞానం, మూలభావ సంపూర్ణావగాహనమూ, అనువాద కుశలతా ఉండాలి. అనువాదం అనువాదకుడి అనుభవజ్ఞతకీ, అనువాద రచనా నైపుణికీ గీటురాయి. కనుకనే అనువాదమొక శాస్త్రం అనువాదించడమొక కళ" అంటారు. ఈ కళలో కూడా కృష్ణశాస్త్రిగారు నిష్ణాతలు అనే విషయాన్ని ఆయన అనువాద రచనలు స్పష్టపరుస్తాయి. ఆయన అనువాద రచనలలో ప్రధానమైనవిగా పరిగణించ బడే, తిరుప్పావు, ఋగ్వేఘలలో ఆయన అనువావ రచనా వైదగ్ధ్యం ప్రస్ఫుట మవుతుంధి.

"అకలంకమైన మనస్సుతో అపాయంగా చేసిన తిరుప్పావు అనువాదం కొన్నిచోట్ల క్లుప్తీకరణలు, కొన్ని వ్యాఖ్యానించునట్లున్న విపులీకరణలు కొన్ని భావాల పునరావృత్తులు అక్కడక్కడా జరిగినా మొత్తంమీద తెనుగు సేత మూలానుగుణంగానూ మనోహరంగానూ సాగిందనే చెప్పవచ్చు. కృష్ణ శాస్త్రిగారి సహజ కావ్య రననాశైలి ఇందులోనూ సువిదితమవుతుంది. పలుకు నుడికారపు సొంపులు, మనోజ్ఞమైన పదాల కూర్పులు, లలిత సుందరమైన భావాల పేర్పు ఆయన రచనని ఇట్టేపసిగట్టేటట్టు చేస్తాయి. అదేలక్షణం ఇందు లోనూ సర్వేసర్వత్రా భాసిస్తుంది.

మూల భావాలని చాల వరకు విభక్తి అన్వయాలలో మాత్రం కొన్ని మార్పులను చేసి అనువదించారు. మామూలుగా పాశురం మధ్యలో నున్న సంబోధనలని అనువాదంలో మొదటి చరణంగా లయాను గుణంగా ఉంచడం జరిగింది. చరణాల వరసని కూడా అనువాదంలో మార్చడం కడపడుతుంది కొన్నింటిలో. కొన్ని చోట్ల తెలుగు సేతకీ మూలానికీ భేదం కనిపిస్తుంది, మూలాన్ని అతిశయించిన భావలాలిత్యం కూడా కొన్నింటిలో కనిపిస్తుంది. మూలంలో ఏరార్న్దకణ్ణి - "సౌందర్య పూర్ణమగు నేత్రములు గల" అన్న దాన్ని విపులీకరించి "మరిమరీ కనికనీ మెరసేటి కనులతో మురిసే యశోదమ్మ"గా అనువదించ బడింది. క్లుప్తీకరించినవీకొన్ని ఉన్నాయి. తమిళం

లోని 5వ పాశురంలో "ప్రాచీన పాపములు, అగామి పాపములు," అనతి దాన్ని ఎప్పుడో చేసిన పాములు"గా మలచడమయింది. నాల్గవ పాశురంలోని "శార్ఙముదైత్త శరమణ ఆపోల్" శారంగము కురిపెడు బాణ వర్షము వం "అవిలంబముగ కురియుము" అన్న మూల భావానికి "శారంగ మల్లు అంప జడులు చిమ్మి కురియుము" అన్న ఆంధ్రీ కరణ శిష్టపదంలో మూలాతి శాయియైన సౌందర్యాన్ని కలిగించింది.

"కలువ కనుమూసినది కమలమ్మ పూచినది", ఇరవయ్యవ పాశురం లోని నవకిసలయాధరా, కలశోపమ పయోధరా" మొదలైన ఆనుప్రాసపు సొంపుల్నీ "మేను సారించి పూళి తూలించి" (23వ గీతం) "ఓ చిరుతిరా చిలుక" (15వ గీతం) భావలాలిత్యాన్నీ, "లలితశయనా చలిత హరిణన యనా" (13వ గీతం) పదలాలిత్యాన్నీ, అమ్మ చెల్ల (14) "వంగనాచి తనము" (15) మొదలైన తెలుగు నుడికారాలనీ ఇంపొందించుకుని సహజ రచనగా శోభిస్తోంది. ఇరవైపాశురంలోని "తెన్నిలంగై" (దక్షిణ లంకను) "సుందర లంకా ద్వీపంగా" వ్రాయడమంత సముచితంగా లేదు. లంకా ద్వీపాన్ని వినాశన మొనర్చిన పరమాత్మ నిస్తుతిస్తూ ఈవిశేషణాన్ని వాడితే సౌందర్య విధ్వంసకుడన్న అవాంఛనీయార్థ స్ఫూర్తి వస్తుంది. దీనికి కారణం మువ్వాయి రప్పడి వాఖ్యానంలో "తేన్" కి సుందరమైన అన్న అర్థమివ్వడం కావచ్చు. అలాగే 22వ పాశురంలోని కృష్ణుడి పరమేశ్వరత్వాన్ని తెలిపే "చంద్ర సూర్యులతో" నేత్రాల పోలికని అనువాదంలో నివ్వడం జరిగింది. ఇలా ఒకటి రెండు లోటు పాట్లున్నా అనువాదం చాలా ప్రశంస నీయంగా సాగి ఆత్మాశ్రయత్వం దీపిస్తోంది.

ఋగ్వేధి అనువాదం తమ గురుదేవుల మూల హృదయాన్నెరిగి గావిం చినది. బ్రహ్మమత సిద్ధాంతాలనీ, సూత్రాలనీ తెలిపే ఈ రచనని మూల విధేయంగానె తెనిగించారు. — "The whole world rests in His play, yet still the player remains unknow"

అన్న సూక్తిని "ఆ మహానంద ఖేలనమంద విశ్వ
మంతయును సుస్థిరత నిల్చునైన నించు
కంతయును గాని యెఱుగరాడాట గాడ
టంచున మృతాల యూట బ్రహ్మర్షిమాట" అంటూ

యథా మూలకంగా సాగింది. ఇలా సరళ సుందరంగా మూల భావాన్ని ప్రతిఫలిస్తూ అన్యూనాతిరిక్తంగా సాగుతుంది ఆయన అనువాదరీతి.



# కృష్ణశాస్త్రిపై ఇతరుల ప్రభావం; ఇతరులపై కృష్ణశాస్త్రి ప్రభావం

## కృష్ణశాస్త్రిగారి మీద ప్రాక్పశ్చిమ సాహిత్య స్రష్టద్రష్టల ప్రభావం

పాశ్చాత్య కవుల విమర్శకుల ప్రభావం మన తెలుగు భావకవులపైన, వారి కవిత్వంపైన విస్తృతంగా ప్రసరించగా రవీంద్రుడి భావనాదృక్పథమూ కవితారీతులు జాతీయ ముద్రను చేకూర్చాయి. పైన పేర్కొన్నవారి ప్రభావమేకాక కృష్ణశాస్త్రిగారిపైన ఆయనకు పూర్వులు, సమకాలీనులైన కవుల ప్రభావంకూడా ఆయన రచనలలో ఎడనెడాదృగ్గోచరమవుతుంది. ఆయా కవుల రచనలకీ ఆయన రచనలకీ ఉన్నభావ సామ్యసంవాదాలని కొద్దిగా సూచిస్తున్నాను.

వర్డ్సువర్తు, కాల్రిడ్జి, బ్లేక్‌లు ఆంగ్లకాల్పనిక కవులలో మొదటి దశకి చెందినవారుగానూ, షెల్లీబైరన్, కీట్సు ప్రభృతులు రెండవదశకి చెందినవారుగానూ పరిగణించబడుతున్నారు. వీరందరి ప్రభావమూ కృష్ణశాస్త్రిగారి మీద పడిందనడానికి ఉపబలకమవుతున్నాయి. కవిపండిత విమర్శకులైన కీ॥ శే॥ విశ్వనాథ సత్యనారాయణగారి ఈ క్రింది వాక్యాలు.

"మనకు కీట్సు, షెల్లీ, వర్డ్సువర్తుల వంటి కవులులేరు. ఆ కవులు మన దేశములో శ్రీ కృష్ణశాస్త్రిగారుగా ఆవిర్భవించారని నా అభిప్రాయము[1]". దీనిలోని నిజానిజాల్ని తులనాత్మకంగా పరిశీలిద్దాము.

---

1. కృష్ణశాస్త్రి కవిత్వ స్వర్ణోత్సవ సంచిక — పుట — 16

వర్డ్స్‌వర్తులాగే కృష్ణశాస్త్రిగారూ ప్రకృతి సౌందర్యాన్ని చూడడంతో కలిగిన ఆనందోద్వేగంతో "ఆకులో ఆకునై" అనే గేయాన్నాలపించారు. వర్డ్స్‌వర్త్ ప్రకృతిని తన "డాఫొడైల్స్" కుకూ మొదలైన కవితల్లో వ్యక్త పరుస్తే కృష్ణశాస్త్రిగారు "విరిచేడె", సంధ్యాసమీరణా అనే ఖండికల్లో ప్రకృతి ప్రీతి నభివ్యక్తీకరిస్తారు.

"Fluttering and dancing in the breeze"
Tossing their heads in sprightly dance[1] అంటూ జడ ప్రకృతికి చేతనయ్యాన్ని ఆరోపించినట్టే కృష్ణశాస్త్రిగారు తమ 'విరిచేడె'కి "చిన్నారి సిగ్గును" కలిగిస్తారు. చక్కిలిగింతను పెట్టారు, పులకించచేస్తారు.

"చుక్కలన్నియు సొక్కి సోలెను, గిరులు కదలెను కదలిపాడెను" అంటూ అచలాలకి చలనత్వాన్నాపాదిస్తారు. మనోహరమైనగాన మాధుర్యంలో విషాదం స్ఫురిస్తుందన్న భావాన్నిద్దరూ వ్యక్తంచేస్తారు.[2] వర్డ్స్‌వర్త్ ప్రకృతి పరంగా చెప్పిన The world is too much with us - late and soon getting and spending" అన్న భావాన్ని కృష్ణశాస్త్రి "దివ్య భాగ్యము" అన్న ఖండికలో "సాంధ్యసువర్ణితచ్ఛాయలరసి, తారకాశోభితాంబర తలము గాంచి చింతలను బాయుదము చేయిచేయి కలిపి" అంటూ ప్రణయ పరంగా అన్వయిస్తూ బాధామయ జీవితానికి ప్రకృతిమాత చల్లని ఒడిలోనే శాంతి లభించేదని ప్రతిపాదిస్తాడు. ప్రకృతి సౌందర్య సంపదముందు మిగిలిన సంపదలన్నీ అల్పమైనవంటారు[3]. "టింటర్న్ ఎబ్బీ లెన్స్," ది ఇమ్మోర్టాలిటీ ఓడ్ వంటి కావ్యాలు వర్డ్స్‌వర్తులోని తాత్త్విక దృక్పథాన్ని ప్రతిఫలించినట్టే కృష్ణశాస్త్రిగారి ఆధ్యాత్మిక దృష్టినిఛనుర్దాసు నాటికా సంపుటి, "మహతీ కీర్తనలు" "నిగమశర్మ" మొదలైన ఖండికలు మొదలైనవి ప్రతిపించిస్తాయి.

---

1. Wordswoth — Daffodils
2. మహాకవి — కృష్ణపక్ష సంపుటి పుట 27
2. In that sweet mood when pleasant thoughts bring sad thought to the Mind — Wordsworth; "అమల మోహనసంగీత మందు హృదయ దళన దారుణ రోదన ధ్వనుల విందు" కృ. శా.
3. దివ్యభాగము — కృ. ప. సంపుటి — పుట - 31

సాహిత్యస్రష్ట ద్రష్టకూడా అయిన మరో ఆంగ్లకాల్పనిక కవి కొల్రిడ్జి ప్రభావం కృష్ణశాస్త్రి మీద కనపడుతుంది. కొల్రిడ్జి "లిటరేరియా బయోగ్రాఫియా" అనే గ్రంథాన్ని ఆంగ్లకాల్పనిక కవితకి లక్షణ గ్రంథంగా రచిస్తే కృష్ణశాస్త్రి వ్రాసిన ఏకాంతసేవ పీఠిక, పాతికేళ్ళ తెలుగు కవిత్వం, శ్యామ పర్ణిఘామిక తెలుగు భావకవిత్వ లక్షణాలని వివరిస్తూ ఆయన సాహిత్యదార్శని కతని ప్రకటిస్తాయి.

Flowers are lovely, Love is flower like
Friendship is a sheltering tree-
O : the joys, that came down shower like of
Friendship, Love and Liberty Ere I was old'' అన్న కొల్రిడ్జి కవితలోని స్వేచ్ఛ, స్నేహప్రేమారాధనా తత్త్వాలని కృష్ణశాస్త్రి ఆరాధించి నంతగా ఇతర భావకవులెవరూ ఆరాధించలేదేమో ! ఆయన వివిధ రచనలలో ఇవి బహుధా చోచరిస్తూనే ఉంటాయి. కొల్రిడ్జి కృష్ణశాస్త్రి ఇద్దరి కవితల్లోనూ ఆత్మవేదన కవిత్వ రూపంలో సాక్షాత్కరిస్తుంది. ''Life is but thought So think I will That youth and I are house mates still'' అని నిత్యయవ్వనాన్ని కొల్రిడ్జి వాంఛించినట్టే కృష్ణశాస్త్రిగారూ "జరలేనివా యవ్వనమ్మనిమ్ము" అనీ "శితవేళరానీయకు శిశిరానికి చోటీయకు" అంటారు.

మార్మిక కవిత్వరచనకి ప్రసిద్ధికెక్కిన - బ్లేక్ మార్మిక కవితా సౌంద ర్యంపట్ల ముగ్ధులై „రీడ్స్ ఆఫ్ ఇన్నోసెన్స్" అన్న గీతానుసరణగా వెఱ్ఱి పాట అనే ఖండికను రచించారు. అతనిపాట అన్న ఖండిక కూడా మార్మిక కవితాఛాయతో కూడినదే. కృష్ణశాస్త్రిగారి రిక్షావాలా, బూట్‌పాలిష్ వంటి రచనల్లో కనిపించే మానవతావాదం.

''For mercy has a human heart
Pity, a human face,
And love the human form devine
And peace the human dress'' అన్న బ్లేక్ రచనలోని మానవ తాదృక్పథాన్ని సంతరించుకున్నది.

వ్యంగ్య విమర్శనాత్మక కవితలను రచించడంలో ప్రసిద్ధుడూ సిద్ధ హస్తుడైన లార్డ్‌బైరన్ లాగానే కృష్ణశాస్త్రికూడా పల్లకి సంపుటతోని తుషా

రాత్రి నిద్ర, అప్పుడుకాని అరుణోదయంకాదు "అయ్యో మనిషీ" మొదలైన విమర్శనాత్మకమైన రచనలను చేసారు. ప్రాచీన సంప్రదాయాలలోని మూఢ విశ్వాసాలు మొదలైన వాటిని సునిశితంగా విమర్శించి సమాజంలో నూత్న చైతన్యోద్దీపనకి అవి తోడ్పడేటట్టు రచించిన రచనలకోవకి చెందిన వాటిలో "బహుకాల దర్శనం" వంటి వచన రచనలు కూడా ఉన్నాయి.

సమకాలీన విమర్శకులచేత తీవ్ర విమర్శకు కీట్సుగురి అయినట్టే కృష్ణశాస్త్రిగారు అక్కిరాజు ఉమాకాన్తం, అనంత పంతుల రామలింగస్వామి మొదలైనవారి నిశిత విమర్శావహేళనలకి గురయ్యారు. కర్కశ విమర్శల వల్లా, ప్రణయ వైఫల్యంవల్లా క్రుంగిపోయిన కీట్సురచనల్లో బహుధా నిరాశా నిస్పృహ విషాదాలు గోచరిస్తాయి. వీటన్నిటివల్లా ఆంగ్లకాల్పనిక కవులలో 'రొమాంటిక్ మెలాంకలీ'కి (కాల్పనిక విషాదం) ఆచార్యకత్వాన్ని వహిస్తున్నాడు కీట్సు. కృష్ణశాస్త్రిగారి కృపక్షంలోని రచనల్లో అంతటా ఒక విషాద చ్ఛాయ పఱచుకునుండి అదే ఆకవిత్వానికి జీవాతువుగా ఉంటుంది. 'ఎన్నెన్ని నిశ్వాసములు,' "మనసారగ ఏడ్వనీరు నన్ను" మొదలైనవి ఇటువంటివి. గత కాలంలోని ఔన్నత్యాన్ని స్మరించుకుని "Glory and loveliness have passed away" అని కీట్సు నిశ్వసించినట్టే కృష్ణశాస్త్రి కృష్ణదేవ రాయలవంటి సార్వభౌములచేత కవులు పొందిన ఆదరసత్కారాలని నెమరేసుకుని "అప్పుడు పుట్టిఉంటే" అనుకుని నిట్టూర్పులు నిగిడిస్తాడు.

"నా కఠిన పాదశిలలకింద బడి నలిగిపోయె నెన్నెన్నియో మల్లెపూలు మున్ను" అన్న కృష్ణశాస్త్రి మాటల్లో "I can't see what flowers are at my feet" అన్న కీట్సు భావనే ప్రతిధ్వనిస్తుంది.

"Away away for I will fly to the

........................ ....................................

But on the viewless wings of poesy" అన్న కీట్సు భావన కృష్ణశాస్త్రిగారి "కల విహంగమ పక్షముల తేలియాడి తారకామణులలో దారనై మెఱసి" అన్నపాదాలలోనూ, "ఓయి సంధ్యా సమీరణా" అన్న ఖండిక లోనూసాక్షాత్కరిస్తుంది. సౌందర్య నైరాశ్యాలు రెండు ఒకేచోట నివసిస్తాయనే కీట్సు విశ్వాసమే కృష్ణశాస్త్రి కవితల్లోనూ భాసిస్తుంది. కీట్సు రచనల్లోని

''Sweet unrest''-"వేదనా సుఖము" గానూ, ''heart aches''"హృదయ వేదనగానూ, "To breth a prayer'' - "ఏ శుభానిలము నిట్టూర్చెనో" గానూ రూపొందాయి. Beauty is truth, truth is beauty అనే కీట్సు సౌందర్యా సౌందర్య ప్రియత్వంలోనూ వ్యక్తమవుతుంది.

మరణవేదనా సాంప్రదాయానికి ఆచార్య స్థానీయుడైన షెల్లీ "డెత్" మొదలైన కవితల్లోని మరణవాంఛ "ఏను మరణించుచున్నాడు అన్న కృష్ణ శాస్త్రిగారి కవితలో కనిపిస్తుంది.

రాత్రిని ఒక సుందరిగా, చీకటిని ఆమె కురులుగా భావించిన షెల్లీ "నైట్ (Night) అన్న కవితను కృష్ణశాస్త్రిగారి "నిశాలోచనము" అన్న ఖండికల్లోని"రేలతాంగి", అమావాస్యా తమస్వినీ.........నీర్ధీర్ఘ ధమ్మిల్ల నీలపల్లిఛాయ.........శర్వరీ సతీః" అన్న పాదాలు ప్రతిఫలిస్తాయి. షెల్లీ కవితల్లోని అలౌకిక విషయాలకి లౌకికరూపకల్పనా విధానం కృష్ణశాస్త్రిగారి కవితల్లోనూ మనకు ద్యోతకమవుతుంది. ఆయన "ఊర్వశి" షెల్లీ "ప్రొమెత్యువన్ అన్ బౌండ్"లోని "ప్రొమెతియ"లాగే అమూర్త విషయాలకి మూర్తికల్పన.[1]

లౌకిక ప్రేమ తత్త్వాన్ని ప్రకృతి ప్రకటించే విధానాన్ని షెల్లీ 'Love's Philosophy'[2] అన్న కవితలో వ్యక్తీకరిస్తే కృష్ణశాస్త్రిగారు దాన్ని "సౌరభములేల జిమ్ము పుష్ప వ్రజంబు, చంద్రికలనేల వెదజల్లు చందమామ" అన్న ఖండికలో ప్రతిఫలాపేక్షలేని అనంత ప్రేమ తత్త్వంగా మలిచారు.

---

1.

2 ''The Fountains muingle with the river and the rivers with the Ocean t he winds of Heaven mix for even with a sweet emotion Nothing in the world is single all things by a law devine in one spirit meet and mingle why not I with I Time ? — Shelly.

"Torture and solitudes,
Scorn and despair
These are mine empire" అనే షెల్లీ కవితలోని భావం.

"The fnuntains mrngle with the river
And the rivers with the Ocean
The winds of Heaven mixe for ever
Wiit a sweet emotion
Nothing in the world is single
All things by a law devine
In one spirit meet and mingle
Why not I with thine ?" — Shelly

కృష్ణశాస్త్రిగారి "నాకు నిశ్వాస తాళ వృంతాలు కలవు
నాకు గన్నీటి సరుల దొంతరలు కలవు
నాకమూలగమపూర్వ మానంద మొసగు
నిరుపమనితాంత దుఃఖంపు నిధులు కలవు" అనే కవిత
భావంతో సంవదిస్తుంది.

షెల్లీ "అలాస్టర్" (Aloster) వంటి మాతృదేశభక్తి ప్రపూర్ణమైన కవితలతో కృష్ణశాస్త్రి "జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ" మొదలైన గీతాలు సరిపోల్చదగినవి.

"The earth was no longer hall
Love, Freedom, health had given
Their ripeness to the manhood of its prime" అన్న షెల్లీ
కవితలోని ఆశావాదం, భవిష్యద్దర్శనం కృష్ణశాస్త్రిగారి "ముందున్నది ముందున్నది. ముందున్నది కృతమహాయుగం మరి ముందే యువ మహాయుగం అన్న గీతంలోని "ముందుగలదు మనజాతికి ముక్తి. అమరజీవరక్తి" అన్న పాదాల్లో ధ్వనిస్తుంది. "A lighting in a cloud" అన్నది ప్రళయకాల మహోగ్ర భయద జీమూతోరు గళఘోర గంభీర ఫెళఫెళార్భటులలో మెరుపేలాగా రూపొందింది.

ఎన్నో పదబంధాల నిర్మాణంలో కూడా ఈ ఇద్దరికీ సామ్యంగోచరిస్తుంది షెల్లీ ప్రభావాన్ని ప్రస్ఫుటం చేస్తుంది కృష్ణశాస్త్రిపైన.

| షెల్లీ | కృష్ణశాస్త్రి |
|---|---|
| Sweet awe | వేదనసుఖము |
| Speech less love | మూగప్రేమ |
| Murmurs of the air, wind whispers | గాలిగుసగుసలు |
| Solemn Song | విరహగీతిక |
| King of Sadness | శోకశ్రీకంతిమిరలోకైకపతి (శోకసామ్రాట్టు) |
| Crown of Pain | వేదనకిరీటము |
| Make me they lyre | నన్ను వేణువుగనూదు |

ఇంతటి సామ్యముంది కాబట్టే విశ్వనాథ, శ్రీ శ్రీ వంటి కవిపండితుల చేత ఆంధ్రా షెల్లీగా కీర్తించబడ్డారు కృష్ణశాస్త్రి.

పాశ్చాత్య సాహిత్యద్రష్టలలో 'మల్లార్మే', 'బెనెడెట్టొక్రోచే' లతోటి భావసంవాదమున్నట్టు స్పష్టమవుతుంది. ఆయన వివిధ రచనలని విశ్లేషించడం వల్ల ఫ్రెంచి రచయిత మల్లార్మే "అసలు వచనమనేదే లేదంటూ రచయిత ఒక రీతి కోసం యత్నించినప్పుడల్లా అతని వచనానికి ఒక ఊపూలయూవచ్చి పద్యానికది దగ్గరవుతుంది అన్న మాటల్ని 'శ్యామసర్జి' భూమికలో ఉదహరిస్తు భావకవితాలక్షణాలను వివరిస్తారు కృష్ణశాస్త్రి. ఈ భావానికనుగుణమైన కృష్ణ శాస్త్రిగారి వచనరచనలు మనకు ఎన్నోలభిస్తాయి.

కవిత్వం సౌందర్యాత్మకం కావాలన్న ఆదర్శాన్ని, సృజనాత్మక, కాల్పనిక వాదాన్నీ ''Aesthetic Science of expression and general Liguist_ ies''. ''Essence of Aestheties'' అన్న గ్రంథాలరచనద్వారా ప్రచారానికి పూనుకున్న 20వ శతాబ్దపు ప్రఖ్యాత సాహిత్యవిమర్శకుడు బెనెడెట్టోక్రోచె భావాలతో సంవదిస్తాయి కృష్ణశాస్త్రిగారి భావాలు.

ప్రకృతి మానవుడి ఆత్మకీ దాని అనుభూతులకీ సంబంధించినదనీ, అందువలే దానికీ ఆధ్యాత్మికమైన కళాసృష్టికీ సంబంధమున్నదన్న 'క్రోచె'

భావనని "ఈ లోకం, ఈ సృష్టి అంతాకలసి అత్యద్భుతమైన 'లిరిక్' ప్రకృతి లోని, సృష్టిలోని నక్షత్రములు అన్యోన్యవిరుద్ధాలుగా ప్రహస్వదృక్కులకు కనబడిన నిజానికికావు. ప్రకృతీ మానవుడు విరోధులు కారు. అంతా ఒక దివ్యానందంలో నుంచే పుట్టిపెరిగి కలిసి పోతున్నాయి" అన్న మాటలు వ్యక్తం చేస్తున్నాయి.

"In every word of the poet in every act of his creative magination appears the whole of human destiny, all the hopese llusions, sorrows and joys the grandeur and misery, of the human state"2 అన్న క్రోచే మాటల్లోని భావం "కవి నొక విభమగు నుద్రేకమావహింపవలెను. ఒక యావేశమావహింపవలెను దుఃఖమో, మోదమో కృపయో, వలపో, యీర్ష్యయో, భక్తియో యతని మార్చి వేయవలెను" కృష్ణశాస్త్రి వాక్యల్లోనేకాక ఆయన కృష్ణపక్ష, ప్రవాస, ఊర్వశి మొదలైన కావ్యఖండికల్లోనూ, మహతీకీర్తనలలోనూ ప్రతిబింబిస్తోంది.

సంస్కృతకవులలో వాల్మీకి, వ్యాస, కాళిదాస, భవభూతి శంకరాచార్యులు ఇత్యాది కవుల ముద్ర కృష్ణశాస్త్రిగారి కవితల్లో ఎడనెడా భాసిస్తుంది "శోక శ్లోకత్వమాగతః" అన్న వాల్మీకి లాగానే కృష్ణశాస్త్రిగారు "ఉవి ఉవి మనసు నొక్కొక్క వేదన కావ్యమౌను మరియు గానమౌను" అంటారు. 'అశోకము' అన్నఖండికలోని "అశోక మొక్కపరితోచు సీతావియోగహృదిగ, ఒక్కపరి తోచు ప్రాచేతసోచ్చరితిగ" అన్న పాదాలు రామాయణగాథా ప్రభావంతో వెలువడినవే.

"యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి" — అన్న శ్లోకచ్ఛాయలే

పల్లకి, సంపుటిలోని "మన హిమాలయాలు, మన గంగలు, పొలాలు...... ఉన్నవరకు గాంధి ఉండితీరు" అన్న మహాత్ముడు ఖండికలో గోచరిస్తాయి.

---

1. శ్యామపర్ణి భూమిక.

2. New - essays on Aesthetics

3. ఏకాంతసేవ పీఠిక — అప్పుడు పుట్టిఉంటే సంపుటి.

వ్యాసభారతంలోని "రత్నాకరస్త్వగృహం, గృహిణీ—చ షడ్దామ్మ" అనే శ్లోక భావమే కృష్ణశాస్త్రిగారి మహతీ కీర్తనలో "తారకారత్న భాసుర తారహార" అన్న పద్యంలో స్ఫురిస్తుంది. "ఆహాంమిుగ శోక మశ్రుపానీయమ్మ అనవరతమందీయవా" అన్న మరో మహతీ గీతంలోని భావం శ్రీమద్భాగవతంలోని "విపదస్సన్తు శశ్వత్తాహ తత్ర తత్ర జనార్దనా, భగవతాదర్శనం యత్స్యాదపునర్భవ దర్శనమ్" అన్న శ్లోకార్థాన్ని ధ్వనిస్తుంది.

కాళిదాసు రఘువంశంలోని అజవిలాప ఘట్టంలోని "గృహిణీ సచివస్సఖా" అనే శ్లోక భావన్ని ముద్ర్చుకుంది కృష్ణశాస్త్రిగారు గాంధీ నిర్యాణ సమయంలో రచించిన "నన్నుగన్న తండ్రి నాకంటి వెల్గ నావేల్పు, నాయూర్పు, నాయోర్పు ........ఏమి మిగిలెనన్న" అన్న కవిత.

త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయామ్
ఆత్మానం తే చరణ పతితం యావదిచ్ఛామి కర్తుమ్
అస్రైస్తావన్ముహురుపచితైర్దృష్టిరాలుప్యతే మే
క్రూరస్తస్మిన్నపి నసహతే సంగమం నౌకృతాంతః" అన్న ఉత్తరమేఘం లోని శ్లోక భావార్థమే కృష్ణశాస్త్రిగారి "కిల కిల మని" అన్న ఖండికలో—

"నా మనోహరి నిన్ను కన్నారగాంచ నలవిగాకుండ దుఃఖాశ్రుసలిల మౌక్తికంబొకటి నాదు ప్రణయ వీక్షణముగప్ప" గా సాక్షాత్కరిస్తుంది. మేఘసందేశ కావ్యాభినివేశాభిరుచులు 'పుష్పలావికలు' అన్న వచనరచనలో సువిదితమవుతాయి. అమలమోహన సంగీతమందు హృదయరళన దారుణ రోదన ధ్వనుల వించు" అన్న మాటల్లో కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంలో "రమ్యాణివీక్ష్య మధురంశ్చ నిశమ్యశబ్దాన్, పర్యుత్సుకోభవతి యత్సుఖితోపి జంతుః"1 అన్న శ్లోకభావం ప్రతిబింబిస్తుంది.

భవభూతి 'ఉత్తర రామచరిత'లోని "అపిగ్రావారోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అన్న శ్లోకంలోని సీతావియోగ దుఃఖితుడైన రాముడి తోటి ప్రకృతి సహవేదన పొందిందనే భావప్రకటన కృష్ణశాస్త్రి 'విరులతోట' అనే

ఖండికలో "నా అలరులేని ప్రేమోడు ప్రేమాకునుజూచి

కోకిలమ 'కో' యని యేడ్చెగొంతునెత్తి

దారిపోయెడి మందపవనుడు బొలిగనొక్క

నిట్టూర్పు విసరె" అన్న పాదాల్లో ప్రత్యక్షమవుతుంది.

ఈ ప్రకృతి సహవేదనాప్రకటన ఇంకా చాలా ఖండికలలో గోచరిస్తుంది.

శంకరాచార్యుల శ్లోకమైన "ఆత్మాత్వంగిరి జామతిః.................. సర్వాగిరో యద్యత్ కర్మకరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్" అన్న శ్లోకభావాన్ని మహతీకీర్తనలోని "తలపు తలపూజ్యోతి, పలుకు పలుకూగీతి పనులన్ని ప్రణయముగా జేయనా" అంటూ పనులన్నీ భగవదారాధనామయంగా తీరుస్తానంటారు.

దండి పదలాలిత్యం, బాణుని వచనరచనా నైపుణ్యం ఆయనలో సువ్యక్తమవుతాయి. ఈ విధంగా సంస్కృత కవుల ప్రభావమేకాక ఆనందవర్ధనాచార్యుల ధ్వని సిద్ధాంతం, కుంతకుడి వక్రోక్తి, విశ్వనాథుడి రసాత్మకత మొదలైన వాటినన్నిటినీ సంతరించుకొని సహృదయ చకోరాహ్లాదకరమైనది ఆ కృష్ణకవిచంద్రుని కవితాచంద్రిక.

The volitional activity of pleasure or pain (2) Feelings as passivity, malter, impression, inchoate—knowledge (3) Felling as pure intuition"[1] అనే మూడింటిని అనుభూతికి నిర్వచనలుగా ప్రకోచే యిస్తే కృష్ణశాస్త్రిగారూ భావస్ఫోరకత్వము, హృదయాకర్షణము, ఉనోజ్జృంభణములు"[2] కవిత్వానికి కావాలని నిర్వచించారు.

"లిరిక్ రాగతాళాలతో గేయమే కానక్కరలేదు. పద్యం కావచ్చు, వచనం కూడా కావచ్చు" అనె అభిప్రాయం ప్రకోచే అభిప్రాయంతో[3] సంవదిస్తుంది. భావం స్వచ్ఛందంగానూ, ఐచ్ఛికంగానూ ఉండాలనీ దాన్ని ప్రకటించడంలో నియమనిగళాలుండకూడదనె ప్రకోచే అభిప్రాయన్ని "నవ్య కవులకు స్వేచ్ఛప్రాణము. పేరు ప్రాణమైన కోల్పోవుదురుగాని శృంఖలములు ధరింపరు. ప్రాణముకన్న గానముతీపు - సంకెలలో సంగీతమా;

కట్టుబాటులలో ‹గవిత్వమా ?"[4] అన్నమాటల్లో వ్యక్తపరచడమే కాక రచనలలో ఆచరించి మరీ చూపారు కృష్ణశాస్త్రి.

ఆయన విషాదగీతాలలో క్రీ. పూ: 650 నాటి గ్రీకు రచయిత్రి 'శాఫో' కవితల్లోని విరహవేదనాత్మకతలను మేళవించిన భావకవితా మాధుర్యం సర్వేసర్వత్రా దృగ్గోచరమవుతుంది. ఆయన రచించిన "నాడు శాఫో విరహ"[5] అన్న ఖండిక దీనికి ప్రమాణంగా నిలుస్తుంది.

క్రైస్తవుల 'ఆత్మప్రక్షాళన' (Catharisis) ప్రభావం కురియుమురా కన్నీటిని మరిమరి విలపింపుమురా"[6] అన్న కవితలోనూ, బైబిల్‌లోని నీతి కథల ప్రభావం (Parables) - సుప్రియ - బుద్ధ భగవానుడులోనూ వ్యక్తమవుతాయి.

ప్లటానిక్ లౌ (Platanic Love) ప్రభావం 'విరిసివిరియని క్రొవ్విరి' లో స్ఫురిస్తుంది.

ఆధునిక కాలంలో విశ్వకవి రవీంద్రుడు యావద్భారతదేశంల్లోని కవుల మీద తన అనన్యసామాన్య ప్రభావని ప్రసరించాడు. ఒక కొత్త భావవీచిక సాహిత్యక్షేత్రాన్నార్ద్రం చేసింది. అతి ప్రాచీన భారతీయసాహిత్యంలో

---

1. Aesthetics - Croce - Chapter II P
2. ఏకాంతసేవ పీఠిక - 'అప్పుడు పుట్టిఉంటే' సంపుటి - పుట - 9
3. "The limits of the expression intiution that are called art, as opposed to those that are vulgarly called non-art, are emperical and impossible to define. If an epigram be art, why not a simple word ? If a story, why not the news jotting of the journalist ?" - Croce - Aesthetics - XV
4. ఏకాంతసేవ పీఠిక - అప్పుడు పుట్టిఉంటే సంపుటి - పుట - 2
5. "ఉర్వశి" - కృష్ణపక్ష సంపుటి - పుట - 117
6. పాపీ ఖండిక ,, పుట - 70
7. 'పల్లకీ' సంపుటి - పుట - 85 - 88

మహోన్నతదశలో నుండి కాలక్రమేణా విస్మరించబడిన మార్మిక కవితా ధోరణిని పునః సుప్రతిష్ఠతంగావించిన యశస్సు ఆయనకే దక్కింది. స్త్రీ ఉదాత్తభావనకి కూడా ఆధునికకాలంలో ఆయనే ఆచార్యకత్వాన్ని వహించినవాడు. ఆయన గీతాంజలి మొదలైన కావ్యాల భావాల ప్రభావం తెలుగు కవుల మీద, అందులోనూ కృష్ణశాస్త్రిగారిపైన విశేషంగా పడింది.

కృష్ణశాస్త్రిగారు "పల్లకీ 'సంపుటిలోని' చరణ సన్నిధిని' అన్న ఖండికలో రవీంద్రుడి మీద తనకున్న గౌరవప్రపత్తులను తెలిపారు. అందులో

"అప్పుడే ఒక మంగళానిలముకొని తెచ్చి
అందిచ్చిపోయె అజరామరము నీవాణి
నాగీతి అప్పుడే నగలన్ని విడనాడి
శిరసు వంచెను భూశివరకు నీ పదమాని" అంటూ తనమీద రవీంద్రుడి కవితాప్రభావం ఎంతగా ప్రసరించిందో సూచిస్తారు. ఏకాంతసేవ పీఠిక శ్యామపర్ణిభూమికలలో రవీంద్రుడి సాహిత్యంపైని కృష్ణశాస్త్రిగారికున్న అధికారం సువ్యక్తమవుతుంది. కృష్ణపక్షాది కావ్యఖండికల్లోనూ మహతీ కీర్తనలలోనూ రవీంద్రుడి ముద్ర సుస్పష్టంగా గోచరిస్తుంది. ఆధునిక సాహిత్యంలో విశ్వసౌందర్యసారభూతమైన రూపంగా 'ఉర్వశి'ని సృష్టించిన రవీంద్రుడే కృష్ణశాస్త్రిగారి 'ఉర్వశి' కల్పనకీ మూలకారకుడు. ఇంతటి సారూప్యం ఇద్దరిలోనూ ఉంది కాబట్టే శ్రీ విశ్వనాథవారు కృష్ణశాస్త్రిని 'తెలుగులఠాగూరు'గా సంభావించారు.

కృష్ణశాస్త్రిగారి 'ఉర్వశి' కావ్యఖండిక "ఈ మిడిసిపాటు నీ ముంగల నేల"లో "ఓయి నాయకసార్వభౌమ' అంటూ భగవంతుని సంబోధించడంలో **"O Master Poet [1]"** అన్న రవీంద్రుడి ముద్రద్యోతకం.

**Don't go, my love ! With out asking my leave"[2]** అన్న రవీంద్రుడి

---

1. రవీంద్రుడి గీతాంజలి
2. గార్డినర్ - రవీంద్రుడు

వాక్యానికి ప్రతిబింబమే కృష్ణశాస్త్రి గారి "ఏను నిద్దురవోదునో యేమో, కరుణ సెలవుగైకొని కేగగా వలదు." అన్న

గుహుడు నాటికలోని "ఇందాక రావడమేమిటి? అలాగ వస్తూనే ఉన్నారు నా ప్రభువులు నా కోసము ఎప్పుడు వస్తున్నారు. ఆహా! "ఎప్పటినుంచో వస్తున్నారు" అన్న గుహుడి మాటల్లో "Have you not heard his silent steps ? He comes, comes ever comes"

"I know not from what distant time thou art over coming nearer to meet me"............[2] అన్న రవీంద్రుడి కవితలోని భావమే ప్రతిఫలిస్తుంది.

మహతీకీర్తనలోని "నేడేరమ్మా! నేడేరము, వాడిన యీ సుమము గోయ, శేలవాలిపోవునో! పెంపూళి కౌగిలేయనో"[3] అన్న భావం ఠాగూర్ గీతాంజలి గీతమైన "Pluck this little flower and take it, delay not I fear' lest it drop and drop into the dust" అన్న దానితో సంవదిస్తుంది. దరిద్రులూ, పీడితులూ, శ్రమజీవులూ అయినవారిలోనే భగవంతుడుంటాడనే రవీంద్రుడి మానవతావాదం కృష్ణశాస్త్రిగారి కవితల్లోనూ మార్మోగుతుందీ క్రింది విధంగా "దరిద్రనారాయణలోకేశా" "గుడిసెలో గుడులలో కునుకు బిచ్చగాడు అనేదీ, "అదుగో అయనక్కడున్నాడు. రాళ్ళుకొట్టి దాళ్లు వేసే వాళ్ళతోనూ, కటిక నేలనున్న వాళ్ళలోనూ".

"My poet vanity dies in shame before thy sight" అన్న ఠాగూర్ భావన్నే కృష్ణశాస్త్రిగారు "ఈ మిడిసిపాటు నీ మ్రోలనేల! తేనె తేటచినుకేనిలేని నా పాటకిపుడు" అన్న పద్యపాదాల్లో సాక్షాత్కరిస్తుంది. ఈనాటి జాతీయగీతంగా భావించబడుతున్న "జనగణమన" అన్న రవీంద్రుడి గీతం" మానవ భాగ్యవిధాతా' అన్న గీతానికి మూలభావాన్నందించిందనవచ్చు.

ఔత్తరాహిక కవులలో హిందీ కవి "పంత్" కృష్ణశాస్త్రులలో భావ సంవాదం ఎక్కువగా గోచరిస్తుంది. ఒకరి భాష ఒకరికి రాకపోయినా ఇంతటి సారూప్యముండడం ఒక చిత్రమైన కవితాహేలగా భావించవచ్చు.

---

1. ఊర్వశీ కావ్యం — ఏను నిద్దురవోదువో — ఖండిక — పుట 142
2. గీతాంజలి — రవీంద్రుడు.
3. మహతీ — 24వ గీతం
4. రవీంద్రుడి గీతాంజలి — 6వ గీతం

తెలుగు సాహిత్యంలో నన్నయ నుండి తనకు కించిత్పూర్వులైన గురజాడ, వేంకట పార్వతీశ కవుల ప్రభావమూ సమకాలికులైన బసవరాజు దువ్వూరి, రాళ్ళపల్లి ప్రభృతులపైని ఆదరాభిమానాలతో గావించిన రచనానుసరణలు కూడా మనకు లభిస్తాయి.

నన్నయగారి ప్రసన్నత, అక్షరరమ్యత కృష్ణశాస్త్రిగారి కవిత్వంలో సర్వేసర్వత్రా ద్యోతకమవుతుంది. నన్నెచోడ కవిరాజు "పొన్నలు పూచె పొన్నలు బూయకముందర బూచెగోగులు"[1] అనే పద్యాని స్ఫురింపచేస్తుంది.
"గుమ్మము ముంగిట కోయిల కోయని అర్చె
కోయిలకన్నా మున్నే గున్నమావి ఊర్చె" అన్న కృష్ణశాస్త్రిగారి "ఏడాది పొడుగునా" అనె నాటికలోని కవిత. "సాయుజ్యం" నాటకలో మల్లాణుడు శివుడినీ మల్లాణినీ ఒకే మూర్తిలో దర్శించి వర్ణించిన సందర్భంలోని "మల్లిపూవో వెన్నలప్రోవో తలపైన" అనె పద్యం తిక్కన హరిహరనాథుని వర్ణానా శ్లోకం "కిం అస్థిమాలాం కిం కౌస్తుభం వా"ని[2] తలపింపచేస్తుంది.

కృష్ణశాస్త్రిగారి 'ఏడాది పొడుగునా', 'గౌతమి' అన్న నాటికల్లోని భీమఖండ కాశీఖండాల ప్రసక్తి శ్రీనాథుని కృతులపై కృష్ణశాస్త్రికున్న ప్రీతినీ అధికారాన్నీ వెల్లడిస్తుంది.

'కృష్ణపక్ష కావ్య ఖండిక' 'తేటివలపు'లోని "వలపులు గుమ్మరింపధు' నవ ప్రణయోదయ హాస చంద్రికల్ చిలుకదు" అన్న పద్యం పోతన భాగవత రుక్మిణీ కల్యాణంలోని "చెప్పదు తల్లికిన్ తలపు చిక్కదిశల్ దరహాస చంద్రికల"[3] అన్న పద్యంతో సంపదిస్తుంది.

కృష్ణశాస్త్రిగారి 'అప్పుడు పుట్టుంటే' అనే వచనరచనలోని రాయల కవుల వర్ణలలోనూ, వారి పద్యాలనుదహరించడలోనూ అయా కవుల రచనలపై ఆయనుకున్న అధికారం వ్యక్తమవుతుంది. యక్షగాన ప్రక్రియలో కృష్ణశాస్త్రిగారి అభినివేశం అయన యక్షగాన రచనలవల్ల వెల్లడవుతోంది.

---

1. కుమార సంభవం - నన్నెచోడ కవిరాజు
2. విరాట పర్వం - తిక్కన
3. శ్రీ మదాంధ్ర భాగవతము - పోతన

గురజాడ మహాకవిపై ప్రశంసాత్మకంగా రచించిన కృష్ణపక్షంలోని "మహాకవి" అన్న ఖండికలో ఆయన ప్రభావం తనమీదా, తన సమకాలికులపైని ఎంతగా పడినదీ "చిన్నిపికములు చిరుతపాటల పిలుచుచున్నవియా" అంటూ సూచిస్తారు. ముత్యాలసరాలలో రచించిన ఈ ఖండిక, "చుక్కలు" అన్న ఖండిక దీనికుపబలకమవుతున్నాయి. గురజాడ సంఘసంస్కరణాభిలాష కృష్ణశాస్త్రిలోనూ మూర్తీభవించి "మాలలమేమో పనికి మాలినవారమొ యేమొ"[1] అనే హరిజనాభ్యుదయ గీతరచనలకి ప్రేరణమయ్యింది శాస్త్రిగారి 'వేణుకుంజం' నాటికకీ గురజాడవారి 'కన్యక'కీ[2] కొంత పోలిక కనపడుతుంది.

వేంకటపార్వతీశ్వర కవుల 'ఏకాంతసేవ'ని కృష్ణశాస్త్రిగారు 'తెలుగు గీతాంజలి'గా కీర్తించారు, దాని ప్రభావం కృష్ణశాస్త్రిగారి మహతీ కీర్తనలలో సుస్పష్టమవుతుంది. వేంకటపార్వతీశ్వరకవుల 'ఉదయగానం'లోని "ఏడుకొండలుపొంగి" అన్న కవితల్లోని "లేమరా నిద్రలో లేదురా సుగతి, చూడరా కన్నెత్తి చూడరా జగతి"[3] అన్న పాదాలు కృష్ణశాస్త్రి మహతీగీతంలో కొద్దిమార్పులతో "లేవోయి నిదురలో లేదోయి సుగతి, చూడవా కనువిచ్చి చూడవా జగతి"గా సాక్షాత్కరిస్తాయి. వారి "ప్రేమకొరకు"[4] అన్న ఖండికలోని భావం కృష్ణశాస్త్రిగారి "ఏల ప్రేమింతును" అన్న కృష్ణపక్ష ఖండికలో రమణీయంగా రూపుదిద్దుకుంది.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి గీతం "పూల పూడింపుమని నిద్ర మేలు కొలిపి తట్టలో కాయమొగ్గలు పెట్టినావు............పరవశమ్మైన గొంతెత్తి పాడుమనుచు తెగిన తంబుర చేతికందించినావు"తో సంవదిస్తుంది. కృష్ణశాస్త్రిగారి "స్వాదు సంగీతల సనాద్విపంచి గరమునందుంచి జీవిత భరము వాయంబాడు కొమ్మంటి తీయ్యని ప్రణయగీతి, తంతులను ద్రెంచి మెట్ల పదిల్చి" అన్న పద్యం.

---

1. గురజాడ 'లవణరాజుకల' గురజాడ అప్పారావు రచనలు
2. " కన్యక "
3,4 వేంకటపార్వతీశ్వర కవుల కావ్యకుసుమావళి ఉదయగానం — పుట — 85 ప్రథమ సంపుటి 87

'మహతి'లోని 'జాగ్రత : జాగ్రత' అన్న గీతాన్ని శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి "ఆమని నిషా" ప్రభావంతో రచించినట్లు కృష్ణశాస్త్రిగారే తెలిపారు. అదేవిధంగా స్వర్గీయ బసవరాజు అప్పారావుగారి గీతాల ప్రభావంతో "వాడిన తీగెకె గడియ గడియకొక వసంతకాలము దేవా"5, కాంచలేను కాంచలేను" అనే గీతాలు వ్రాసినట్లు ఆయనే తెలపడం జరిగింది. 'నా విరులతోట', 'చిన్ని పూవె' అనే స్మృతి గీతాలలో బసవరాజు ప్రభావం కనబడుతుంది. ఇలా సమకాలికుల భావాలని స్వీకరించడంలో ఆయన ఉదాత్త ప్రవృత్తి అభివ్యక్తమవుతుంది.

ఆయన భక్తిగీతాలలో వైష్ణవభక్తి సాహిత్యపు ప్రభావం ముఖ్యంగా చైతన్యులవారి ప్రభావం కృష్ణపక్షంలోని 'అన్వేషణ', కృష్ణాష్టమి, యమునా విహారి మొదలైన నాటికల్లోనూ సుస్పష్టమవుతుంది.

ఆయన 'హాఫీజ్', 'ఉమర్ ఖయ్యాం' ఖండికలు కృష్ణశాస్త్రిగారిపైని సూఫీ కవిత్వ ప్రభావన్ని వెల్లడిస్తాయి.

ఈ విధంగా వివిధ సాహిత్య స్రష్టల నష్టల ప్రభావలు, ఆయా రచనల పైన ఆయనకున్న అవగాహనాధికారాలు కృష్ణశాస్త్రిగారి వివిధ రచనల్లో భాసిస్తున్నాయి.

<u>కృష్ణశాస్త్రి ప్రభావం ఇతర కవులపైన :-</u> కృష్ణశాస్త్రిగారిని ఆయన సమకాలికులు, తర్వాతి కవులు ఆయన కవిత్వాన్నే కాక వేషధారణాదులని అనుకరించడమే ఆయన వైశిష్ట్యాన్ని వెల్లడిస్తుంది. కొన్ని దశాబ్దాలపాటు తన భావనామార్గంతోనూ రచనావిన్యాసంతోనూ తెలుగు కవుల యెదలపై ప్రగాఢ ముద్రని వేసి, దిగ్దిగంతాలకీ కీర్తికాంతుల్ని వెదజల్లిన కవిశేఖరులాయన. శ్రీ శ్రీ, దాశరథి, నారాయణరెడ్డి వంటి నెటమేటి కవులను ప్రభావితులను చేసి అనుకార్యులయ్యారు.

శ్రీ శ్రీ కృష్ణశాస్త్రిగారి ప్రభావం నుంచి విడివడడానికి తనకు సుమారు పదేళ్ళు పట్టిందంటారు.[2] ఆయన భావకవితకి చివరి గీతంగా భావించబడే

---

1. శ్రీ శ్రీ "మహాప్రపంచం' కవితా ధోరణి కృష్ణశాస్త్రిగారి "కృత మహాయుగం" అన్న యువగీతం కనిపిస్తుంది.

2. కృష్ణపక్ష స్వర్ణోత్సవ సంచిక — పుట — 20
"కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు" — శ్రీ శ్రీ గీతంగా పరిగణించబడే

"సుప్తాస్థికల్లోని[1] "నిశాశ్మశానశయ్య", "అగమ్యతమో రహస్యాంగణం", "మృత్యుశైతల్య" మన్న పదాలకూర్పులో కృష్ణశాస్త్రి ముద్ర స్పష్టం.

కృష్ణశాస్త్రిగారి భావసౌకుమార్య పదలాలిత్యాలని పుణికి పుచ్చుకున్నారు. ఆచార్య డా. సి. నారాయణరెడ్డిగారు ఆయన కర్పూరవసంతరాయలు కావ్యంలోనూ సినీగేయాలలోనూ, రామప్పగుడి శ్రవ్యనాటకలోనూ, లలితగీతాలలోనూ కృష్ణశాస్త్రి ప్రభావం సువ్యక్తమవుతుంది.

"ఏల ప్రేమోగించేవురా ఈ మూగవీణ నిరాశా జీవితాన"
వలపు పూవులువాడి, తలపు తావులువీడి
బ్రతుకు రాలిన తోట వెతలు తేలిన చోట"[2] అనే నారాయణరెడ్డి గీతంలో కృష్ణశాస్త్రి భావాలు, పదాల కూర్పు స్ఫురిస్తాయి.

"ఎగిసిపో ఎగిసిపో యుగయుగమ్ముల యంధ జగతి మేరలు దాటి" అన్నపాటలోని "నాటికథలు నాటి వలపు తేనియలు నేటికి స్మరయించుకొంచు నీరైపోతావో"[3] అన్న పాటలోనూ కృష్ణశాస్త్రి ప్రభావం వెల్లడవుతుంధి.

కవికొండల వెంకట్రావుగారి 'ఓ సఖీ' అన్న కవితలో
"నీ కంటి కొలికి నొక నీటి బిందువు నిల్చి"
నీవు మందస్మిత స్విన్నవైతి
కన్నులు మెఱసెను, కప్పెగాఢాంధ కారమెద ఓ సుముఖీ ! ఓ సఖీ"[4] అన్న పాదాల్లోనూ, 'చుక్కలు'[5] అన్న కవితలోనూ కృష్టశాస్త్రి ముద్ర తేటతెల్లమవుతుంది.

బాలాంత్రపు రజనీ కాంతరావు తనగేయనాటికా సంపుటికి 'విశ్వవీణ' పేరు పెట్టడంలో కృష్ణశాస్త్రిగారి "నా హృదయమందు విశ్వవీణాగళమ్ము, ఘోరుఘోరున ఈనాడు మ్రోతవెట్టు" అన్న కవితా ప్రభావమేననేది స్పష్టం,

---

1. వైతాళికులు
2,3 ఆధునిక సంగీతం (రెండవ భాగము) — పుట —15, 17
4. వైతాళికులు " 50
5.

"మనమంచు సోనలో తళుక్కుమను
తొలి సంజమెరుపులో వలపించు భావాల
అలలలో కలలలో నీ రూపెతోచునోయీ
నా ఆశ నీపైపె సాగునోయీ"[1] అన్న గీతంలోనూ,

"శూన్యకుటీరమ్మున అడుగిడవా
మాన్యమౌనూ నడవా
త్వదాగమనమునకై నాకనులే
తరుణ ఘనాంచల చంచలలాయే"[2] అన్న గీతంలోనూ కృ. శా. గారి గీతరచనా ప్రభావం వెల్లడవుతుంది.

బోయి భీమన్నగారి 'తోపులోపలదాగి' అన్న గీతంలో "సుమసౌరు ముఖురాలి హిమ నీరములు చేరి, బాధగా యీ బ్రతుకు భారమైయిటె చిదుకు ఇంతలోరావా చింతనూహించవా"[3] అన్న చరణాలు "మహతీ కీర్తనల భావాన్నీ, పద బంధాలనీ స్ఫురింపచేస్తాయి.

"అల్లనింగిని తెల్లమబ్బుల పకపకలు వికవికలు
కావి యోడను రావి యాకుల మిలమిలలు గలగలలు
పిల్లతెమ్మెర మల్లెమొగ్గల గుసగుసలు మిసమిసలు"[4] అన్న నార్లవెంకటేశ్వరావుగారి పాటలో కృ. శా.గారి పదాలకూర్పు భాసిస్తుంది. ఇలా సంపత్, వెనుమర్తి, పాటిబండ, రామచంద్ర అప్పారావు, అరిపిరాల విశ్వం మొదలైన కవులందరిపైన ఆయన ముద్ర ప్రస్ఫుటమవుతుంది. శ్రీమతి టి. యన్. అనసూయాదేవిగారి 'శ్యామపర్ణి' (రవీంద్రుడి గార్డినర్‌కి అనువాదం) కావ్యంలోని "ఒక వసంతల శాంతలావణ్య సంపదగాని, ఒక్క దూరసంధ్యా మేఘకాంచనరేఖగాని, ఎదలోని ఎదలో కదలుతూ ఏదో పదలని కోరిక ఒరలేని యవ్వనం"[5] మొదలైనవి కృ. శా.గారి కూర్పులని ప్రతిఫలిస్తాయి.

---

1. ఆధునిక సంగీతము - రెండవ భాగము - పుట - 55, 56 రజనీగేయాలు
2. " " " 57, 58 "
3. " " " 24 బోయిభీమన్న
4. " " " 63
5. శ్యామపర్ణి - టి. ఎన్. అనసూయాదేవి.

కృష్ణశాస్త్రిగారి సినీగీతరచన చాలామంది సినీరచయితలపై తన ప్రభావన్ని చూపింది. సి. నారాయణరెడ్డి, గోపీ, మల్లెమాల, వేటూరి, జంధ్యాల వేటూరి సుందరరామ్మూర్తిగార్లపైన మరింత సుస్పష్టంగా కనపడుతుంది. అందులో నేటి ప్రముఖ సినీగేయ రచయిత వేటూరి సుందరరామ్మూర్తి కృ. శా. వాణీ, బాణీలని, ప్రదర్శించడంలో బహు నిపుణులు.

"సిరిమల్లె నీవె విరిజల్లుకావె
వరదల్లెరావె మదినిండిపోవె" — 'పంతులమ్మ' చిత్రంలోని పాటలో, శంకరాభరణంలోని పాటల్లో కృ. శా. ముద్ర బాగా స్ఫురిస్తుంది.

"శంకరా నాద శరీరాపరా" అనే గీతంలోని
ఉరిమే ఉరుములు సరిసరి నటనల సిరిసిరి మువ్వలు కాబోలు
పరవశాన శిరసూగంగ ధరను జారెను శివగంగ
నా గానలహరి నువుమునుగంగ ఆనందవృష్టినే తడవంగ"

అన్న పాదాలలోని పదాల కూర్పు "నీ దయగౌతమిగంగా రామయ నీ దాసులు మునుగంగ"[1] అనే కృ. శా.గారి భావాన్నీ పదాల్ని తలపింపచేస్తుంది. కృ. శా. పై తనకున్న భక్తిగౌరవాలని వెల్లడిస్తూ "మల్లెల-మాల-కవితా హేల-రాసలీల అన్న మూడు పదాలకు దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి అని అర్థాలు చెప్ప గలరు." "ఆయనలో ఆంధ్రదేశానికి అరుదయిన, అందమైన వసంతం వెళ్ళిపోయింది", "కృష్ణశాస్త్రి మరణించాడని విలపించను నేను, ఇకముందు వసంతంవల్లకాటికే వస్తుందని విలపిస్తాను"[2] అంటారాయన.

---

1. "పదములెచాలునురామా నీ పదధూళులే పదివేలు" — కృష్ణశాస్త్రి గీతం
2. "కృష్ణశాస్త్రిలేని ఉగాది" - వేటూరి సుందరరామ్మూర్తి - మార్చి 16, 1980 సితార



# కృష్ణశాస్త్రి కవితా సమాహారం

## సమష్టి గుణావలోకనం

### ఆత్మాశ్రియత్వం :—

ఆత్మాశ్రయత్వం భావకవిత్వపు ముఖ్య లక్షణాలలో ఒకటి. ఆత్మీయకంగా ఉత్తమపురుషలో కవి తన కవితను వ్రాయడంగాని వేరేపాత్రల నాలంబనం చేసుకొని వ్రాయడంచేసినా తన భావనే స్పష్టంగా ఆవిష్కరించేటట్టు (భాగవతంలోని పోతన భక్తి భావనలాగ) ఆత్మాశ్రయత్వమే అవుతుంది. కృ. శా.గారి కవితల్లో అంతటా ఇది ప్రస్ఫుటమవుతుంది. "ఉన్నత భావశాలి అయినవాడు ఏ మాత్రం రేగుమాహాల.........నేమాత్రం ఆగికోలేడు." "ఇంత చిరుగీతి యెదవేగిరించెనేని పాడుకొనుము. తాండవ నృత్యమాడుకొనును." అన్న కవి మాటలు ఆత్మాశ్రయత్వలక్షణాన్నే సూచిస్తాయి.

కృష్ణపక్ష, ప్రవాస, ఊర్వశీ కావ్యాలోని ఖండికలలో చాలావరకూ ఉత్తమపురుషలో చెప్పబడినవే. "తరువెక్కియల నెలగిరినెక్కి మెలమెల్ల జదలెక్కి జలదంపు నీలంపు సిగ్గునై ఈయడవిదాగిపోనా, ఎట్లైనా ఇచటనె ఆగిపోనా !"[1] అని ప్రకృతి ప్రీతిని చూపినా "గరళమే తిందు కడుపార నెఱిగి యెఱిగి, యవలద్రోతు జేతులారన మృతరసము అనితనకే వింతగా తోచే జీవితాన్ని విష్కరించినా, "నా సఖీ ! నా సఖీ ! నేనైపగాలేను"[3] అంటూ ప్రవాసంలోకుందినా, "మృదుల కరుణా మధురము నా హృదయ మెవ్వరెఱు గజాలుదురేమని యేడ్తునెపుడు"[4] అని తన జాలిగుండెని తెలియపరిచెనా ఉత్తమపురుషలోనే చెప్పడం ఆత్మనాయకతనే వెల్లడిస్తుంది.

'అన్వేషణ'లో తావుల తోడ తేనియల ధారలు చిప్పిలు వేణుగీతి కారావముతోడ, మందగతులన్ జనుమారుతముల్ విశాలబృందావన పీఠులందు

---

1. ఆకులో ఆకునై — కృ. ప. సం. — పుట 2
2. నాజీవితం " 9
3. ప్రేయసీ ! ప్రేయసీ ప్రవాసం 99
4. తమిలగిసిపోవు — ఊర్వశి — 127
5. అన్వేషణ — కృష్ణపక్షం — 20
6. ధనుర్దాసు నాటిక.

యమునా మృదంగా వాద్యముల్ త్రోవస్ఫురింపగా వలపుతొందర పెట్ట నొంటిగా పోయినది"[5] కవి ఆత్మే ; "ఏ మేనులేని సీపీ దృగాళి నెట్టులిమిడి నావు ?"[6] అని శ్రీరంగనాయకుణ్ణి ప్రశ్నించే ధనుర్దాసుగళంలోనూ కవికంఠమే ధ్వనిస్తుంది. మల్హణిలోని మల్హణుడూ, గుహుడిలో గుహుడూ, కృష్ణాష్టమిలోని రాధా, నిగమశర్మలోని 'నిగమ శర్మా' కవినే స్ఫురింపచేస్తారు. మైలురాయి కంఠం, బహుకాల దర్శనంలోని, శ్రీనివాసరావు', మాఊరుపోయింది, ఊళ్ళో వీధి అరుగులలోనూ, కృష్ణావతారతత్త్వం, సువాసనద్రవ్యాలోనూ కవి ఆత్మే ఆవిష్కృతము.

## ప్రకృతి ప్రీతి :-

భావకవి ప్రకృతి ప్రణయంలో దాని రామణీయకానికి పరవశించి తానూ అందులో లీనమవ్వాలనుకోవడం, దానికి మానవత్వాన్నాపాదించి భావసంవాదాన్ని దానిలో దర్శించడం ద్యోతకమవుతుంది. కృష్ణపక్ష కావ్యావిర్భావం ప్రకృతి ప్రీతినుంచే జరిగింది. 'నల్లమల' అడవుల సౌందర్యాన్ని చూసిన కవి అక్కడి ప్రత్యణువులోనూ తాను విలీనమైపోవాలనే ప్రగాఢ వాంఛనభివ్యక్తం చేస్తాడు. "పరుషంపు విరిచేడె చిన్నారి సిగ్గువై" అంటూ సామాన్య దృష్టికి జడప్రకృతిగాతోచే విరి(పువ్వు)ని చేడె (స్త్రీ)గా భావించి దానికి చిన్నారి సిగ్గునాపాదిస్తాడు.[1] ఇల్లాగే "చక్కిలిగింతలు పెట్టడం, ప్రీడపోగొట్టడం"[2] మొదలైన మానవసైజాను భూతుల్ని పువ్వుల పడతులకి ఆరోపిస్తాడు. "శ్యామలాంబర పరిణాహసరసిలోన ప్రణయలీలా విహార విలాసినులు"గా తారకలకి (నక్షత్రాలకి) స్త్రీత్వాన్నింపొందిస్తాడు. "అపుడు నా వైపుచూచి నా యలరులేని శూన్యమౌ మోడుమ్రాకును జూచి యొక్క కోకిలమ్మ 'కో' యని యేడ్చె గొంతునెత్తి, మా కొఱకు దారి బోయెడు మంద పవనుడొకడు జాలిగ నిట్టూర్పు విసరె"[4] అంటూ ప్రకృతి సహానుభూతిని చూపినట్లు వర్ణిస్తాడు.

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | కృష్ణపక్షం సంపుటి | — | 'ఆకులో ఆకునై' | — | 1 |
| 2. | " | " | స్వేచ్ఛాగానం 2 | — | 6 |
| 3. | " | " | కలికుమార | — | 16 |
| 4. | " | " | నావిరులతోట | — | 45 |
| 5. | " | " | దివ్యభాగ్యము | — | 31 |
| 6. | " | " | నాప్రేమ | — | 32 |

ప్రకృతి సౌందర్యాన్ని అమూల్యభాగ్యంగా భావించి దానిముందు హేమమౌక్తిక మణీగణాలు విలువలేనివంటాడు.[5] సౌరభాలని చిమ్మే పుష్ప వ్రజము, చంద్రికలను వెదజల్లే చందమామ, పారే సలిలము, వీచేగాలి తన నిర్వ్యాజప్రేమతత్వానికి ఆదర్శాలైనాయంటూ ప్రకృతిలోని ఉదాత్తగుణాన్ని చూడగలిగాడుకాబట్టే అందులోని అంతస్సౌందర్యాన్ని గ్రహించగలిగాడు.

## స్వేచ్ఛాప్రియత్వం :—

సంప్రదాయపు లాక్షణిక శృంఖలాలపైన తిరుగుబాటుగా భావకవిత్వ మావిర్భవించింది. సాహిత్య సామాజిక జీవితంలోని కట్టుబాట్లు 'నియమాలు' అనే సంకెళ్ళని ఛేదించుకుని స్వేచ్ఛగా ఆలపించాలనే తపనే దానికొక మూర్తిని కల్పించి యువతీయువకులకి ప్రీతిపాత్రమై, సంప్రదాయవాదుల తీవ్రనిరసనావహేళనలకి గురి అయింది. సమాజంలోని మూఢవిశ్వాసాలనీ, అస్వతంత్రతనీ కుల మతతత్వాల బంధనాలనీ, అధికారిక నిరంకుశత్వాలనీ నిరసిస్తాడు భావకవి. ఏ విభేదాలు కాని నియమాలుకాని లేకుండా స్వేచ్ఛగా ప్రకృతిలో విహరించే విహంగాలూ, మబ్బులూ; గాలులూ అతనికి ఆదర్శ ప్రాయమై అటువంటి స్వేచ్ఛా జీవితాన్నాకాంక్షించేటట్టు చేస్తాయి.[1] ఈ స్వేచ్ఛాప్రియత్వం కృ. శా.గారి "స్వేచ్ఛాగానం 1,2", "నేను", 'కవి కుమార' 'శాపం' 'పక్షిపని', 'అబ్బ' ఓయి సంధ్యాసమీరణా ఆగష్టు -15 మొదలైన ఖండికల్లో ఆవిష్కృతమవుతాయి. తన స్వేచ్ఛాగానం నిరాశనిశీథంలో తారక ప్రభల్ని చేకురుస్తుందనీ క్రౌర్యకౌటిల్య కల్పిత కఠిన దాస్యశృంఖలాలు తమంతకుతామే చెదిరి పోతాయంటూ[2] అధికార మదోన్మ-త్తులని నిర్జీవపాషాణవిగ్రహాలనీ, దివాంధాలనీ, జానిసీళ్ళనీ నిరసిస్తూవాళ్ళ పెత్తనం స్వేచ్ఛా కుమారుడైన తనమీద సాగదనీ "ప్రళయరుంయూ ప్రభం-జనస్వామి'గా వాళ్ళ అధికార దర్పాన్నీ ప్రాబల్యాన్నీ నిర్మూలించగలననీ

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | స్వేచ్ఛాగానం 2 | — | కృష్ణపక్షం | పుటలు | 5 - 7 |
| 2. | " 1 | | " | " | 3 |
| 3. | నేను " | | " | " | 8 |
| 4. | లోకమా " | | " | " | 47 |
| 5. | సంధ్యాసమీరణా | | " | " | 57 |

హెచ్చరిస్తాడు.[3] తన స్వేచ్ఛా విహారానికడ్డుపడే లోకాన్ని వైరిలోకంగా భావించి హృదయపు స్వేచ్ఛనేవిధంగా బంధింపగలవని[4] సవాల్చేస్తాడు. సంధ్యాకుమారుణ్ణి తనను కూడా స్వేచ్ఛాలోకాలకి అతని "నునులేతరెక్కలమీద తీసుకెళ్ళమంటూ అర్థిస్తాడు.[5] హృదయ, భావసంబంధమైన స్వేచ్ఛనే ఆయన కాంక్షించినది. దీని కారణంగానే కృ.శా.గారి భావాలు ప్రకృతి సౌందర్యపుట గాథాలనీ, మానవత్వపు శిఖరాగ్రాలనీ స్పృశించగలిగాయి.

## వేదన :

"కృష్ణశాస్త్రి బాధలోకానికి బాధ" అన్న చలం మాటలు, తిలక్ "ఎందుకేడుస్తాడు" అన్న పరిహాసోక్తి "విషాదవేదనాకవిగా ఆయనకు సాహిత్య ప్రపంచంలోనున్నఖ్యాతిని తేటతెల్లంగావిస్తున్నాయి. ఆంగ్లకపు -లయిన షెల్లీ, కీట్సుల కవితల్లో విరహమరణవేదనలధికంగా కనిపిస్తాయి. ఈ వేదనా (Romantic Meloncholy) తత్త్వమే కృష్ణశాస్త్రిగారిని 'ఆంధ్రాషెల్లీ' గా చేసింది.

భౌతిక సుఖాతీతమైన ఈ వేదననాజ్వాల కవి హృదయంలో నిరంతరం రగులుతూ ఆయన కావ్యసృష్టికి హేతుభూతమైంది. "ఊపి ఊపి మనసు నాకొక్కొక్క వేదన కావ్యమాను మరియుగానమాను" అన్న కృ. శా. మాటలూ దీన్నికే ఉపబలకమవుతాయి.

స్వేచ్ఛాప్రియుడైన కవికి లోకంలోని అస్వతంత్రతా నమానతలు క్రౌర్యకౌటిల్యాలు, కరుపుకాటకాలు, ప్రణయభావనలోని విరహ వైఫల్యాలూ ఇవన్నీ వేదనకి కారణాలవుతాయి. "పక్షివలె నాకాశనిర్మల పథవిహార స్వేచ్ఛ గోరితి పక్షములు లేవంచెరుంగక ప్రాకులాడుచు పొగిలితిన్"[1] అంటూ పక్షిలాగా స్వేచ్ఛావిహారాన్నభిలషించి అందని ఆదర్శాలకీ అనుభూతులకీ సంకేతమయిన చుక్కలని అందుకోవాలని ఆశించి విఫలమనోరథుడై వేదనకి గురి అవుతాడు. అల్లాగే సాంఘికబంధనాలు, కుటిలత అతనికి వేదననే కలిగిస్తాయి. దానితో తన సౌందర్యతృష్ణకి విరామస్థానంగా ఊహా

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | చుక్కలు | — | కృష్ణపక్షం | — | పుట — 51 |
| 2. | మాటిమాటికి | | " | | " 35 |
| 3. | అయ్యో | | " | | " 42 |
| 4. | ఆరనిదివ్వె | | " సంపుటి | | " 40 |

ప్రేయసికోసం అన్వేషణ సాగిస్తూ ఆమెకోసం పరితపించనారంభిస్తాడు. తన హృదయంలోని విరహవ్యథ కరిగి కన్నీరుగా పారకూడదా" అనుకుంటాడు. స్వచ్ఛమైనట్టి ప్రణయంపుసలిలధారపోసి పెంచిన స్నేహంపు పూలతీవ తావులను జిమ్మునలరుల దాల్పకుండగా గాలి తాకున నేలపై వ్రాలెనకట!"3 అని భగ్న ప్రణయంవల్ల కలిగిన వేదనని వ్యక్తంచేస్తాడు. ప్రణయ భంగ ప్రభూత తాప జ్వరార్తి"4ని భరించలేక "వలపె విషమైన తుచ్ఛజీవనము విషము" అంటూ "హృదయనాళము తెగియె, నాహృదయ ధనము తొలిగిపోయెను. జీవితఫలము స్రుక్కి నేలబడ నింక జీవింపనేల సఖుడ!1అంటూ మరణాసక్తిని ప్రకటిస్తాడు. కాని తన ప్రణయం మాత్రం "ఆరని దివ్వె" సౌందర్యకృష్ణకవి అంతశ్చేతనంలో నిత్యమూ రగులుతూ ఉంటుంది, అదే ఆ ఆవేదనకి మూలం. కవి ఉదాత్త హృదయమా వేదనలోనె సౌఖ్యాన్ని చవిచూసి దాన్నొక అమూల్యసంపదగా భావిస్తుంది.2 తనని "శోకశీకరతి లోకైకపతిగా పేర్కొంటూ తనకి అమూల్యమపూర్వమానంద మొసగు నితాం-తదుఃఖంపు నిధులున్నాయంటాడు. అటువంటి శోకసామ్రాట్టయిన తనని చూసి ఎవరినీ జాలి చెందవద్దంటాడు.3 విశ్వసౌందర్యాన్ని మానవుడెంతగా దర్శించగలిగితే ఈ వేదన అంతగా అతనిలో కలుగుతుంది. వేదనా తప్తుడైన క్షాద్దీ అహంకార నిర్మూలనంతో లౌకికపు పొరలు విచ్చి అంతర్జ్యోతి ప్రస్ఫుమవుతుంది. అటువంటి సమయంలో కలిగే అపూర్వానుభూతిలో తెలియని వ్యథా, అవ్యథలోనె ఒక దివ్యానందం కలుగుతాయి. ఈ శుకోత్సవ ప్రణయ కేళికామోద భారమింకనేను వహియింపలేను."4 అనడంలో ఆనందభారాన్ని మోయలేని తపం ఆకవికి వేదనని కలిగిస్తుందీ'నది సూచ్యం. దీనినె "తీయ తేనియ బరువు మోయలేదీ బ్రతుకు"4 అంటూ కృష్ణుణ్ణి మధురవేణుగానాన్ని చేయవద్దంటాడు. ఆ మురళీపాటలోని సౌఖ్యజ్వాలకి తనెకాక చుట్టూ పఱచుకున్న వెన్నెలలు కూడా మరిగిపోతున్నాయట! ఈ విధంగా కృ.శా.గారి

---

| | | | |
|---|---|---|---|
| 1. 'ఆరని దివ్వె' — | కృష్ణపక్షం — | పుట — | 40 |
| 2. 'ఆశ' | " | " | 53 |
| 3. 'నన్నుగని' | " | " | 60 |

4.

5. 'వైతాళికులు' ముద్దకృష్ణ సంకలనం-"మోయింపకోయ్ మురళీ" గీతం

వేదనా స్వరూపం సహృదయులకి సాక్షాత్కరిస్తుంది, "శోకశ్లోకత్వమాగతః". అన్న వాల్మీకి మహర్షిమాటలు, "ఏకోరసః కరుణయేవ" అన్న భవభూతి భావం, "మధురాతి మధురమైన గీతాలన్నీ అత్యంత విషాదభావనా భరితాలే "1 అన్న షెల్లీ అభిప్రాయాలని సార్థకపరుస్తూ కృష్ణశాస్త్రి తానను భవించిన వేద నని సార్వజనీనంగావించి 'వేదనకవి'గా తెలుగుసాహిత్యంలో ఖ్యాతినొందారు.

## భక్తితత్త్వము — అన్వేషణ :—

భావాంబరవీథుల్లో విహరించే కవిస్వేచ్ఛాప్రవృత్తికి లౌకిక బంధనాలు అసమానతలు మొదలైనవి వేదనని కలిగించి అది విరహంగా రూపొంది ఊహాప్రేయసి అన్వేషణగా మారుతుంది. విశ్వసౌందర్య సారమూర్తియైన ప్రేయసి అన్వేషణలో క్రమంగా అంతర్ముఖుడై దివ్యసౌందర్యమూర్తి అగు భగవంతుడివైపు తన అన్వేషణని మరలుస్తాడు. ఈ పరిణామం కృష్ణశాస్త్రి -గారిలో రచనారంభదశనుంచీ అంతర్వాహినిగా సాగుతున్నట్టే పరిశీలనవల్ల స్పష్టపడుతుంది. ఆయన తొలిరచనలైన మహతీగీతాల్లోనూ ఈ భగవదా రాధనాతత్త్వం ద్యోతకమవుతుంది. కాని ఆయన అవి భక్తి ప్రగాఢతతో వచ్చినవికావనీ తన జీవితం 'చీకటికూపంనుంచి బయటికి వచ్చినప్పుడు కలిగే భావం నా గీతం" అంటారు. కానీ నిజానికి అజ్ఞానాంధకారంలో జ్ఞానజ్యోతిని అన్వేషించడం ఆ జ్యోతి స్వరూపుడు భగవంతుడే అయినప్పుడు అయన కటాక్ష సాక్షాత్కారాలకోసం పడే తపన భక్తే అవుతుంది కదా! కృ.శా.గారి మహతీకీర్తనలలోనూ, భక్తి ప్రధాననాటకల్లోనూ "ఈ ఈశ్వరారాధనాతత్త్వం వివిధ రీతుల్లో భాసిస్తుంది. కవికి ప్రభువుగా, ప్రాణేశుడిగా, ప్రేయసిగా, పతితపావనుడిగా, తల్లిగా, తండ్రిగా, భవసాగరాన్ని దాటించే కర్ణధారిగా, కరుణామయుడిగా గోచరిస్తాడు భగవంతుడు.

శోకసంతప్తుడైన భక్తుడు తనని తాను పాపాత్ముడిగా నిందించుకొని భగవంతుడి శరణుని వేడుకుంటాడు. పశ్చాత్తాపంతో కన్నీటిని కారిస్తే అవి పరమేశుడి యెదలో సరాలుగా విరాజిల్లుతాయి. ఆ కన్నీటివలన ఆత్మప్రక్షాళన మవుతుంది. అవి భగవంతుడి పాదాల ముందర, ప్రవహించి పరమ పావనగంగా నదీతోయ సమానత నొందుతుందనే విశ్వాసం కలుగుతుంది. నిరహంకార చిత్తంతో వినమ్రుడై నటరాజయిన భగవంతుడిముందు తనవి "తేటచినుకేనిలేని పాట'గా, 'తగని త్రుళ్ళింత వెలతి నృత్యములు" గాను పేర్కొని భగవంతుడి ఔన్నత్యాన్నీ తన అల్పత్వాన్నీ వ్యక్తంచేస్తాడు. "ఈ మిడిసిపాటు నీ మోల

1. Our sweetest songs are those that tell of saddest thoughts'' de to Nightingale.

"నేల" అని అంటూ నిరహంకార చిత్తుడవుతాడు. "ఊహాంచలమ్ముల నతి శయించి పొరలు నమృతరసంపు మాధురులలో తన క్షుద్ర జీవితం దారిలేక, తనవివేక కొట్టుకు పోతుందనీ అంత తాను వెర్రివాడై భగవంతుడిలాగా ఆడబోతాడు, పాడబోతాడు ఇలా తనకు చేతనైనట్టుగా దేవదేవుణ్ణి ఆరాధించు కోనిమ్మని ప్రార్థిస్తాడు. లౌకిక పరిధిలోనుంచి అలౌకిక పరిధిలోకి ఉన్ము-ఖుడవుతున్న స్థితిలో దేవాలయంలోని ఘంటానినాదం తనకి ఉదాత్తాహ్వాన నిక్వాణాలనిస్తూన్నట్టుగాతోస్తుంది. మోహనిద్రావశుడైన తనని ఎప్పటినుంచో తానే తొలికోడినై ప్రత్యూషస్సులలో ప్రబోధన చేసే స్వామి మేలు కొలుపులని ఇన్నాళ్ళూ వినలేకపోయానని ఆవేదన చెందుతాడు. "పురుగేని వరుగేని దరిసి పెంచాళిలో నొదిగి రథమ్ముకెదుట నిలిగి 'శివశివా' యనుచు నెడ్చిన జాలు మనుచునగాని యావంత యనుగ్రహింపగడు" అన్న విశ్వాసంతో స్వామి పాదపద్మాల మీద ఓపనిల్జతో పడిపోయిన తనని "కరుణావరుణాలయుడై సుంతచేతులు చాపి లేవనెత్తుతాడనీ దానితో తన "బ్రతుకుంద్రోవల క్రొత్త పొద్దు వెలుగుం బంగారము నిండునాయంటాడు. మొదట దూరదూరంగా తోచిన ప్రభువు పదధ్వని అంతకంతకీ చేరువై మెదని చేరుతుందనీ, ఆపాద స్పర్శతో "'చిర నిదాఘదగ్ధమ్ము', 'జర్జరితము', 'ఛిద్రాంగలము' అయిన తన హృదయం శ్యామలమవుతుందంటాడు. "చంద్రకోటీరుడే తన హృదంత రకుటీరంలో నిండిపోతాడుట.

## మధురభక్తి :—

భాగవతంలోని నవవిధభక్తి మార్గాలు మానవ తరుణోపాయాన్ని నిర్దేశిస్తాయి. అవికాక భాగవతంలోని కృష్ణలీలల నాధారంగా చేసుకుని చైతన్యుడు మధురభక్తి అన్న పదవమార్గాన్ని ప్రచారం చేసాడు. భక్తుడు తనని ప్రేయసిగానూ భగవంతుణ్ణి ప్రియుడిగానూ భావించి చేసే ప్రణయోపాసన మధురభక్తి తత్త్వంగా రూపొందింది. చైతన్యుడి దృష్టిలో 'శ్రీకృష్ణపరమాత్మ యొక్కడే పురుషుడు జీవాత్మలన్నీ స్త్రీలే. భక్తుడు గోపికగా తనని భావించుకుని కృష్ణ ప్రేమలో తరించడాన్ని ఆయన ప్రతిపాదించింది. దీన్ని కృష్ణశాస్త్రిగారు "యమునా విహారి" అన్న నాటకల్లో స్పష్టంగావిస్తారు.[1] 'కృష్ణపక్షం'లోని అన్వేషణలో కవి తానె గోపికగా మారి కృష్ణప్రణయాన్నావిష్కరిస్తాడు. "మురళికామందమంద మాధురుల రుచులతో అంతవఱకూ స్వప్నవీథిలో యథేచ్ఛగా విహరిస్తూన్న గోపికహృదయం మేలుకుని" చిఱుత తొలకరివానగా, చిన్నినినొనగ పొంగి పొరలెడి కాల్వగా నింగికెగయు కడలిగా పిల్లనగ్రోవిని

వెడలిన వింతతీయదనంలో లీనమైపోయింది. ఆ మధురానుభూతికి పరవశయైన గోపిక (కృష్ణశాస్త్రి ఆత్మ) "మఱచి మేనె, మరచి సర్వము" అంటూ తన్ను తానే మఱచి కృష్ణాభిముఖంగా పరువు పరువున పోవు నెద"తో పరుగులెత్తుంది. ఏనాడూ ఇల్లూ-పల్లీ వదలనిదీ, భర్తకౌగిలిని కూడా వదిలి" అంటూ లౌకిక బంధనాలని, ఆడ్డంకులనీ అధిగమించేటట్టు గోపికని చేయగల వంశీగానం యొక్క మోహాతిశయాధిక్యతలని ధ్వనింపచేస్తాడు. పరిమళలహరులు, మధురమురళీరవం పిల్లగాలులు, యమునానవభంగమృదంగ వాద్యాలతో స్రోవస్ఫురింపగా వలపుల తొందరపెట్టగా వెళ్ళిందిట విజనపథాలలో బడి ఆనాటి అర్థరాత్రి. అంతరాంతరాలలో గోపికకి (జీవాత్మకి) కృష్ణుణ్ణి (పరమాత్మని) చేరుకునే మార్గం తెలుసుకొని హృదయం అట్టడుగు పొరల్లో అజ్ఞాతంగా పడున్న స్రోవ మురళీరవంతో ఉద్దీప్తమై పెల్లడవుతుంది. ఇది వేదాంతంలోని ప్రత్యభిజ్ఞవంటిది. "కరములోని మురళికాదు నాలోని మోడు చెడదనీ శిథిల జీవనమును ప్రమోయింపగలడు" అంటూ శ్రీ కృష్ణపరమాత్మ శిశిర జీవితానికి నూత్నవసంతాన్నివ్వగలడని సూచిస్తూ అమృతగాన శీతల తుషారాలు విరజిమ్మే వేళ చిన్నికృష్ణుని సొబగులని వర్ణిస్తూ తన ఆంతరమైన అనుభూతిని ప్రకటిస్తాడు కవి. యమునానది, ఇసుకతిన్నెలు, వనతరులు కూడా కృష్ణవిరహానికి దుఃఖిస్తున్నాయంటూ ప్రకృతి పురుష ప్రణయాన్ని విస్ఫురిస్తాడు. కుమార గోపమురళీగానం లేనినాడు "శరత్తమస్వినులు, మల్లె సుధాంశుమాలికలు, వినీల నిర్మల కళిందసుతానవనాట్య సంపదయూ ఉండవంటూ ప్రకృతంతా శోభావిహీనమవుతుందనీ తన తనూలతకి "పులకాంకుర కోరాకావళులుండవంటూ కృష్ణవిరహమెంత వేదనభరితమైనదో తెలియజేస్తాడు. ఈ విధంగా విరహవేదనా తప్త గోపిక హృదయంలో సాక్షాత్కరించేది కృ.శా. హృదయం. అందులోని అంతర్జ్వాలే వేణునాదం, ఆ అన్వేషణే భగవదన్వేషణ.[1] ఇలా కవి వేదన గోపికవేదనగామారి సార్వజనీనమైన అనుభూతిగా రూపొందిపాఠకులని రసార్ద్రహృదయులని చేస్తుంది. మధురభక్తికి ప్రతీకగానిలిచే రాధగా, గోపికలుగా, కృష్ణాష్టమి, యమునావిహారి మొదలైన శ్రవ్యనాటికల్లో కృష్ణశాస్త్రియే కృష్ణప్రణయ భావనామాధుర్యంలో ఓలలాడుతాడు. 'తమదీ కరిమబ్బు మేని సౌందర్యమట, నిండుపున్నమినెటుల పండించునెద"[2] అని పరిహాసోక్తులాడుతాడు. జగత్పతి వలపు పిలుపును మేలుకులుపుగా భావించి భగవత్ప్రణయంలో తన జీవితాన్ని పండించుకుంటాడు.

---

1. అన్వేషణ — కృష్ణపక్ష సంపుటి

2. కష్ణాష్టమి — శ్రవ్యనాటిక

ఈ విధంగా కృష్ణశాస్త్రి భగవద్భక్తి అనేక రూపాల్లో అత్యుజ్జ్వలంగా భాసిస్తుంది.

## తాత్త్విక కృతులు

### మార్మికత — సూఫీప్రభావం :—

తాత్త్వికాంశాన్ని కొన్ని సాంప్రదాయాలతోనో, సంకేతాలతోనో భంగ్యంతరంగా చెప్పడాన్ని 'మార్మికత'గా పేర్కొంటారు. భారతీయ సాహిత్యంలో ఈ మార్మికత అనాదిగా వస్తూన్న వేదాంతంలో ఒక శాఖే అయినా ప్రాచీనభారతీయ, సూఫీ మార్మికతల వైభవాన్ని సంపూర్ణంగా సంతరించుకున్న రవీంద్రనాథ్ టాగూర్ "గీతాంజలి"తో ఉత్తేజితులైన ఆధునిక భారతీయ కవులందరూ తమతమ భాషాసాహిత్యాలని ఈ మార్మిక కవితలోనూ సుసంపన్నం గావించారు. సూఫీసాహిత్యంలోని మార్మికతలో వేదాంతభావ మిమిడి ఉంటుంది. భగవంతుణ్ణి ప్రేయసిగానూ భక్తుణ్ణి ప్రియుడిగానూ ప్రేమని మధువుతోనూ లోకాన్ని మధుశాలగానూ సంకేతిస్తూ వేదాంతతత్త్వాన్ని బోధిస్తుంది సూఫీ సాహిత్యం. పారశీక సాహిత్యంలో ప్రఖ్యాతుడైన సూఫీ కవి హాఫీజ్ భావాలననుసరించి కృష్ణశాస్త్రిగారు వ్రాసిన 'హాఫీజ్' అన్న ఖండికమార్మిక కవిత్వాన్ని దీపించేది. పైనుల్లేఖించిన సాంప్రదాయసిద్ధమైన ప్రతీకలు బాహ్యంగా లౌకిక సౌఖ్యానుభూతిని వ్యక్తంచేస్తున్నట్టుండి అంతర్గతంగా తాత్త్వికతనిపొందు పఱచుకునుంటాయి. ప్రేమమధువుని హృదయంలో నింపుకుని భగవంతుణ్ణి అన్వేషించడం ప్రియానునాన్వేషణోత్సవ యాత్ర గావించడం[1] విశ్వాన్నంతా ప్రతిబింబించే సికందరుముకురం[2] గారదీపాత్ర (మధుపాత్ర). ఇది సంకేతించేది: ప్రేమభావనని హృదయంలో నింపుకున్నప్పుడు విశ్వరహస్యం బోధపడుతుందని పారశీకుల విశ్వాసం, మధుపాత్రని మరల మరల గ్రోలడం అంటే ప్రేమభావన్ని హృదయంలో నింపుకోవడం, మరిమరి ప్రియాననాన్వేషణోత్సవయాత్రని చేయడమంటే భగవదన్వేషణని సాగిస్తూండడం, ఆ విధంగా అన్వేషణని సాగిస్తూంటే ఎప్పుడో ఒకనాడు పరమాత్ముని కృపతో 'సకిముసుగు' అంటేభక్తుడికీ భగవంతుడికీ మధ్యనున్న మాయతెర తొలిగిపోయి 'ప్రేయసిమోము' అంటే భగవంతుడి సాక్షాత్కారం లభిస్తుంది.

మార్మికతలో కూడుకున్న మరొక ఖండిక "గొంతుచీకటి". "నాటి యామని వరువాత తోటలోన పాటలోన మేలుకొన్న స్వప్నములు మూగె

పాటలపలాశములు నా గవాక్షవీథి నా నయనములనుండి, నాలోననిండి," ఇక్కడ ఆమని సంకేతించేది యౌవనాన్ని. అప్పుడు కలలతో నిండిన హృదయానికి తనలో మంద్రంగా వినిపించే పరమాత్ముడి పిలుపు వినిపించలేదు. క్రమంగా ఆ వసంతం (కోయిలలకారు), 'నవమల్లికల వేళ, శ్రావణం, శరత్తూ కూడా వెళ్ళిపోయాయి అంటే జీవికి క్రమంగా జీవితంలో యౌవనమూ తదనంతర వివిధ దశలూ గడచి హేమంతంవంటి ముసలితనం ఆవహించింది. జీవితం 'మృత్యువు'గా, గుండె 'సుప్తశిల'గా మారి గొంతు మూగవోయింది. "నేను రావచ్చునా" అన్న భగవంతుడి ప్రశ్నకి 'రావోయి' అనలేడు సరికదా "నేను రాలేనని కూడా ఏడ్వలేని స్థితిలోనున్నాడు. ఈ విధంగా జీవితాన్నంతా విషయోపభోగాలలో, లౌకిక కార్యకలాపాలలో గడిపివేసి వృద్ధాప్యంలో విషాదమావహించినప్పుడు జీవాత్మ పరమాత్మకోసం పడే తపనని భంగ్యంతరంగా చెప్తాడు కవి ఈ ఖండికలో.

ఇటువంటి మార్మికతే 'మాటిమాటికి' అన్న ఖండికలో ద్యోతకమవుతుంది. అందులోని 'మనోహరి' సర్వాంతర్యామి, విశ్వసౌందర్య సారభూతుడైన భగవంతుడికి సంకేతం. 'అతని పాట'లోని "హృదయ కమల వికసనోద్బోధకంబగు వింతగీతి", "ఓయి సంధ్యాసమీరణ" ఖండికలోని "నిత్యతేజోమయానంద నిలయము" భగవద్బోధననీ, పరమాత్మసాన్నిధ్యాన్నీ ధ్వనిస్తాయి. "ఏను నిద్దురవోదునో యేమో" అన్న ఖండికలో 'నిద్దుర' భౌతిక విషయలోలత్వంగానూ, తనని ప్రియురాలిగానూ, భగవంతుడిని ప్రియుడిగానూ సంకేతిస్తాడు కవి. 'సుషుప్తి', 'గాఢనిద్ర' లౌకిక కార్యకలాపాలనీ, 'మేల్కొవడాన్నీ', 'పిలుపు నందుకోవడాన్నీ' భగవంతుడివైపు మళ్ళడాన్ని సూచిస్తాయి. పరమాత్మ-పాదాలని తన బ్రతుకంతా అపలేకపోవడానికి కారణంగా "దిక్కుమాలిన యెడద బంధింపలేను" అనడం హృదయాన్ని నిశ్చలంగా ఉంచకోలేక పోవడాన్ని సంకేతిస్తుంది.

ఇలా కృష్ణశాస్త్రి రచనల్లో ఎడనెడా మార్మిక కవితారీతి గోచరిస్తుంది.

## సౌందర్య పిపాస

కృష్ణశాస్త్రి కవిత్వానికి జీవగఱ్ఱవంటిదీ సౌందర్యతృష్ణ. ఈ సౌందర్య తృష్ణ ప్రకృతి సౌందర్యంలో లీనమవ్వాలను కోవడం ఆరంభమయి ఊహతో ప్రేయసి "ఊర్వశి సృష్టిలో పరాకాష్ఠనందుకున్న భగవద్భావనగా పరిణమిస్తుంది, విశ్వసౌందర్యాన్వేషణ విశ్వసౌందర్యస్రష్టను గురించిన అన్వేషణగా రూపొందుతుంది. ఈ విధంగా సౌందర్యాన్వేషణలో ప్రకృతి స్త్రీ భగవంతుడు అనే త్రిదశలు కనిపిస్తాయి.

నల్లమల అడవుల సౌందర్యం ఆయనలోని సౌందర్యతృష్ణని మేల్కొల్పింది. ఆపరమ రమణీయమైన ప్రకృతి ప్రత్యణువులోనూ తాను లీనం కావాలనిపిస్తుంది. అందుకే "శీకరంబులతోడ చిరుమీలతోడ, నవమౌక్తికములతో సాట్యమ్ములాడి జలధిగర్భమ్ములోపల మున్గిపోదు"ననడంలో విశ్వసౌందర్యంలోని ప్రత్యణువునూ తనలో పొందుపరుచుకోవాలనే తీవ్రతపనకీ, సౌందర్యతృష్ణకీ రూపకల్పననిస్తుందాయన రచించిన 'తేటివలపు' అన్న ఖండికలోని తుమ్మెద సమాధానం. "కాని నిరతము మల్లిక కడనెయుండి ముదము గూర్ప మాకొక్క పూవె చెపుమ"[1] సాహిత్యప్రపంచంలో భోగలాలసుడికి తుమ్మెద, స్త్రీకి పువ్వు సంకేతాలు. ఇక్కడి తుమ్మెద సమాధానంలో వ్యక్తమయ్యేది భోగలాలసత్వంకాక భ్రమరగీతాల్లో ధ్వనించే భావం వంటింది. అంటే ప్రకృతిలోని ప్రతి సౌందర్యలేశాన్నీ పొందాలనే తీరని దాహంతో నిరంతరం సంచరించే విశ్వసౌందర్య తృషాకులమైన హృదయానికి విశ్వసౌందర్యంనుంచి సౌందర్యాత్మకుడైన పరమాత్మవైపు సాగిపోయే జీవాత్మవేదనకీ సంకేతం.

ప్రకృతిని స్త్రీగా సంభావించడం ఆదినుంచీ వస్తూన్న సంప్రదాయం స్త్రీ సౌందర్యస్వరూపిణి కనుక భావుకుడైన కవి ప్రకృతి సౌందర్యంలో స్త్రీ మూర్తిని దర్శిస్తాడు. 'నవ వికసిత పుష్పం' అతనికి రంగుల సొగసు చీరలని ధరించి నవ్వువెన్నెలలని కాసే అందమైన స్త్రీగా గోచరిస్తుంది.[2] పువ్వుయొక్క అరవిరిసిన స్థితి స్త్రీ నూత్నయౌవనం విర్భావం వంటిదిగా స్ఫురిస్తుంది.[3] ఇలా ప్రకృతిలోని స్త్రీత్వాన్ని దర్శించిన కవి హృదయంలో ప్రణయభావన తలెత్తుంది. "నిర్వ్యాజమైనదా ప్రేమ[4], ఏ మాత్రమూ ప్రతిఫలాన్నాశించనది. మధుమాస వేళ మావిచిగుళ్ళను మేసిన కోయిలకలకూజితాన్ని దేనిని ఆశించి చేస్తుంది ? ఇతరులని తృప్తిపరచడానికా లేక తనుఆలపించకుండా ఉండలేకా ? "మధు మాస వేళ పాడడం దాని నైజం అల్లాగే ప్రేమించడం తన హృదయానికి స్వభావసిద్ధమైనది అంటాడు కవి.

అటువంటి ప్రవిమల ప్రేమసామ్రాజ్య పట్టభద్రత్వాన్ని మించిన దివ్యభాగ్యం మరేదీలేదనీ మణికనక రత్నరాసులన్నీ దానిముందు చిఱుత సంపదలంటాడు !

---

1. విరిచేడి — కృష్ణపక్షం — పుట 17
2. విరిసివిరియని " " 33
3. "సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు" — కృష్ణపక్షం - పుట 30

ఇంక నీలిమేఘాలలో దాగిన మెఱుపులోనే కాక ప్రకృతి అంతటా తన ప్రేయసి జాడతెలియక తపడుతూంటే వేయికన్నులతో వెతుకుతూంటాడు. కళ్ళుమూసుకున్నా ఆమె సుందరరూపమే సాక్షాత్కరిస్తుంది. ఆమె కవి హృదయంలోని సౌందర్యజ్వాలకి స్వరూపం కాబట్టి మనో నేత్రాలకి మరింత స్పష్టంగా గోచరిస్తుంది. ఆ విధంగా హృదయంలోని అట్టడుగు పొరల్లో ఎల్లప్పుడూ రగుల్తూ అప్పుడప్పుడూ మెఱుపులా మెఱిసే అంతర్జ్వాలనందు కోవడానికి ఆయన సాగించే అన్వేషణ. "నిరాశలో ప్రాణంపోయినా విడువక ఛాయలాగే వెన్నంటిసాగుతానంటాడు."[2] "మింటనెచటనో మెఱయు చుక్కల కంటజూచితి కాంక్షలూరగ, కాంక్షలూరిన కొలది చుక్కలె కాంచిబ్రదుకే గడిపితిన్"[3] అంటే లౌకిక సౌందర్యాలని నిరసించి అందని అలౌకికమైన అందాలకోసం అఱ్ఱులు చాస్తాడు చివరికి తెంటేనీ పొందలేక తీరని తృష్ణ, ఆరనిజ్వాలకి గురిఅవుతాడు. "తారామణి విషాదపూరిత కాంతుల్నీరాలు స్తున్నట్టు",[4] పవనుడు వింత విలాపగీతి నాలపిస్తున్నట్లు[5], గౌతమీ తరంగ సముదాయం గుండెకరిగేటట్టు ఆపాటకి క్షీణస్వరంలో "ఊ" కొడ్తున్నట్టూ[6] అనిపించి ప్రకృతిలో కూడ తన దుఃఖమే వ్యక్తమవుతుంది కవికి.

కాళిదాసు చెప్పినట్టు ప్రకృతిలోని రమ్యదృశ్యాలని చూసినప్పుడు, మధుర శబ్దాలని విన్నప్పుడు భావుకుడి హృదయంలో అంతర్జ్వాల కారణంగా కలిగే కలతయిది. తనలోని చైతన్య ప్రభతటిల్లతలాగా, మెరుస్తోందేగాని అందుకుందామంటే అందక ఆరనివేదనని రగిలిస్తోంది. ఆ వేదనలో కూడా ఒక సౌఖ్యాను భూతిననుభవిస్తున్నాడు కవి. "అశనిపాతమ్ములో నంబువేలా హాలాహలమ్ములో నమృతమేలా" ఈ విధంగా విషాదసుఖాన్ని చేకూర్చి సగం నిద్దురలో కమ్మిన కలలాగా ఆ ప్రేయసి కదిలిపోతుంది. ఆ ప్రియు రాలు ఆతని గుండెలో గూడు కట్టుకున్న సౌందర్యమే. అదే ఎడతెగని తపనకి కారణమై ఏ దూరతీరాల్లో కోరమ్మని పిలుస్తూంది. తిమిరమో ! దివ్య తేజమో ! ఏది తననావిరించుకున్నదో అది తననెక్కడికి తీసుకెళ్ళుతోందో కూడా అతనికి తెలియడంలేదు. తన యెదలో నడిచి మాయమయినట్లున్నది.

---

| | | | | |
|---|---|---|---|---|
| 1. | దివ్యభాగ్యము | — | కృష్ణపక్షం — | పుట |
| 2. | ఆరనిదివ్వె | | " | 40 |
| 3. | చుక్కలు | | " | 51 |
| 4,5,6 | నిశాలోచనం | | " | |

ఆ అడుగుల సవ్వడి, అపలిదరి అమె పిలుపు పగటురేయీ మ్రోగుతూ అమె కడియాల రవళులూ చిరుగాజు మ్రోతలూ అతనికి మార్గదర్శకమవుతూంటే ఆశ నిరాశల మధ్య ఊగిసలాడుతూ అనంత పథంలో యెడతెగని యాత్రని సాగిస్తూనే ఉన్నాడు. తన యెడదలో విరహవిపంచీ కంఠం ధ్వనించిన నాటి నుంచి రాత్రింబవళ్ళు నిద్రాహారాలు లేకుండా "ముగియబోని ఏయర్థమెరుగా రాని వేసటేలేని వెఱ్ఱి అన్వేషణని సాగిస్తూనేఉన్నాడు. "నీడవోలె నిలిచి" పిలిచిన ప్రియురాలి పిలుపుతో ప్రకృతి మాధుర్యమంతా ఒకచోట రాశీభూతమై తన హృదయంపుటంచుల నొరసిపారి తన బ్రతుకంతా నింపివేసినట్టువుతుంది. ప్రేయసి నేత్రాలు విశ్వరహస్యాన్ని స్ఫురింపచేస్తాయి కవికి. ఆ నయనాల్లో అపూర్వమధురశక్తి స్ఫురిస్తోంది. కాని అది ఏమిటో అర్థంగావడంలేదు. తనలో నిరంతరంజ్వలించే సౌందర్య తృష్ణాస్వరూపమే అమె అనేది గ్రహించి "జీవిత రహస్య మార్గమ్ములలో వదలని కోరికగా పేర్కొంటాడు. "ఉషః కాలకౌముది సొగసు" వసంతవిలాస మాధుర్యంగా తోచిన ఆమెరూపం అతనిలో పాలకడలి నుప్పొంగజేస్తుంది. దానితోలోకాల తీయదనాన్ని మోయ లేననీ, ఆనందతేజోంబు నిమలనాలపిస్తానంటాడు. ఇలా అంతర్జ్వాలా స్వరూపం విస్పష్టంగా గోచరించి తనకీ ఊహాప్రేయసికీ యెడబాటులేదని గ్రహించిన కవి, దివ్యసౌందర్య రసాత్మకుడైన భగవంతుడి అన్వేషణకి పూనుకుంటాడు. మోహనిద్రావశాన భగవంతుడి పిలుపునందుకో లేక పోయానని పరితపిస్తాడు. బాధా తప్త హృదయాలు చేరుకోవలసిన స్థలం భగవంతుడి సన్నిధేననే సత్యన్ని గ్రహిస్తాడు. భగవంతుడి నేత్రాలలో దివ్యసౌందర్యా న్నీక్షించి "అంధజగత్తులోపలన్ తెన్నులు తెల్పునో, ఎదుట నిల్పునొ మిన్నులు" అని "బహిరంతరాలలో వెలుగొ ఆనందమో" అని ఆనంద స్వరూపాన్ని విష్కరిస్తాడు. "ఆపగ సొగపాగనెటు లొదల జుట్టితో ఎట్లు పెట్టితో, ఆపయి ఓరగ నవసుధాకరరేఖ తురాయిగాగ పెట్టిన పరమరమణీయ మూర్తిగాను సాక్షాత్కరిస్తుంది. ఈ విధంగా భగవంతుడి పదధ్వని నిరం తరం హృదయంలో వినిపిస్తూనే ఉంటుంది. తన సౌందర్య తృష్ణకి విశ్రామ స్థానం గోచరిస్తుంది. ఈ క్రమపరిణామాన్ని గుర్తించగలిగినప్పుడే కవికి కవితా సౌందర్య రహస్యం బోధపడుతుంది.

# మానవతావాదం — సామ్యవాదధోరణి

విశ్వమానవతని బోధించిన మహర్షి వెంకటరత్నం నాయుడిగారి శిష్యుడవడంవల్లా, సహజంగా పరమభావుకుడవడంవల్లా కృష్ణశాస్త్రిగారిలో గూడుకట్టుకున్న మహోన్నతమానవతారాధనాతత్త్వం ఆయన రచనల్లోనూ సాక్షాత్కరిస్తుంది. ఈ విషయమే "నాకు కవిత్వం ప్రాణం, సంగీతం ప్రాణాధికం; మనిషి ఈ రెంటికన్నా అధికం"[1] అన్న ఆయన మాటల్లో స్పష్టపరుస్తాయి. "అడుగడుగున గుడి ఉంది అందరిలో గుడి ఉంది"[2] అని భగవంతుడి ఆవాసం ప్రతిమానవుడి అంతరంగం "కానీ "శిథిలాలయం" కాదనీ సాటి మనిషిని అస్పృశ్యుడిగా దరిద్రుడిగా కించపరచడం భగవదపచారమనీ నమ్మే పరిపూర్ణ మానవతావాది కృష్ణశాస్త్రి. సమాజంలోని వర్గవర్ణభేదాలు, స్వార్థం, కుటిలత, అసూయాద్వేషాలు - ఇవన్నీ ఆయనకి దుర్భరమైన వేదనని కలిగిస్తాయి. కరువుకాటకాలు, దారుణమారణాయుధాలతో సంభవించే రణాలు, విధ్వంసక చర్యలూ, మంటలు, మసనాలు వరదలూ భూకంపాలూ - ఇవన్నీ ఆయన వినలేనిచ్చగించని ఆకాశవాణి వార్తలు.[3] ఈనాటి మానవులు స్వార్థపరత్వంతో ద్వేషంతోనూ, హింసా ప్రవృత్తితో తమకడుపులని నింపుకుంటున్నారు. క్రూరజంతువుల్లాగా, విషప్పురుగుల్లాగా, అణ్వస్త్రాల్లాగా ఈ మానవజాతి ఎందుకిలా తగలడిపోతుంది?[4]" అని ఆక్రోశిస్తూ ఆ వేదనని పొందుతాడు. ఈ దుస్థితిని తొలిగించాలనె భావనే ఉంటే "ప్రేమ" అనేపాలు బోదెలో పోస్తేచాలు "మోడు మందారాలు పెడుతుంది, అటు చాపి ఇటు చాపి అభయహస్తాల్ని జగమంత పందిరులు కడుతుంది"[5] అంటూ విశ్వమానవ భావన యొక్క గొప్పతనాన్ని తెలియపరుస్తారు కృష్ణశాస్త్రి.

నేల నాలుగు చెఱగులా అంగుళం మేర వదల కుండా తిరిగి ప్రతీ హృదయ ద్వారాన్నీ తట్టి "స్నేహక్షీరాన్ని కించ ఒకింత ఒలికించి "అనుగు

---

1. 1976 జనవరిలో నాతో అన్నమాటలు (వ్రాసిచ్చినవి)
2. మేఘమాల సంపుటి - ఉంటమ్మాబొట్టు పెడతా చిత్రగీతం
3. పల్లకీ సంపుటిలోని సంక్రాంతి ఖండిక — పుట — 8,9
4,5 "క్షుద్రతిత్తిరి కుటిల వృశ్చిక క్రూరవృకరుద్రమారణ యంత్రరుగ్మతలు తానైన మనిషిలోనే పెద్దమడతుంది - అయ్యోమనిషి - పల్లకీ సంపుటి — పుట — 13
5. స్నేహక్షీరము — పల్లకీ సంపుటి " 19

సోదర పురలిరానా ! అని సెలవడిగిరావాల"నే చిన్ననాటి నుంచీ ఆయన భావపల్లరికి వాడనీ నలవాన వీడని కోరిక ఒకటుండిట.[1] కవిగా తన ఆశయాన్నిలా ప్రకటిస్తాడు - "కర్కశహృదయజాంగలములకి శీతల స్నేహదుగ్ధాన్ని వర్షింపగలను, విద్వేష వైతరణికి అడ్డుగా గాఢ స్నేహార్ద్ర సేతువుని విరచింగలను"[2] అని ద్వేషముండేచోట దేవుడుండడనీ ప్రేమే పరమాత్మ స్వరూపమనీ చెప్తాడు. లోకంలో నిండిన మోసద్వేషాలు, హింసారిరంసలు తనలో కూడా తలెత్తాయేమోనని సందేహించి అట్లాకాకూడదనీ, తనని గాంధీ రవీంద్రులావహించాలనీ[3] వాంఛిస్తాడు. "ఒక్క కడుపులో కూడా ఆకలిసెకలు రగులనీయనని, ఒక్క కన్నులో కూడా దుఃఖాశ్రులోడ నీయననీ అనడంలో మానవత అత్యుజ్జ్వలంగా భాసిస్తుంది.

'ఎగుడు దిగుడులు లేని సొగసైన వీడుగా మూడు పదికోట్లు మననాడు నిర్మింతునం[4]టూ" సర్వమానవ సమానతని నెలకొల్పాలనే ఆశయాన్నభివ్యక్తీకరిస్తారు.

ఉన్న సంపదన్ని అందరూ సమానంగా పంచుకొని అనుభవిస్తే లోకంలో కరువు కాటకాలుండవని సుప్రియద్వారా సూచిస్తాడు. ఈ ధనిక పేదవర్గ భేదాలు ఏర్పడడానికి శ్రమజీవుల దైన్య - హైన్య జీవనానికీ ఈ సమాజమే కారణమనీ, అతని దుస్థితికి మనమంతా కారణమేనటాండు. "ఆ వంగిన నడుంని సరిజేయ్యాల్సిన, ఆ క్రుంగిన భుజాన్ని నిలబెట్టాల్సిన బాధ్యతలు మనవేనని[5] నొక్కివక్కాణిస్తాడు. ఆయన మహోన్నత మానవతావాదం రిక్షావాలాలో సాక్షాత్కరిస్తుంది. జాతిమతవర్గాతీతమై కవికీ అహమ్మద్‌కీ (రిక్షావాలాకీ) మధ్య యేర్పడిన అనురాగబంధం విశ్వమానవతాం భావాన్ని సూచించేది.

కృష్ణశాస్త్రిగారు విశ్వమానవతాదర్శాన్ని ఆరాధించి వ్రాతల ద్వారానే కాక చేతలద్వారా కూడా ఇతరులకీ వెలుగుబాటకి త్రోవచూపిన మహనీయులు.

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1,2 & 4 | స్నేహాక్షింపు | — | పల్లకీ సంపుటి | — పుట | 19 |
| 3. | మహాత్ముడు | | " | " | 31 |
| 5. | హాలికుడు | | | పుట | 77, 78, 79 |

## దేశభక్తి :

"స్వాతంత్ర్యం నాజన్మహక్కు" అన్న బాలగంగధర్ తిలక్ సింహ నాదం, గాంధీ సహాయ నిరాకరణోద్యమ నినాదాలకి ప్రతిభారతీయుడి గుండె మార్మ్రోగింది. వివిధ వర్గాలవారు స్వాతంత్ర్య సమరాంగణానికి తరల నారంభించారు. దేశంలోని కవులందరూ ఈ ఉద్యమంతో ఉత్తేజితులై జాతిని జాగృతం చేయడానికి స్వేచ్ఛా స్వాతంత్ర్య కాంక్షాప్రేరకాలైన గీతాల నాలపించసాగారు. గురజాడ అన్నట్టు కవికోకిలల ఆలాపనలతో దేశమంద భిమానము, స్వాతంత్ర్యకామనా బీజాలు మొలకెత్త నారంభించాయి. బంకిం చంద్రుడి "వందేమాతరమ్' మహమ్మద్ ఇక్బాల్ "సారే జహాఁసే అచ్ఛా" అన్న దేశభక్తి గేయాలు భారతీయులందరి హృదయాలనూ పరవశింప చేసాయి. వీటన్నిటితో ఉత్తేజితులైన తెలుగుకవులు, రచయితలు దేశభక్తి ప్రపూరితమైన "దేశమును ప్రేమించుమన్న" (గురజాడ), "శ్రీలుపొంగిన" 'ఏ దేశమేగినా' (రాయప్రోలు), "మా కొద్దీ తెల్లదొరతనము" మొదలైనవి రచించి స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రబలతరంగావింపజేశారు. భావుకుడైన కృష్ణశాస్త్రినీ ఈ ఉద్యమపు వెల్లువ ముంచెత్తి కవితావేశంతో స్వేచ్ఛాగానాన్నాల పింపచేసింది : "యుగయుగంబులనీశ్వర యోధులగుచు స్వేచ్ఛకై ప్రాణను మములర్పించువారి యమల జీవితఫలము ధన్యతను గాంచ" అనడంలోనూ "క్రౌర్యకౌటిల్య కల్పిత కఠిన దాస్య శృంఖలములు తమంతనె చెదరిపోవ జగమునిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు" ననడంలోనూ, ఈ స్వాతంత్ర్య కాంక్షే వ్యక్తమవుతుంది. దేశంలోని పాలకవర్గాన్ని "నిర్జీవ పాషాణ విగ్రహాలుగానూ, తళుకు బంగరు నంకెళ్ళుదాల్చి, లోకపాలకునిబోలు మరియు బానిసీళ్ళగాను గర్విస్తూతనను స్వేచ్ఛాకుమారుడింగా పేర్కొంటూ వాళ్ళ పాలిటి "ప్రళయ ఝంఝూ ప్రభంజనస్వామి" నంటూ హెచ్చరించడంలో బ్రిటిష్ సామ్రాజ్యానికి లొంగి సామంతులుగా ఉంటూన్న జమీందారుల బానిసత్వపు పైఖరిని నిరసించడం వ్యక్తమవుతుంది.

కవికుమార' అన్న ఖండికలోనూ స్వాతంత్ర్యోద్యమ ప్రభావమే స్ఫురిస్తుంది - అవిరళస్వేచ్ఛ వెన్నముందరయబోక వారిదమ్ములు చిత్ర కాశ్మరరుచులఁబూని విహరించు భూధరమున రజని రానున్నదంచు దెల్పంగ రాచె" అనడంలో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యానికి రాత్రిరాబోతున్నదనీ, "ఉదయలక్ష్మి అవతరించె" ననడంలో భారతదేశానికి స్వాతంత్ర్యోదయము కానున్నదనీ సూచిస్తాడు కవి.

మహతీగేయాలలో కూడా ఈ జాతీయోద్యమ ప్రభావం తేటతెల్లమవు తుంది. వీటిల్లోని గీతాలలో ఏకేశ్వరుడిని "విశాల నవభారతలోకేశుడిగా[2]" గానుతించడం, భారతావనీ పురాణమహితాశయ పరిపూరకుడి[3]గా కీర్తించడం జరిగింది. "భారతజనని స్వేచ్ఛాగగన వీథీ విహారిణి[4]"గాను, స్వతంత్ర కిరణ స్వర్ణారుణ కంకణకటక కలాపినీ[5]" గా సాక్షాత్కరించింది. "ప్రియ భారత జనయిత్రీ, నిత్యభాగ్యశుభవిధాత[6]" అన్న దేశస్తుతీ జాతీయోద్యమ ప్రభావితమే. కృష్ణశాస్త్రిగారి "జయజయజయ ప్రియభారత జనయిత్రీ" అనే గేయం జాతీయభావాన్ని సుస్పష్టం చేసే గీతాలలో విశిష్టమైనదీ, ముఖ్యమైనదీ. ఇక్బాల్, రవీంద్ర, బంకించంద్రుల గీతాలకంటే ఏ విధం గానూ తీసిపోక భావసౌందర్యంలోనూ రచనాసౌందర్యలోనూ వాటిని మించ గలిగినదని సహృదయుల అభిప్రాయం. "సస్యామల సుశ్యామచలచ్ఛే లాంచల", "వసంతకుసుమలతా చలిత లలిత చూర్ణకుంతల" అనీ తన హృదయాశయాల షారాణితో రక్తిపసు పొందిన పాదాలు కలిగినదిగానూ భరతమాత మనోహర రూపాన్ని వర్ణించి తన మధురగేయాలు ఆమె "సుందర చరణాలను చుంబిస్తాయంటాడు. 1936 నవంబరు 'ప్రతిభ' సంచికలోని 'త్రివర్ణపతాక మన్న గేయంలో భారతీయపతాకాన్ని "కౌదమచుక్కల దండ కొసల పఱచిన జెండా"గా గణువంపుగగనమే ఒరసి ఆడింది. "సంచె వన్నెలనిండా సాగిప్రాకింది అని" తరుణ తంబి కిరణభరణంగా వెలుగు పొడుపు కొండ నిలిచిపించింద"నీ ఎంతో ఉదాత్తంగా చిత్రిస్తాడు కవి.

1938లో కాకినాడలో జరిగిన తూ. గో. జి. విద్యార్థి మహాసభలో సీతాన అనసూయలుగానం చేసిన యువపతాక గేయంలో విద్యార్థి ఫెడరేషన్ వారి స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయాశయాలని కూర్చిన గీతంగామలిచి "యుగయుగాల పీడకలలు సొగయ జేయు సంకెలలు తెగనివికావంటూ" మ్రోల ధగధగా స్వతంత్ర విభాతాకాశంలో అరుణారుణతార పొడుస్తుందనీ, ముందుగలదు మనజాలకి ముక్తి అమరజీవరక్తి" అని భవిష్యద్దర్శనం చేస్తారు.

---

1. కవికుమార — కృష్ణపక్షం — పుట 2,3,4,5,6
2. మహతీకీర్తనలు — " 10,28,64,64,60

## కృష్ణశాస్త్రి చిత్రణలో స్త్రీ :—

భావకవిత్వలక్షణాలలో స్త్రీ ఉదాత్తచిత్రణమొకటి. భావకవులు స్త్రీ బాహ్య సౌందర్యానికి కాక అంతరంగిక సౌందర్యానికి ప్రాముఖ్యాన్నిస్తారు. వారి దృష్టికి ఆమె సౌందర్యం అధిభౌతికంగానే భాసిస్తుంది. భౌతిక వాంఛల కతీతమైనది వారి ప్రణయభావన.[2] రాయప్రోలువారి "అమలిన శృంగారం దీనినే స్పష్టంచేస్తుంది. తన ప్రేయసినీ ప్రణయదేవతగా భావించి పూజ్య భావంతో ఆరాధించారు. ప్రాచీన భారతీయ వ్యవస్థలో పురుషుల అఖండ గౌరవ ప్రపత్తులందుకున్న "స్త్రీ" అనేక కారణాలవల్ల మధ్యయుగ సామాజిక వ్యవస్థలో పురుషుల భోగవస్తువుగా మారిపోయి ఆనాటి కవుల చిత్రణలో కూడా నఖశిఖపర్యతం అంగాంగీవరనలతో భోగ్యవస్తువుగానే చిత్రింపబడింది. ఆంగ్లకాల్పనిక కవుల, రవీంద్రకవీంద్రుడి చేత ప్రభావితులైన భావకవుల చిత్రణలో "స్త్రీ" అత్యున్నత స్థానాన్నధిష్ఠించింది, భావకవి సామ్రాట్టు ఊహాప్రేయసి ఊర్వశిని తారగా దివ్యమందారసుమంగా, మోహినీహాస మల్లీ ప్రఫుల్లరుచిగా, శ్రీలలితవైజయంతీ పరిమళంగా, హరజటాపారిజాత లతాంత మధువుగా, త్రిజగతీపతి కోటీర దివ్యరత్నరాజినేలు వజ్రాలతురాయిగా, మఘవమస్తకమకుట మాణిక్యరాజ్ఞిగా, ఆమె దివ్యసౌందర్యాన్నభివర్ణిస్తాడు. వసంత విలాస మాధుర్యంగానూ, ఉషఃకల్యాణ లావణ్యంగానూ ఆమె అభౌతిక సౌందర్యాన్ని వర్ణిస్తాడు. ప్రేయసి "శ్రీవిలాసహాసలేశాలనందుకునేటందుకు అరని వెలుగును తన గీతికాంతరాలలోనిముడ్చుకుని "రమ్యహిమవాలుకాచ్ఛ నీరాజనంగా పూజిస్తానంటాడు. ఇలా ఊహాప్రేయసిని మహోన్నతంగా భావించి తీర్చడమేకాక సాధారణ స్త్రీ భావనలో కూడా అంతటి పరమోదాత్త ఆరాధనాభావాన్ని ప్రదర్శిస్తారు కృష్ణశాస్త్రి. "స్త్రీ" అన్న ఖండికలో వివిధ దశలలో సాక్షాత్కరించిన ఆమెను ఇలా వర్ణిస్తారు ... దరహాస "పారి జాతముల్లని భావికాల భర్మాంశుమాలని" కుమారిగా తెస్తుంది. 'కలికి'గా "వలన్నలగ్న స్వర్ణలావణ్యకలశితో కల్యాణ కలహంసి"లా కదలివస్తుంది. సహచరిగా సుమారమగు పదాలనిసుంత మరలించి విరియోవరుల దారి నడిపిస్తూ "తెరుపుపై చలువపందిరి నీడలనమరించి మజిలీలనేర్పరుస్తుంది. దయావతిగా అశ్రుతుందిల భాండాన్ని తీసుకుని జీవనరణంలో కలిగిన వ్రణాల నెత్తురుచాళ్ళని కడుగుతుంది. నట్టింటి పరిమళ స్నేహదీపాన్ని వెలిగించి

---

1. "నీపుతొలిప్రొద్దు సుసుమంచు" —
2. "ప్రేయసి సోయగమ్మనకు లేదు శరీరము"

కన్న తల్లిగా అభయాంక పర్యంకాన్ని పరచి వాత్సల్య భరగీతినాలపిస్తుంది ; పురుషుడికి ఆమె ప్రాణదాత్రి, హృదయనేత్రి, జపము - తపము జలధిలోతూ కూడా. ఆమె సనాతన నిత్యనూతన కూడా, ఓరిమి, మౌనమూర్తి అయితే పురుషుడు కూరిమి, మాటవంటివాడు.[2] పురుషుడు "విరుల తోటలోని పవడపు గులాబి మొక్క"[3], "వలగ్నలగ్న శ్రీ చాంపేయ మధుపాత్రతో సతి తీయని సంక్రాంతిలక్ష్మిలాగా తోస్తుంది ఆయనకి. "అందరి కలిమినాది. ఎవరికల్మి వారిదను అవధి కలదు. కరుణ కావలి ఈవలి గట్టులేదు.[5] అంటూ విశ్వ మానవ సమభావన, విశాలదృక్పథమూ బోధించే సుప్రియ, తమ సౌందర్యా -నురాగ బద్ధులైన ప్రియులని దివ్యసౌందర్యమూర్తియైన భగవత్ప్రణయోన్ముఖులిగా చేసిన త్యాగమూర్తులైన 'ధనుర్దాసు'లోని 'హేమాంగిని'[6] 'సాయుజ్యం'లోని 'మల్హాణి'[7] కృష్ణశాస్త్రిగారి స్త్రీ ఉదాత్త చిత్రణకి ప్రతీకలుగా నిలుస్తారు.

మునిమాణిక్యంగారి 'కాంతం'తో తులతూగుతుంది. కృష్ణశాస్త్రిగారి 'సుబ్బమ్మవ్వ'[8] హాస్యరసస్ఫోరతకి ఆలంబనమై జానపద ముగ్ధప్రణయిని వీరమ్మ" కరుణగాథ శ్రోతల హృదయాలనార్ద్రం గావించకమానదు. విప్రనారాయణలోని 'దేవదేవి' సౌందర్య స్వాతిశయాలు చివరిలో విప్రనారాయణుడి మీది ప్రణయ విరహాలు అత్యుత్తమంగా భాసిస్తాయి. 'అన్వేషణ'లోని గోపిక, కృష్ణాష్టమిలోని రాధ, గోపికలు మధురప్రణయా భావనకి ప్రతీకలు, 'గుహాండి'లోని 'సీత' ప్రకృతిప్రీతిని, సరసహాస్య చతురతనీ పరులలోని సుగుణాలను గ్రహించగల నేర్పరితనాన్నీ కలిగినట్టివి.

---

1. స్త్రీ — ఖండిక — పల్లకి సంపుటి — పుట — 44,45
2. మాట - వకానం " " 89,70
3. నా విరులతోట కృష్ణపక్షం " 44
4. సంక్రాంతి పల్లకీ " 11
5. సుప్రియ - బుద్ధభగవనుడు " " 87
6. ధనుర్దాసు ధనుర్దాసు సంపుటి "
7. సాయుజ్యం " "
8, అవ్వబిరుసాళ్ళలో తప్పిపోయింది, అవ్వబస్సు ప్రయాణం బహుకాల దర్శనం సంపుటి
10. విప్రనారాయణ యక్షగానం.

## వ్యుత్పన్నత :

కృష్ణశాస్త్రిగారి వివిధరచనలూ ప్రాచ్యపాశ్చాత్య, ప్రాచీన నవీన సాహిత్యాలపైన ఆయనకున్న అభిరుచీ అభిమానాలనేకాక వాటిపైనున్న అనంతమైన పరిజ్ఞానాన్ని కూడా ప్రతిఫలిస్తాయి.

'అప్పుడు పుట్టిఉంటే' పుష్పలావికలు, 'సువాసనద్రవ్యాలు' అనే వచన రచనల్లో ఆయన కల్పించిన ఆహ్లాదకరమైన సుందరవాతావరణం, సందర్భానుగుణంగా ఉదహరించిన ప్రబంధాలలోని పద్యాలు, ప్రబంధ సాహిత్య ప్రగాఢ పరిచయాన్ని వ్యక్తంచేస్తాయి. ప్రబంధాల నాధారంగా చేసుకుని వ్యక్తుల్నీ, కవుల్నీ, పుష్పలావికల్నీ వారి రూపరేఖావిలాసాలనీ వర్ణించడం లోనూ, వివిధ దోహదక్రియల్నీ సాధికారంగా వివరించడంలోనూ, నర్మ గర్భోక్తుల్ని వర్ణించడంలోనూ ఆయనకున్న వ్యుత్పన్నత ప్రస్ఫుటమవుతుంది. మేఘసందేశం "విశ్రాన్తస్య" అన్న శ్లోక వివరణవల్ల కాళిదాసవాణి ఆయన కెంతగా వంటబట్టిందో సువ్యక్తమవుతుంది.

మహతీకీర్తనలలో రవీంద్రుడి మార్మికతా కవిత్వపుఛాయలు, వెంకట పార్వతీశ్వర కవులకృతుల, కృష్ణపక్ష ప్రవాస ఊర్వశీ కావ్యఖండికలలో ఆంగ్లకాల్పనిక కవులైన వర్డ్స్‌వర్, కాల్రిడ్జి, బ్లెక్, షెల్లీ, బైరన్, కీట్సు మొదలైన కవుల రచనల ప్రగాఢముద్ర స్పష్టంగా కనపడుతుంది. 'పల్లకీ, కావ్యసంపుటిలోని హాఫీజ్, ఉమర్‌ఖయ్యాం ఖండికలు సూఫీసాహిత్యావగాహ నని వెల్లడిస్తాయి. భక్తిరసాత్మక నాటకల్లో వైష్ణవమతాభినివేశము స్పష్ట మవుతుంది. మధురభక్తి ప్రపూరితాలైన 'కృష్ణాష్టమి' 'యమునావిహారి' వంటి నాటికలలో చైతన్యుడి మతపరిజ్ఞానం ప్రకటితమవుతుంది. శ్రవ్యనాటికల్లో క్షేత్రమహాత్మ్యదుల వివరణలవల్ల వాటిని గురించిన జ్ఞానం తేటతెల్లమవు తుంది. శ్యామపర్ణిభూమిక ఏకాంతసేవ పీఠిక, పాతికేళ్ళ తెలుగు కవిత్వాలలో చేసిన సాహిత్య విమర్శలోని మల్లార్మీ, పోప్, క్రోచే, బుద్ధదేవబోస్, టాగూర్ ఇత్యాదుల సాధికార ఉపపత్తులు కృష్ణశాస్త్రిగారి మహుముఖీన ప్రజ్ఞాపాండి త్యాలకి నిదర్శనాలు. బసవరాజు, అన్నమాచార్లు, గురజాడల సాహిత్యంపైన ఆయనకున్న అవగాహనప్రీతినీ అభివ్యక్తంచేస్తాయి. వారిపైన ఆయన వ్రాసిన వ్యాసాలు, తేటివలపులోని మల్లిక విరహం రుక్మిణీ విరహం ధూర్జటికాళహస్తీ శ్వర క్షేత్రమహాత్మ్యపద్యాల వ్యాఖ్యాన ప్రాయమైన వివరణలూ మొదలైనవి ప్రాచీన కవుల సాహిత్య మెంతగా ఆయనకు కరతలామలకమో తెలియచేస్తాయి.

ఇలా కృష్ణశాస్త్రిగారి అనంతమైన వ్యుత్పన్నత నావిష్కరిస్తాయి ఆయన వివిధరచనలు.

## వర్ణనావైవిధ్యం :

కృష్ణశాస్త్రిగారి విభిన్న రచనలలో ప్రకృతిపరమైనవి, వ్యక్తిపరమైనవి, ఋతువర్ణనాదులు గోచరిస్తాయి. ప్రకృతివర్ణనలలో ఆయన సహజ భావుకత ప్రస్ఫుటమవుతూంటుంది.

“సంజముద్దుమొగంబు గెంజాయగప్పఁగన్నులల్లన నరవిచ్చి గగన వీధి మెల్లగా జల్లగా సాగు మేఘాల”నీ[1], “తుది సందె చీకటి కాటుక విలీన -మైపోవు రాజమార్గాలనీ”[2] “గోపురాన అవలివైపున కోనేరున్నది, కోనేరు కావలివైపున పాలాబూ - తోపులూ ఉన్నా”యంటూ కొలనులనూ, పుణ్య క్షేత్రాలలోని ప్రకృతిసౌందర్యాన్నీ, “తెలుగు తల్లి మెడ తారహారమే గౌతమి గోదారీ”[4] “గుణ భద్రా తుంగభద్రా”[5] అంటూ నదులన్నీ, “చిత్రకూటం సందె చీకట్లలో పెద్ద ఏనుగులాగ, ఒరిగిపోయిన నల్లమేఘంలాగ కనపడు తుంది”[6] అంటూ పర్వతవర్ణనలలోనూ నిసర్గమనోహరమైన భావుకతతో విలసిల్లే ప్రకృతి వర్ణనావైదగ్ధ్యం దీపిస్తుంది.

“కాలువ ఒడ్డున ఒదిగి నీడ చూసుకునేదో
చేలనడుమ పడచులాగ చేయెత్తి పిలిచేదో
కొండప్రక్కనిలిచేదో-తోటవెనుక కాస్త కాస్త తొంగి తొంగిచూసేదో,
ఏదో ఒక పల్లె, అది ఏడుంటేనేం”[7] అంటూ తెలుగు పల్లెల సహజసౌందర్యా-నికి భావుకతతో వాక్చిత్రాన్ని నిర్మిస్తారు.

“మిన్నంతా నీ తేరువానదేవుడా
మేఘాలు గుర్రాలు వానదేవుడా” అంటూ వర్షర్తువర్ణనా

---

| | | | | |
|---|---|---|---|---|
| 1,2 | కృష్ణపక్షం — | అతని పాట — | పుట — | 28 |
| 3. | పుష్పలావికలు | కొలెల కొలను | ” | |
| 4. | గౌతమి నాటిక — | ఏటాది పొడుగునా సంపుటి | | |
| 5. | ‘ఏటాది పొడుగునా’ ” | | ” | పుట 104, 105 |
| 6. | గుహుడు ” | | ” | |
| 7,8,9 | ఏటాది పొడుగునా ” | | ” | ” 79,94,124 |

## ఛందశ్శిల్పము – ఛందోవైవిధ్యము

భావానుగుణమైన, సందర్భోచితమైన ఛందోప్రయోగంలో కృష్ణశాస్త్రి గారు బహునేర్పరులు. ఆయన రచనలలో అనంతమైన ఛందోవైవిధ్యం ద్యోతకమవుతుంది. ఆయా సందర్భాలకి తగినట్టు భావాభివ్యక్తికుచితమైన ఛందస్సుని ఎన్నుకోవడంలో ఆయనకాయనే సాటి.

కృష్ణపక్షంలోని తొలిగేయం "ఆకులో ఆకునై" అనేది మాత్రాఛందస్సులో సాగితే గురజాడని స్ఫురింపచేస్తూ "మహాకవి" అన్న ఖండిక ముత్యాలసరాల్లో రచింపబడింది. "చుక్కలు" అన్న ఖండిక ముత్యాలసరాల్లో వ్రాయబడినా 'మత్తకోకిల' నడక స్ఫురిస్తుంది. 'అన్వేషణ'లో పృచ్ఛకురాలి ఉత్కంఠని సూచిస్తూ ఉత్తరోత్తర వేగవంతమైన కందం, ఉత్పలమాలలను వ్రాసి తర్వాత మందగమనంగా సాగే తేటగీతి వ్రాయడం గతానుభవంలోకి మళ్లిన గోపిక మానసికస్థితిని సూచిస్తాయి.[1] మనోభావాలని వ్యజించే ఛందస్సుని వాడడం ఆయన రచనలలో బాగా కనపడుతుంది.

"ఎలదేటి చిరుపాట సెలయేటి కెరటాల బడిపోవు విరి కన్నెవలపు -వోలె"[2] మొదలైన పద్యాల్లోని దీర్ఘాక్షర, హ్రస్వాక్షర విన్యాసాలు పద్యాలకి చక్కని లయహొయలని సంతరిస్తూ భావాన్ని వ్యక్తంచేస్తాయి.

సమాసరచనా ప్రౌఢితోనూ, నుడికారపు సొంపునీ కలిగి ధారాశుద్ధితో విరాజిల్లుతాయి ఆయన వృత్తాలు

"నీ నిటలోగ్రపాపక కనీనిక క్రకచ్చ లయాగ్నికీల"[3]

"ఒక కనుగ్రీష్మ భీష్మ కుతుపోగ్రతరార్యమ మండలము"[4] మొదలైన సంస్కృత సమాస ఘటితంగానూ, "తానే నాకయిస్వామి వచ్చెనట బృదన్వీడి", "తావులతోడ తేనియల ధారలు చిప్పిలు వేణుగీతికారావము

---

1,2 అన్వేషణ - కృష్ణపక్షం సంపుటి - "తలిరాకు జొంపముల - కందం
"కారుమొయిళ్ళ కాటుక" ఉత్పలమాల
"అది శరద్రాత్రి... ..." - తేటగీతి

3. నిగమ శర్మ - పల్లకీ సంపుటి — పుట — 50

4. ధనుర్దాసు నాటిక — ధనుర్దాసు సంపుటి పుటలు — 24,25

తోడ" మొదలైన అలతి అలతి తెలుగు పదాల కూర్పుతోనున్న వృత్తరచనా వైఖరి కనపడుతుంది. "ఆపగసోగపాగల" మొదలైన అచ్చతెనుగు సమాసాలు, "భవల్లీలాలోల విలోచనాంచల తటీల్లేఖా చలల్లాస్యము" అనే సంస్కృత సమాసాలు ఆయన పద్య రచనా వైదగ్ధ్యానికి నికషోపలాలు. సహాధ్యాపకుడి సవాలుకు సమాధానంగా మాత్రాఛందో బద్ధమైనవేగాక ప్రాబంధికశైలితో కూడిన వృత్తరచనా పాండిత్యంతో 'తేటివలపు' ఖండికను వ్రాసారుట కృష్ణశాస్త్రిగారు।

ఈ విధంగా సంప్రదాయబద్ధమైన ఛందోరచనగావించడమే కాక భావాభివ్యక్తి కనుగుణంగా కొత్తపోకడలు కూడా ఆయన రచనల్లో విస్తృతంగా కనపడుతుంది. 'అతనిపాట' అన్న ఖండికలో పాటపూర్తికాలేదనే భావాన్ని స్ఫురింపచేస్తూ పాదాన్ని మధ్యలోనే ఆపేస్తారు -

"మొగముగంటి కనులుగంటి మొగిలుగంటి
పాట వినుచుంటి ... ..."[2]

అట్లాగే భావోద్వేగాన్ని సూచిస్తూ పాదాల్లో సరిపడనిమాటల్ని రెండు పాదాల మధ్య కూరుస్తారు - "వెదకివేసారి నా వెర్రి బ్రతుకెపుదేని
తుదిరేయి కను మూయునా
బేలనై
నిదుర బరువుల క్రుంగునా."[3]

దుఃఖం కలిగినప్పుడు తలచుకుని తలుచుకునీ ఏడవడం, అది అతిశయించే కొద్దీ మాటరానిస్థితి సరభవించడాన్ని సూచిస్తూ
"మరల గ్రుడ్డిరాతిరిపడు, మరల నోరు
కాని శ్రుతులేని లేని చీకటులు, మరల
మరల పాడిల్లు .. ... ..."[4] అంటూ పద్యపాదాన్ని మూడొంతులు వదిలేస్తారు.

---

1. కృష్ణశాస్త్రిగారు చెప్పినది - పెద్దాపురం స్కూలులో పనిచేస్తున్నప్పుడు వ్రాసినది.
2. కృష్ణపక్షం సంపుటి — పుట — 28
3. 'వెదకి వేసారి' ఖండిక-ప్రవాసం కృ.ప. సంపుటి " — 94
4. ప్రవాసం-కృష్ణపక్ష సంపుటి - 'ఇదనితాంత, ఖండిక " — 97

"మనకింక నిద్రలేదు - వీల్లేదు
మనకింక ఇల్లులేదు - అక్కర్లేదు"[1] అంటూ లక్ష్యసాధనలోని తీవ్రతని వ్యక్తపరుస్తారు.

"మందికృత మహాయుగం
ముందున్నది ముందున్నది
ముందున్నది మందేమరి
మందే యువ మహాయుగం"[2] అంటూ ఉజ్జ్వల భవిష్యత్తును మున్ముందుంటూ నొక్కివక్కాణిస్తారు.

"పీతలాంటి నడక మన
తాతల్ది తండ్రుల్ది
రోత ! రోత ! రోత !"[3] అంటూ భావావేశాన్ని వ్యంజింపజేస్తారు. ఇలా వచన కవితల్లో కూడా ఒక విలక్షణతని చూపించగల ప్రజ్ఞా సంపన్నులు కాబట్టే పరిణత పద్యశిల్పులుగా సాహితీ వేత్తలచేత నుతింపబడుతున్నారు.

## హృద్యగద్య రచనా నైపుణ్యం :

కృష్ణశాస్త్రిగారి గద్యం కూడా పద్యంలాగే హృద్యంగా ఉంటుంది. కాటూరి వేంకటేశ్వరరావు, పాలగుమ్మి పద్మరాజు మొదలైన కవులు, విమర్శకులూ, రసజ్ఞులైన పాఠకులూ ఆయన వచనరచనా వైదగ్ధ్యానికి ముగ్ధులై 'పరిణత శిల్పి' (పర్ఫెక్షనిస్టు)గా నుతించారు. పద్యరచనలో పదాలకూర్పు పట్ల ఎంతటి మెళుకువని చూపుతారో వచనరచనలోనూ అంతటి శ్రద్ధనీ చూపుతారు. ఏ పదం పక్కన ఏ పదాన్ని చేరిస్తే అది శోభస్తుందో, ఏ సందర్భంలో ఏ పదాన్ని వాడితే రాణిస్తుందో, ఏ భావానికెటువంటి వాక్య విన్యాసం సరిపడి పాఠకుల చిత్తాన్ని ఆకట్టుకుంటుందో ఆయనకి చాలాబాగా తెలుసు. ఈ విషయాన్నే ఆయన ప్రతిపదానికీ రంగూ రుచీ వాసనా ఉంటాయి. సమానార్థక పదాలలో కూడా వర్ణవిన్యాసంవల్ల అవి అందించే

---

1. 'జీవన శంఖం' 'పల్లకీ' సంపుటి — పుట — 68
2,3 'యువగీతం' " " " 64

అనుభూతిలో తేడా ఉంటుంది" అంటూ "సువాసన, సౌరభం, సుగంధం, పరిమళం, ఆమోదం" అనే పదాలు ఒకే అర్థాన్నిచ్చినా "సువాసన పిలుపు వంటిది పదిమందినీ ఆకర్షిస్తుంది, సౌరభం పక్షివంటిది దిక్కు-దిక్కులా గాలి మీద పరిగెత్తుతుంది........" అంటూ అనుభూతి విశేషాలని వివరిస్తారు.

పద్యాల్లోలాగే గద్యాల్లోనూ పదాలను తూచితూచి వాడడం క్రియా పదాలని పునరావృత్తి చేయడం, భావానుగుణంగా భాషాపదాలని కూర్చడం, చిన్నచిన్న వాక్యాలలో అర్థాల్ని సుస్పష్టమయ్యేటట్టు చెప్పడం, అన్వయక్లిష్టత పదాడంబరత లేకుండా విషయాన్ని సూటిగా హృదయానికి హత్తుకునేటట్టు చెప్పడం, తెలుగు నుడికారపు తీయందనాలనీ, తెలుగుపదాల పరిమళల ఒయ్యారాలనీ చేకూర్చడం - ఇవన్నీ ఆయనని ఉన్నతశ్రేణికి చెందిన వచనరచయితగా చేస్తున్నాయి.

## కొసమెఱుపుల :

అత్యద్భుతమైన కొసమలుపులు కలిగిన 'ఓహెన్రీ' కథలు విలక్షణతతో ఒప్పారుతూ సాహిత్యజగత్తులో విశిష్టతని సంతరించుకున్నట్టే కృష్ణశాస్త్రిగారి వచనరచనలలోని చాలావాటిల్లోని కొసమెరుపు పఠితల చిత్తాలనాకట్టుకుంటుంది.

భూతనవర్తమానాలని సమాక్షిస్తున్నట్టు సాగిన 'మైలురాయి' వచనరచన మైలురాయి కంఠంతో "వొద్దురోయ్ నేనుదేవాతనవను" అన్న కొసమెరుపుతో ముగుస్తుంది. బూట్ పాలిష్‌లోని "నారయ్య కొడుకు చెప్పులుకుట్టడు......

...... నారయ్య గుడిసెకు ఎప్పటికైన వాడే మాసికలు వెయ్యాలి" అనే ముగింపులో కృష్ణశాస్త్రిగారి మానవాభ్యుదయం తపుక్కున మెరుస్తుంది. ఇల్లాగే రిక్షావాలాలోని "అహమ్మద్ అసలే ఉన్నతుడు. ఇప్పుడు వేదనా కిరీటంతో మరీ ఉన్నతుడయ్యాడు" అనేది యిక్కా గొప్పతనాన్నీ, కృష్ణశాస్త్రి -గారి వేదనా ప్రీతినీ తెలియచేస్తుంది.

"అప్పుడు పుట్టి ఉంటే నేనే పెద్దనై పుట్టిఉందును" అన్నది ఆ రచనకి కొసమెరుపు. సువాసన ద్రవ్యాల్లోని "ఆ కుంకుమకు అమ్మవారి చరణ సాన్నిధ్యము మరీ రక్తినిచ్చింది..........ఆ ద్రవ్యాలన్నీ తులసి నీటిలో దోప్పదోగినవి" అన్న ముగింపు శృంగారభావానలోంచి భక్తిభావానలోకి మళ్ళించేది. బహుకాలదర్శనంలోని "బహుకాల దర్శనం" అని అంటూన్న శ్రీరాముని కొస మాటలు కరుణరసపరిషిక్తమయి ఆ రచనకంతటికీ ఒక ఉదాత్తతని సంతరించిపెడ్తున్నాయి.

ఇలా ఇటువంటి కొసమెరుపులు రచనలవల్ల సహృదయులకి కలిగే అనుభూతులకి ప్రగాఢత్వాన్ని చేకూరుస్తాయి.

# పద – భావ చిత్రాలు – (Imageries)

కృష్ణశాస్త్రిగారు పదచిత్రాలని, భావచిత్రాలనీ గీయడంలో సిద్ధహస్తులు. ఆయన రచనలన్నిటిలోనూ అపూర్వమైన పదచిత్రణలు భావచిత్రణలు ఎన్నో కనిపిస్తాయి. పదాలని గూర్చిన సునిశిత పరిజ్ఞానంతో ఉదాత్తానుభూతులకి కూడా రూపకల్పనలను గావిస్తారు. అమూర్త భావాలకి మూర్తిమత్త్వాన్ని ఘటించగలరు. పదాలలోని వర్ణసంయోజనద్వారా భావాన్ని స్ఫురింప చేయడానికి "క్రౌర్యకౌటిల్యపంకంబు వలన మలినము" అన్న సమాసంలో మాలిన్యం యొక్క ఆధిక్యం వ్యక్తమవుతూ పదాలలోని వర్ణాల కూర్పు ద్వారా అంతకంతకీ పలుచబడినట్లు స్ఫురింపచేస్తారీవిధంగా 'క్రౌర్య' అనె మొదటి పదంలో రెండు సంయుక్తాక్షరాలు, 'కౌటిల్య' పదంలో ఒకే సంయుక్తాక్షరం, 'కలుష' అన్న పదంలో సంయుక్తాక్షరం లేకపోవడం 'పంకము'లోని పూర్ణ బిందువు సమాసానికి క్రమక్రమంగా సరళతని కలిగిస్తూ ప్రేమవలన క్రమ-క్రమంగా మనసు కోమలత్వాన్నిలా సంతరించుకుంటుందో సూచిస్తారు పద విన్యాసంద్వారా.

"ప్రళయకాల మహోగ్రఘియద జీమూతోరు గళ ఘోర గంభీర ఘెళఘెళార్భటులు" మొదలైన సుదీర్ఘ సమాసలు, వాటిల్లో పరుషంగా ధ్వనించే వర్ణాల విన్యాసం ఆభయానక స్థితియొక్క స్వరూపానికి శబ్దచిత్రాలనిగీస్తూ తద్విరుద్ధమైన ప్రశాంతమైన అనుభూతినావిష్కరిస్తూ సమాసాంతంలో మెరు-పేలా', చుక్కేలా' అనె చిన్న చిన్న పదాలు కల్పించి ప్రగాఢమైన నిరాశా తమస్సులో ఆశాకిరణాన్ని తళుక్కుమనిపిస్తారు. ఆయన 'ఊర్వశి' కావ్య-మంతా అమూర్తాలకి మూర్తిమత్త్వాన్ని కల్పించునదే! "త్రిజగతీపతి కోటీర దివ్యరత్నరాజినేలు వజ్రాలతురాయి'గా ఆమెను దీర్ఘసమాస ఘటనంతో వర్ణించి ఆమె ఔన్నత్యాన్ని, "పాతాళంపుటిరుకు సందుల దిగబ్రాక వెలుచు గాఢాంధకార రేఖగా తనదైన్యాన్ని విడివిడి పదాలలో చెప్పుకోవడం ద్వారా భావికంగా కూడా వారిరువురి అంతరం స్ఫురిస్తుంది. "ఆపగనోగ పొగల నెటు లౌదలజుటితో, ఎట్లుపెట్టితో ఆపయి ఓరగా నవ సుధాకర రేఖ తురాయి కాగ" అంటూ పరమేశ్వరుడి భావచిత్రాన్నావిష్కరిస్తాడు. "మసక మసక సంజె, ఉసురుసురును గాలి, గంగ జాలిమ్రోత, బెంగవల్లడిల్ల వడిన పడవ, అల్లన నిలుచుండు గుహుండు పదియు నాలుగేండ్లు" అంటూ రామవియోగానికి కుందే గుహుడితో పాటు ప్రకృతి సహవేదనకి భావ, పదచిత్రాలని గీస్తారు. "ఈ గంగ కెంత దిగులు - ఈ గాలికెంత గుబులు" అన్న దాంట్లో భావుకత రూపుదాలుస్తుంది.

# పద—పద బంధ విలక్షణత

కృష్ణశాస్త్రిగారు పరమసుకుమారమూ, సుందరమైన పదాలని వాడడంలో అనితరసాధ్యమైన ప్రతిభా పాటవాలు కలిగినవారవడము ఆయన కవితమాధురికి పట్టుగొమ్మ. పరమ సుకుమారమైన భావుకతకి తోడు పదలాలిత్యం మరింత వన్నెని చేకూర్చిందాయన కవితకి. పరుసవేది వంటి ఆయన హస్తస్పర్శతో సామాన్యపదాలు కూడా కొత్త సొగసులని సంతరించుకొని, ఆ పదాల అల్లిక -లోని జిగీబిగీ ఒక బాణీగా ఏర్పడి కృష్ణశాస్త్రి ముద్రతో విరాజిల్లుతున్నాయి. "ఆయన ఒక వాణీకీ బాణీకీ యుగకర్త" అన్నమాటలు యథాక్షరసత్యాలు. ఆయన కవిత్వంలో విస్తృతంగా మనకి కనిపించే పదాలు - తరులు, గిరులు పొదలు, రొదలు, సొదలు, కోయిలలు, మొయిళులు, ఇరులు గుబురు, చిరు -గాలులు, మల్లియలు, మధుపములు, సెలయేరులు, విరిజాజులు మొదలైన కోమలకాంత పదాలు, హవా, షరాబీ, ప్యాలా, ప్యారీ మొదలైన ఉర్దూ, పార్సీ పదాలు.

జలజలలు. గలగలలు, ఉసురుసురు, గుసగుసలు రుసరుసలు, విసవిసలు మొదలైన ధ్వన్యనుకరణ శబ్దాలు కూడా ఆయా వర్ణనాసందర్భాలలో అనుభూతి స్ఫోరకంగా ప్రయోగిస్తారు.

హాసవాసనాలేశాలు, గానపరిమళాలు, ఇరులగుసగుసలు, మూగకనులు, గొంతు చీకటి వంటి పదబంధాలలో విభిన్న ఇంద్రియాలద్వారా తెలుసుకో గలిగే రెండు విషయాల్ని కలిపి ఒక విలక్షణమైన అనుభూతినిచ్చే పదం బంధంగా కూర్చడం కనిపిస్తుంది. వ్యతిరేకార్థకాలైన రెండింటిని కలిపి ఒక వింత అనుభూతినావిష్కరించే పదబంధాలు - కాల్చుహాయి, తేల్చుభారము, వేదనాసుఖము, సౌఖ్యజ్వాల, కాలుచల్లదనాలు, కనలుతియ్యదనాలు మొదలైనవి. వేదనాకిరీటము, రేలరాంగి, విశ్వవీణాగళము మొదలైన పదాబంధాలు క్రొత్తవి. 'తారలే కనువిచ్చి, తమములే శ్రుతివిచ్చి' అనే నూత్నభావస్ఫోరక పదాలు, 'గళరవము' వంటి శ్లేషార్థక పదాలు వారి కవితలో భాసిస్తాయి. 'కుళ్ళాయి', 'తురాయి' హుమాయి మొదలైన పదాల మీది ప్రీతి కనప-డుతుంది. తెలిరైక, వెలిపైట, కోక, రేక, సంజెగాలి, గొబ్బిళ్ళు, ముంగిళ్ళు గోరింక, గోరింట మొదలైన అచ్చ తెనుగు పదాలు ఆయన చేతిలో వింత అందాన్ని సంతరించుకున్నాయి.

# మనోవిశ్లేషణ — వ్యక్తిత్వము

రచయితల మానసపుత్రికలైన రచనలు వారి వారి వ్యక్తిత్వాలని ప్రతిబింబిస్తూ మనోవిశ్లేషణకెంతైన ఉపకరిస్తాయి. అందులోనూ ఆత్మాశ్రయత్వమే ప్రధానలక్షణంగా కలిగి తమతమ అనుభూతులనే ఆలపించిన భావకవుల రచనలు వారి మనోభావాలకి దర్పణంవంటివి. భావకవి సామ్రాట్టయిన కృష్ణశాస్త్రిగారి రచనల్లో మరింత స్పష్టంగా ఆయన మనోభావాలు, వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. అయన జీవిత కవిత్వాలని పరిశీలిస్తే హరివిల్లులాంటి ఆయన మనోవ్యక్తిత్వాలు సాక్షాత్కరిస్తాయి. దుఃఖాన్నీ విరహాన్నీ, వేదననీ, ప్రణయాన్నీ భక్తిన్నీ కృష్ణపక్షాదికావ్యాలలో కావ్యవస్తువులుగా స్వీకరించినా నిజజీవితంలో సరదాసంతోషాలనీ, హాసపరిహాస ప్రసంగాలతో కూడిన మిత్రగోష్ఠులనీ, అతిథి-అభ్యాగతుల ఆదరసత్కారాలనీ తనవిగా మలచుకున్నారు. స్వభావరీత్యా హృదయవాది అయినకృష్ణశాస్త్రిలో సంఘసంస్కరణపైన, మానవతపైన అచంచల విశ్వాసం గోచరిస్తుంది. ఆయన కవితల్లోలాగానె వేషభాషల్లో కూడా సౌందర్యాత్మకత ద్యోతకమవుతుంది. భక్తి-రక్తి, భావుకత-సామాజిక స్పృహా, సగుణ నిర్గుణోపాసనాద్వైతపథమూ మొదలైన ద్వంద్వ ప్రవృత్తితో కూడిన ఆయన వ్యక్తిత్వం భాసిస్తుంది వివిధ రచనల్లోనూ.

కవి పండిత విమర్శకులలో ఏ బహుకొద్దిమందిలోనో ఉండే వక్తృత్వ లక్షణం ఆయనలో పరిణతదశలో ప్రస్ఫుటమవుతుంది. భావకవిత్వ ప్రచారా-నికి ఆయనచేసిన కృషిలో ఊరూరూ-నాడు-నాడూ సంచారంచేస్తూ సభలలోని వందలు వేలకొద్దీ శ్రోతలని మంత్రముగ్ధులు కావించేటట్లు ఉపన్యసించడంతో పాటు భావగీతాలాపన చేయడమొకటి. నానారాజసందర్శనం చేసిన శ్రీనాథుడాయనలో సాక్షాత్కరిస్తాడు.

హరిజనోద్ధరణ సాంఘిక సంస్కరణాభిలాషనీ వ్యక్తంచెయ్యడమేకాక స్వయంగా ఆచరించి సంఘంచేతా బంధువర్గంచేతా వెలివేయబడినా చలించని మేరునగధీరుడు. అటువంటి ధైర్యస్థైర్యాలనే భావకవిత్వ ప్రచారంలోనూ చూపిస్తారు. భావకవితనీ, దాని ప్రతినిధిగా తననీ సాంప్రదాయవాదులు తీవ్రంగా విమర్శించి దూషించినా లక్ష్యపెట్టక రచనలద్వారా, ఉపన్యాసాల ద్వారా ప్రచారం సాగించిన ధీరప్రవృత్తులు. కాలంతోపాటు ఎదుగుతూ తదనుగుణమైన చిత్తసంస్కారంతో భావాలని మలుచుకుంటూ రచనలను సాగించి భావ, అభ్యుదయ, విప్లవ కవులుగా పేర్కొనబడే మూడుతరాల

కవులకి ఆదర్శప్రాయులయ్యారు. "హృదయం లేనివాడు కవికాడు. దీనుల యెడ హృదయం ద్రవించనివాడు శాస్త్రిగారిలా మహాకవి కాజాలడు" అన్న దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారి మాటల్లో కృష్ణశాస్త్రిగారి మానవతకి పరమప్రమాణాలు. కృష్ణశాస్త్రి వివిధరచనలు ఆవిష్కరించే ఆయన వ్యక్తిత్వపు ఛాయలలో ప్రాచీనతపైనున్న మమకారం, నవ్యతపైని ఆదరం సౌందర్య పిపాస, అన్వేషణ - భక్తిభావన, మానవతావాదం, అభ్యుదయ భావన, పరిహాస కుశలత, సామాజిక స్పృహలు స్ఫురిస్తాయి.

## ప్రాచీనతపైని మమకారం

కృష్ణశాస్త్రిగారి ఏడాది పొడుగునా, గౌతమి నాటికల్లోనూ, వచనరచనలైన అవ్వతిరునాళ్ళలో తప్పిపోయింది, అవ్వ బస్సుప్రయాణం, మా ఊరు పోయింది, మా ఊళ్ళో వీథి అరుగు, మైలురాయి మొదలైన వాటిల్లో ఈ ప్రాచీనతపైని మమకారం వ్యక్తమవుతుంది.

పుష్పలావికలు, సునాసనద్రవ్యాలు, అప్పుడు పుట్టిఉంటే లాంటి వాటిలో ప్రబంధకాలానికి చెందిన సంస్కృతినీ, ప్రబంధప్రీతినీ, సౌందర్య ప్రియత్వాన్నీ ఆవిష్కరిస్తూ[1] "చివరికి అనిపిస్తుంది ఆ రోజులే బాగుండేవేమిటి చెప్మా![2] అనీ, "అప్పుడు పుట్టి ఉంటే ఇవన్నీ చూసేవాడిని గదా!"[3] అని ప్రాచీనతపై మమకారాన్ని వెల్లడిస్తాడు సహజంగా సౌందర్య ప్రియుడూ భావకుడూ అయిన కృష్ణశాస్త్రి నవ్యతపైని ఆదరం :- ప్రాచీనతపైనున్న ఆదరం నవ్యతపైని అనాదరాన్ని కలిగించలేదు కృష్ణశాస్త్రిగారికి. ఆయన దృష్టిలో కవికి పాతకొత్త అనే భేదం లేకుండా జీవమున్న వాటన్నిటితోనూ సంబంధముంటుంది. దీనినే ఆయన "పాతకొత్తల కౌగిలింతల ప్రసవమగు

---

1. మల్లీశ్వరి చలన చిత్రంలోని "పిలచిన బిగువటరా" అనే జావళీ రచనా కృష్ణపక్షాది కావ్య, ధనుర్దాసాదినాటికల, పుష్పలావికలా మొదలైన వచనరచనల్లోని ప్రబంధసాహిత్యానికి చెందిన పద్యాలనుటంకించడం, ఆ రీతిలో వృత్తపద్య రచన గావించడం.

2. పుష్పలావికలు — పుట — 1

3. అప్పుడు పుట్టిఉంటే " 74

బంగారుకాంతులు"[1] అని మహతీగీతంలోనూ వ్యక్తంచేస్తారు. మైలురాయి కంఠంతో "ఇప్పటి కీర్తనలే ఇంకోలాగ వినపడుతున్నాయి. నాకు ఇవీ బాగానే ఉన్నాయి"[2] అనడం, ఏడాదిపొడుగునా, గౌతమిలోని భావగీతాలాపనలు, కాలంతోపాటు మారిన సాహిత్యరూపాల్ని కూడా సంపూర్ణావగాహనతో ఆదరించడం ఆయన కవితల్లో మనకి స్పష్టమవుతుంది. కృష్ణపక్షంలోని ముత్యాల సరాలలో కూర్చిన ఖండికలు,[3] "ఆకులో ఆకునై" మొదలైన మాత్రాఛందస్సులో సాగిన కవితలు, నిశ్రేణి, పల్లకీ సంపుటలలోని వచన కవితలు పై లక్షణాన్నే బలపరుస్తాయి. రేడియో నాటికలని ప్రసారం చెయ్యడం, సినీగీతాల్ని వ్రాయడం, కాలంతోపాటు మారక బూజు పట్టిన సంప్రదాయాలని నిరసించడం, సాంఘిక సంస్కరణోద్యమాలలో పాల్గొనడం నవ్యతపైని ఆదరాన్ని సువ్యక్తపరుస్తాయి.

## పరిహాస కుశలత

సామాన్యులనీ ధీమాన్యులనీ కూడా సమానంగా ఆకట్టుకునేదీ అలరించేదీ హాస్యమూ పరిహాసమూను. కృష్ణశాస్త్రిగారిలో ఈ హాస్యప్రియత్వము, పరిహాస కుశలత మిత్రగోష్ఠులలోనేకాక రచనలలో కూడా మనకి గోచరిస్తుంది. లోకంలో ఆయనకి ఏడుపుకవిగా కృష్ణపక్షకావ్యరచనవల్ల పేరొచ్చినా దాన్ని మించిన పరిహాసకుశలత ఉందనే విషయం ఆయన మిగిలిన రచనలని పరికిస్తే వెల్లడవుతుంది. 'అమృతాంజనం' మీద ఆయన వ్రాసిన కవిత,[4] వేమన మకుటంతో వ్రాసిన పద్యాలు హాస్యరసస్ఫోరకాలు. "రాజు తఖ్తునెకె, రౌతు బాబానెక్కె, పల్లకీలనెక్కె పండితుడు, పిట్టగోడనెక్కె పిళ్ళారీ నాయుడు, విశ్వదాభిరామ వినురవేమ", "ఆరువేల కొంపలంటించినయ్యగారు, ఆరువేలవేలతని కప్పుగలడు, అతడుగాక మఱియెవ్వడారువేల నియోగి విశ్వదాభిరామ వినురవేమ" ఇలా వ్యక్తులపైనా, సమాజవ్యవస్థపైనా పరిహాసాలు, పరిహాసంతో కూడిన చురకలు ఆయన వేమన పద్యాలలో కనిపిస్తాయి.

---

1. 'మహతి' సంపుటి - గీతం
2. మైలురాయి - ఒహోకాలదచ్చిన సంపుటి - పుట 56
3. 'కృష్ణపక్షం' సంపుటి - మహాకవి, చుక్కలు ఖండికలు - పుటలు 26,51
4. ఆగండీ ఇటు ఆగండీ, ఆపంతమాటవిని సాగండీ" - అమృతాంజన ప్రచారం మీది వ్యగ్యం

అవ్వ బస్సు ప్రయాణంలోని "ఎంచక్కా ఒక మనిషిని చెరిపి చేయిస్తే మరి నాలుగుమూర్తులు తయారవద్దూ; హనుమానులూ",[1] "కొత్త తారు రోడ్డులా నల్లగా నిగనిగలాడుతూ నల్లఅద్దమనుకో!"[2] అన్న షాహుకారు లాపుమీదా, నలుపు రంగు మీదా విసర్లూ, వేణు కుంజమనే నాటికలోని "రంకెవేస్తూ అచ్చోసిన ఆంబోతులా, జంకులేక కారునల్ల యేనుబోతులా చింబోతులా"[3] అనడం "ఓమాటు మరిడమ్మ జాతరలో కత్తిసాముకాడ ఈలపాట పాడేను, అందరూ ఊరుకో! అమ్మవారికి తలనొప్పొస్తుందన్నారు"[4] అంటూ కొండయ్య ఆకారాన్నీ గాత్ర సౌలభ్యాన్నీ, గానమాధుర్యాన్నీ చెప్పడంలోనూ ఒక మనిషిలోని భౌతికలోపానెత్తి చూపి ఇతరులని నవ్వించ డానికికుదాహరణ. దీనికి గురి అయినవాళ్ళకి బాధని కలిగించినా మానవ నైజాన్ని ప్రతిబింబిస్తుంది. "కొరియా రణమ్మనుచు మలయా వ్రణమ్మనుచు"[5] అంటూ రేడియోలో వచ్చే వార్తలను గూర్చి పరిహాసోక్తిని విసురుతాడు కృష్ణశాస్త్రి. సంక్రాంతి ఖండికలోని ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుని పోతూన్న కవిని అతని భార్య "ఈ లోక భారమ్మ మీరే మోసేరే? సుక -మ్ముగా నడపలేరీ కాస్త సంసారమున్" అనడంలో సున్నిత పరిహాసము తళుక్కుమంటుంది. ఇటువంటి భార్యభర్తల సరస పరిహాస వైభవం "ఏడాది పొడుగునా", "గౌతమి" నాటికల్లోనూ గోచరిస్తాయి - "పెళ్ళిచూపుల కొచ్చినపుడిలాటి పాట పాడ లేదే? 'లంబోదర' పాట పాడేవుగాని" అని భర్తంటే "మిమ్మల్ని చూడగానే అది పాడబుద్దేసింది"[7] అనడంలో భార్యా భర్తల సరసత వ్యక్తమవుతుంది.

'బహుకాలదర్శనం'లోని "సుబ్బమ్మొదిన్ని చూడాలి-పల్నాటియుద్ధంలో నాయకురాలిగా నరకాసురవధ సమయంలో సత్యభామలా"[8] అంటూ అప్పడాలు తినడంలోని అనిడ ప్రతాపాన్ని చెప్పడంలో వరుసైన వారి పరిహాసప్రసంగం స్ఫురిస్తుంది. బహుకాలదర్శనంలోని హాస్యం ఉదాత్తమైన కరుణరసంతో పరిషిక్తమయిన ఉత్తమశ్రేణి హాస్యరసంగా చివరికి మలచబడుతుంది. 'మైలురాయి'లోని పరిహాసాలు సమాజంలోని కొన్ని సంప్రదాయలని, వ్యవ

---

1,2 అవ్వ బస్సుప్రయాణం - బహుకాలదర్శనం సంపుటి పుటలు 79,78
3,4 వేణుకుంజం - శర్మిష్ఠ సంపుటి - పుటలు - 173, 174
5,6 సంక్రాంతి ఖండిక - పల్లకీ సంపుటి - పుటలు - 8,9
7. గౌతమి , శర్మిష్ఠ నాటకాసంపుటి - పుట - 142
8. బహుకాల దర్శనం - పుట - 11

స్థలనీ వ్యంగ్యంగా విమర్శించేవి. విగ్రహారాధనపట్ల, నేటి మంత్రుల అనావశ్యకపర్యటనలనీ, స్వార్థంతో రాళ్ళని దేముళ్ళగా మలుస్తున్నతీరునీ విమర్శిస్తారు. 'ఇద్దరు సత్యవాదుల్లో'ని వ్యక్తులకు హరిశ్చంద్రం, ధర్మరాజు అని పేర్లుపెట్టడమే వ్యంగ్యంగా పురాణపురుషుల, మహాత్ముల పేర్లను పెట్టుకోవడంమీద విసురు. ప్రబంధసాహిత్యంలోని అతిశయోక్తులమీద, కల్పనల మీద వ్యంగ్యవిమర్శగా మాటలు మంచుకి గడ్డకట్టడం, నీళ్ళు ఆవిరికావడం[2] (ఎండల తీవ్రతకి) మొదలైనవి.

సంస్కారబలంతోగాని అర్థంచేసుకుని ఆశ్వాదించలేని పరిహాసప్రసంగాలు 'అప్పుడు పుట్టి ఉంటే'లోని కవులచలోక్తులు - "భట్టుమూర్తిని "ఏదీ సంగీతం లేకుండా పద్యం తిరిగి చదువు"[3] "మా బావగారు ప్రవరుడు గారు మాయాప్రవరుడుగాని"[4] మొదలైన వాటిని అర్థచేసుకోవాలంటే ఆయా కవుల కావ్యాలతో పరిచయముండాలి.

'గౌతమి', 'ఏండి పొడుగునా' నాటికల్లోని వదినామరదళ్ళ,[5] బావామరదల సరస సంభాషణలు,[6] సుబ్బమ్మ, పాటలు, వెంకమ్మల హాస్యప్రసంగాలు,[7] 'శ్రీ ఆండాళ్ళు'లోని విష్ణుచిత్తుడి శిష్యుల హాస్యప్రసంగాలు మొదలైన వాటన్నిటిలోనూ పరిహాస వైవిధ్యమనంతగా భాసిస్తుంది.

ఈ విధంగా అనేక రకాలయిన పరిహాసాలని తన రచనలలో పొందుపరచి అన్ని తరగతులవారినీ రంజింపచేస్తూ తన హాస్యప్రియాత్వానీ, పరిహాసకుశలతనీ ప్రకటిస్తారు కృష్ణశాస్త్రి.

---

1. బహూకాల దర్శనం — పుట 18
2. ఇద్దరు సత్యవాదులు — బహూకాలదర్శనం సంపుటి పుటలు 85,86,89
3,4 అప్పుడు పుట్టిఉంటే — పుటలు 72,69
5,6 శర్మిష్ఠనాటికా సంపుటి — పుటలు 114, 122
7. " — పుటలు 83-86, 101-106, 118-123, 132
8. శ్రీ ఆలడాళ్ళు నాటక - 'తిరుప్పావు' సంపుటి పుట 114-118

## నీరాజనం

భావనాలాలిత్యం, శైలీ సౌకుమార్యం ఆత్మానుభూతి ప్రగాఢతల త్రివేణీ సంగమైన తన కవితాప్రతిభతోనూ, అకుంఠిత దీక్షతోనూ భావ కవిత్వాన్ని ఆంధ్రసాహిత్య జగత్తులో అత్యున్నత పీఠాన్నధివసింప జేసిన కృష్ణశాస్త్రిగారి కవితావైశిష్ట్య వైదగ్ధ్యాలనీ, కృషినీ గుర్తించిన ప్రజా, ప్రభుత్వమూకూడా ఘనంగా సన్మానించి, ఉరు బిరుదాంచితులని గావించింది. "ఆయన పేరే కవితకు మారుపేరు" అంటూ ఎంతోమంది సమకాలిక సాహిత్య స్రష్టలూ-ద్రష్టలూ కీర్తించారు. తెలుగుదేశంలోని సహృదయ కవి పండిత విమర్శకులెందరో అనితరసాధ్యమయిన కృష్ణశాస్త్రిగారి మధుర వాణికీ, కాలంతోపాటు ఎదుగుతూ పరిణతనందిన కవితాతోరణికీ ప్రశంసా నివాళులర్పించారు. ఆ కృష్ణకవి చంద్రుడి యశశ్చంద్రికలు తెలుగునాట నాల్గు దిక్కులా వ్యాపించి సరసహృదయ చకోరాహ్లాదకరాలయ్యాయి.

## సన్మానాలు - బిరుదుప్రదానాలు

కృష్ణశాస్త్రిగారి అసాధారణ ప్రతిభనీ, అఖండ కృషినీ గుర్తించి 1940లో 'భావకవి చక్రవర్తి' బిరుదుతో భూషించడం జరిగింది.

1942లో నవభారత పక్షాన రాజమండ్రీలోని నవభారతిగురుకులం ఆవరణలో కృష్ణశాస్త్రిగారి సన్మానసభ నాలుగురోజుల వేడుకతో చాలా ఘనంగా జరిగింది. శివశంకరశాస్త్రి, అడవిబాపిరాజు, మల్లవరపు, ఇంద్రగంటి వేమల, జనమంచి, ముక్కపాటి మొదలైన కవులందరూ కృష్ణశాస్త్రిగారిని పల్లకీ నెక్కించి మోస్తూ దాలిపర్తి పిచ్చిహరినాదసర్వంతో పురవీథులలో ఊరేగించారట! గజారోహణంగావించారట. ఆ సన్మానసభలో ఆయనను 'కవీశ్వర శ్రీ' అనే బిరుదుతో సత్కరించారు.[1] 1933లో నవభారతపక్షాన ఆయన రచనలను కొన్నిటిని 'నిశ్రేణీ' సంపుటిగా వెలువరించడం జరిగింది.

నవ్యాంధ్రసాహిత్య పరిషదావరణలో (ఏలూరు) 1942లో సన్మానించారు. 1957లో హిందూకాలేజీ గుంటూరులో విద్యార్థి రచయితల సంఘం ఆయన షష్టిపూర్త్యుత్సవాన్ని చేసారు. సాహిత్యలవారి ఆధ్వర్యాన కాకినాడలో

1. కృ.శా.గారి మేనకోడలి కుమారుడు శ్రీ రమేశ్ చంద్రదత్‌గారి ద్వారా తెలిసిన విషయాలు.

11.8.66న ఎమ్. వి. శాస్త్రి అధ్యక్షత్వంలో ఆయనకి గొప్పసన్మానం జరిగింది. 1971లో విజయనగరం మహారాజా కళాశాల శతవార్షికోత్సవ సందర్భంలో కృష్ణశాస్త్రిగారు సన్మానితులయ్యారు.

కృష్ణశాస్త్రిగారి 77వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకుని హైదరాబాద్ ఆంధ్రమహిళాసభ 1974లో సన్మానించి విజయదుర్గ ప్రత్యేక సంచికని వెలువరించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం 1975లో కళాప్రపూర్ణ బిరుదాంచితులని చేసింది.

పేపులపల్లి సన్మాన సంఘం యేర్పడి శ్రీ పి. వి. రమణయ్యరాజా కార్యనిర్వాహకత్వంలో కృష్ణశాస్త్రి స్వర్ణోత్సవ సందర్భంగా ఆయన్ని మద్రాసులో 1975 మే 11వ తేదీన సన్మానించి, ఆయన వివిధ రచనలనీ ఆరు సంపుటాలుగా ప్రచురించి ఆంధ్రపాఠకలోకానికి అమూల్యకానుకలనంద జేసింది. ఆ సందర్భంలోనే కాకినాడ, ఏలూరు, రాజమండ్రీ, హైదరాబాద్ ఇత్యాది ప్రసిద్ధాంధ్ర పట్టణనగరాలలో అనేక సన్మాన సభలు జరిగాయి. ఆమేడే తెలుగు ప్రపంచ మహాసభలలో ఆంధ్ర ప్రభుత్వము ఆయనని ఘనంగా సత్కరించింది. భారత ప్రభుత్వం ఆయన ప్రఖ్యాతిభావ్యుత్పత్తులని గుర్తించి 'పద్మభూషణ్' బిరుదుతో అలంకరించి తననుతాను భూషించుకుంది.

1978 ఫిబ్రవరిలో హైదరాబాద్‌లోని వంశీ ఆర్ట్స్ థియేటర్సు, మార్చి 5వ తేదీని 'సంక్రాంతి' సాహితీసంస్థ, 'భాషాకుటీర', 'ఉజ్జీవని' సంస్థలు కృ.శా.గారిని సన్మానించాయి. ఆ నెలలోనే కాకినాడ పిఠాపురంలలో ఘన సన్మానలందుకున్నారు కృష్ణశాస్త్రిగారు. ఒకప్పుడు ఆయన్ని వెలివేసిన పిఠాపురమే ఆయన కవితాప్రతిభకి చేతులు జోడించి ఊరేగించి సన్మానించింది. ఇలా ఆయన పరమపదించే వరకూ సన్మానించని సాహితీ సంస్థగాని, సంభావించని ప్రసిద్ధాంధ్రపట్టణంగానీ లేదనడకు సత్యదూరం కాదు.

సమకాలిక కవులెందరిల కృతిసమర్పణలందుకున్న భాగ్యశాలి కృష్ణశాస్త్రిగారు. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు "విశ్వవీణ", శ్రీ ఆవంత్స సోమసుందర్ "మా ఊరు మారింది", కలపటపు రామగోపాలరావు "కామే-శ్వరి" కావ్య సంపుట, కొమరవోలు వెంకటసుబ్బారావు 'రాగసుధ' కృతి, మేడిపల్లి లక్ష్మీకాంతం "నా కవసము" అన్న కృతులని శ్రీమతి మాధవీలత 'రణ తరంగమగువ' అన్న నవలనూ, శ్రీమతి కోడూరి దుర్గానాగరాజ్ 'రాగర-వళి' అన్న గీత సంపుటిని కృ.శా.గారికి సమర్పించి తమకు ఆయన మీదున్న భక్తిప్రపత్తులని ప్రకటించారు.

కృష్ణశాస్త్రి కవితావైశిష్ట్య -మాధుర్యాలపై ప్రశంసాత్మక వ్యాసాలను కవి పండిత విమర్శకులెందరో విభిన్నకాలాలలో అనేక భాషా పత్రికలలో ప్రచురించారు. థాట్ అనే పత్రికలో డి. అంజనేయులుగారు, హిందూ పత్రికలో పాలగుమ్మి పద్మరాజుగారు మొదలైనవారు ఆంగ్లంలో వ్రాసిన వ్యాసాలు దేశాంతర ఖ్యాతిని అయనకి కలిగించాయి. వాటిల్లో ఆయన కవితలను కూడా ఆంగ్లీకరించడం జరిగింది. "నారాయణ నారయణ అల్లా అల్లా" మున్నగు గీతాలు ఇతర భాషల్లోకి ఆకాశవాణివారు అనువదించారు. రాయప్రోలువారి కుమారులు రాజశేఖర్, శ్రీనివాసు అనే వారిద్దరూ ఆయన కవితలలో కొన్నిటిని అను వదించి ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో ప్రచురించారు. 'స్వరాజ్య' ఎడిటరు ఏ. ఎస్. రామన్‌గారు అనువదించినవి కొన్ని ఉన్నాయి. డి. అంజనేయులగారి భార్య శ్రీమతి హేమలత హిందీలోకి ఆయన పాటలని అనువదించారుట. శ్రీపెను మత్స అప్పలరాజుగారు "పంత్"తో కృ.శా.గారిని పోలుస్తూ తులనాత్మక పరిశీలనావ్యాసాన్ని హిందీలో రచించారు. 1978 ఫిబ్రవరిలో "కృష్ణశాస్త్రి కృతుల పరిశీలన" అన్న అంశంపై పరిశోధనాత్మక గ్రంథాన్ని రచించి ఈ వ్యాస రచయిత్రినైన నేను ఉస్మానియా విశ్వవిద్యాలయం వారిచేత డాక్టరేటుపట్టానొందాను.[1] అందులో విభిన్న ప్రక్రియలకి చెందిన కృష్ణశాస్త్రిగారి వివిధరచనల్లోని లక్షణాలనీ, సౌందర్యవైశిష్ట్యాలనీ, రచనల్లో ప్రతిబింబించే ఆయన వ్యక్తిత్వౌన్నత్యాన్నీ విశ్లేషణాత్మకంగా నిరూపించడం జరిగింది.

కృష్ణపక్ష స్వర్ణోత్సవసంచికవారు వివిధ పత్రికలలో పడిన కృష్ణశాస్త్రి గారిపైని వ్యాసాలను సేకరించి వాటిలో విశిష్టభాగాలని కృష్ణపక్ష స్వర్ణోత్సవ సంచికలో ప్రకటించారు. ఆచార్యమామిడిపూడి వెంకటరంగయ్యగారు తమ శిష్యులైన కృష్ణశాస్త్రిగారి కవితని పోతన కవిత్వంతో పోల్చారు. రాయప్రోలు "ఆయన చిత్తవృత్తి, కవిత్వం పారిజాతపుష్ప సదృశ కోమలమైనవ"న్నారు.

---

1. డాక్టరేటు పట్టాకన్నా కృష్ణశాస్త్రిగారు సంతృప్తులై అందించిన ప్రశంసాశీస్సులు నాకెక్కువ ఆనందాన్నిచ్చాయి - వ్యాస రచయిత్రి నిర్మలాదేవి.

కవిరాజహంస, కవికులాలంకార బాలాంత్రపు వెంకటావుగారు "సరస వచశ్శ్రీమంతుని, సాధులోకసేవా దీక్షాసామంతుని, కావ్యకళాదీమంతుని, కావ్యకళాధీమంతుని" అంటూ కీర్తించారు కృష్ణశాస్త్రిని.

కవి సామ్రాట్టు విశ్వనాథ "ఆంధ్రా షెల్లీ, తెలుగులతాగూరుగా పేర్కొంటూ "భావకవిత్వానికి రూపమిచ్చి పెంపొందించినవాడు కృ.శా."యే అంటూ "అచ్చంగా భావకవిత్వమే వ్రాస్తాడు. ఎవరూ అతనిని అందుకోలేరు. అతనికాంతే ఈ సౌధమంత" అంటూ ప్రశంసించారు. దివాకర్లవారు, జోగారావుగారు ఆధునికాంధ్రసారస్వతవనవాటి కనవరత వసంతో దయాన్ని కల్పించిన అపూర్వకాకలిగా సంభావించారు. సంజీవదేవ్ ఆయన్ని మౌలిక మధుర కవిగా నుతించారు. "వారి కృష్ణపక్షం మహాకావ్యం, వారి భావగీతికలు అమృతగుళికలు, వారి ఉపన్యాసఝరిణి నయగారా జలపాతం" అంటూ స్తుతించారు పెద్దాడ సత్తిరాజు, చలం కృష్ణశాస్త్రి కవితను గొప్పకవిత్వంగా భావిస్తూ జయదేవుడి అష్టపదులతో పోలుస్తూ "మాటల అర్థంతో ఎంత చెప్తాయో, ధ్వనితో, సంగీతంతో అంతకన్నా ఎక్కువ చెప్తాయన్నారు. ఇంద్రగంటి ఆయన కవితలని 'రసగుళికలు'గానూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'మహాకవి'గానూ అబ్బూరి తెలుగు పలుకు ఒళ్ళకు జీవంపోసి విలక్షణమైన మేళవింపుతో కొత్తదనాన్నీ కమ్మదనాన్నీ ధ్వని సంపదనీ కల్పించి కావ్యప్రౌఢిని పాటించే శిల్పంలో అనితరసాధ్యమైన ప్రతిభను చూపిన వారుగా" స్తుతించారు. మల్లవరపు "సారోకి ఆర్ట్ థియేటర్లో స్టార్డమ్ని చేకూర్చినవారుగా" పేర్కొన్నారు. దాశరథి "మాట వీణపై పాట పాడించిన వారి"గానూ, ఆచార్య సి. నా. రెడ్డి ఆయన కవిత 'సౌకుమార్యమాధుర్యాలకి పరమసీమ'గా ఉగ్గడించారు. శ్రీ తారకంగారు బ్రహ్మగీతోపాసకుడిగా పేర్కొంటే డి. అంజనేయులు కాటూరి పర్ఫెక్షనిస్టుగా, లిరికల్ జీనియస్'గా శ్లాఘించారు. పాలగుమ్మి పద్మరాజు "ఛాంపియస్ ఆఫ్ న్యూ పొయెట్రీ'గా సంభావిస్తే" కొంతమందిది యువత, మరి కొంతమందిది నవత కృష్ణశాస్త్రిది కవిత గా కీర్తించారు ఆరుద్ర, శంకర కురుప్" కృ.శా.గారు తెలుగు భాషలో కావ్యరచన సాగించి జాతీయతాదృక్పథము, కవితాదృష్టి, షెల్లీ భావుకతా నాదమాధుర్యాలతో కూడిన ఆయన కవిత్వం

భారతీయ సాహిత్యాన్నే సుభిక్షంగా విస్తోందన్నారు. కృష్ణశాస్త్రి 'ఊర్వశి'లో విశిష్టుడై కనిపిస్తాడంటారు రాయప్రోలు. బుచ్చిబాబు కృష్ణశాస్త్రి కవిత తన కిష్టమంటాడు"[1] ఇలా పలువురి ప్రశంసానీరాజనాల నందుకుంటూ సంపూర్ణాయుష్మంతుడిగా జీవనసాహిత్య ప్రస్థానాల్ని సాగించి 1980 ఫిబ్రవరి 24వ తేదీన మద్రాసులో దివంగతులయ్యారు కృష్ణశాస్త్రి.

## అంజలి

"మోయలేనింక లోకాల త్రియదనము.

"అలపింతుసానంద తేజోంబునిధుల" నంటూ దివ్య లోకాల కరిగిన కృష్ణశాస్త్రిగారి వియోగానికి ఇట చెమ్మగిల్లని నయనంలేదు. వేదనా తప్త హృదయాలతో కవులు, విమర్శకులు, పండితులు ఎందరో స్మృతి కావ్యాలనాలపించారు. ఆయన కవితాప్రతిభని నెమరేసుకున్నారు. మద్రాసు, హైదరాబాద్ మొదలైన మహానగరాలలోనూ బెజవాడ, గుంటూరు, కాకినాడ, విశాఖపట్టణం మొదలైన పట్టణాలలో సంతాపసభలు జరిపి స్మృత్యంజలులు సమర్పించారు. తెలుగునాటలోని వివిధ పత్రికలలో ఆయన సాహిత్య వ్యక్తిత్వవైశిష్ట్యాలను గూర్చిన వ్యాసపరంపరలు ప్రచురితమయ్యాయి.

"ఆంధ్రదేశపు నిలువుటద్దం ఒద్దలయింది
షెల్లీమళ్ళీ మరణించాడు
వసంతం వాడిపోయింది"[2] అన్న శ్రీ శ్రీ సంతప్తహృదయం కృష్ణశాస్త్రిగారి మహోన్నత మనోహరి కవితామూర్తి సమగ్రచిత్రాన్ని విష్కరిస్తుంది.

---

1. కృష్ణపక్ష షష్ట్యబ్దోత్సవ సంచిక
2. 'విశాలాంధ్ర ఆదివారం అనుబంధం 9.3.80

# కృష్ణశాస్త్రి కృతులు

## ఖండకావ్యాలు :—

1. కృష్ణపక్షము సంపుటి అంకితం "సూర్యారావుబహద్దరు"కి
2. ప్రవాసము ,, ,, "రామమూర్తి"కి
3. ఊర్వశి ,, ,, "ఊర్వశి"కి
4. నిశ్రేణి ,, ,,
5. పల్లకి ,, ,, శ్రీ ఆచంట జానకిరామ్

## బ్రహ్మసమాజ కృతులు

1. మహతి గీతసంపుటి
2. పద్యావళి
3. ఋగ్వీథి (అనువాదం) అంకితం "తారకం"గారికి

## తిరుప్పావు

అనువాదం ,, దేశముఖ్ దంపతులకి

## గేయనాటికలు

1. శర్మిష్ఠ సంపుటి:- గేయాత్మకం "బెజవాడ గోపాలరెడ్డి"గారికి
   1. శర్మిష్ఠ
   2. కృష్ణాష్టమి
   3. యమునావిహారి
   4. ఏడాది పొడుగునా
   5. గౌతమి
   6. వేణుకుంజం

2. ధనుర్దాసు సంపుటి భక్తిరసాత్మకం "పి. వి. రాజమన్నారు"కు

1. ధనుర్దాసు
2. సాయుజ్యము
3. గుహుడు
4. శివక్షేత్రయాత్ర

3. శ్రీ ఆండాళ్ళు తిరుప్పావు సంపుటిలోనిది.

## "శ్రీ విప్రనారాయణ"

యక్షగానము

## గీతసంహిత :—

1. లలిత గీతాలు
2. సినిగీతాలు మేఘమాల "సంపుటి అంకితం" బి. ఎన్. రెడ్డికి

## వేమన పద్యాలు

## అమృతాంజన గీతం

## సంగీత రూపకాలు :—

సంగీత రూపకాలు :- ధనుర్దాసు, శర్మిష్ఠ సంపుటులలో చేరనివి.

1. అతిథిశాల
2. కొత్తకోవెల
3. రాజఘట్టం
4. చౌరస్తా
5. ఋతుచక్రం.

## వచనరచనలు :—

### I "అప్పుడు పుట్టిఉంటే"

సంపుటి - అంకితం - "పి. వి. రాజమన్నారు"కు

1) ఏకాంతసేవ పీఠిక
2) పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం
3) అప్పుడు పుట్టిఉంటే
4) బసవరాజు అప్పారావు మధురస్మృతి
5) అన్నమాచారి.

### II "బహుకాల దర్శనం"

సంపుటి - అంకితం - శ్రీ "కాటూరి వెంకటేశ్వరరావు"కు

1) బహుకాల దర్శనం
2) అవ్వ తిరునాళ్ళలో తప్పిపోయింది
3) రిక్షావాలా
4) మైలురాయి.
5) బూట్ పాలిష్
6) అవ్వబస్సు ప్రయాణం
7) ఇద్దరు సత్యవాదులు,

### III "పుష్పలావికలు"

సంపుటి - అంకితం - "నూరినారాయణమూర్తి, మహాలక్ష్మమ్మగార్ల"కు

1. పుష్పలావికలు
2. కోవెల-కొలను
3, సువాసనద్రవ్యాలు
4. మాడీరు పోయింది

5. మాఊళ్ళో వీధి అరుగు
6. శ్రీ కృష్ణావతార తత్త్వము
7. గుహుడు
8 మలుపు తిరిగితే.

## IV వ్యాసాలు - ఉపన్యాసాలు

1. "ఆకలి" రేడియో ప్రసంగం-1938 అక్టోబరు 15
2. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల తృతీయ మహాసభ అధ్యక్ష పీఠాన్నుంచి ఇచ్చిన "రామున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి" అన్న ప్రసంగం 1946 మార్చి.
3. కాకినాడ సరస్వతీగానసభ స్వర్ణోత్సవ స్వాగతోపన్యాసం 1948.
4. అసత్యమనే గడియ తొలగించి నిర్భీతిగా నిజం పలకాలి 1964 ఆగస్టు 14 విశాలాంధ్ర.
5. "మళ్ళీ ఆ రోజుల జ్ఞాపకాలు" కాకినాడ సభ 1966.
6. తూర్పు గోదావరి జిల్లా రచయితల మహాసభ ఉపన్యాసం 11-1-70.
7. వీరేశలింగం 122వ జయంత్యుత్సవసభా ప్రసంగపాఠం 28-6-70 రాజమహేంద్రవరం.
8. వంశీ ఆర్టువాళ్ళ సన్మానసభా ప్రసంగపాఠం (కృ.శా. స్మృతులు) 1978 ఫిబ్రవరి.
9. సంక్రాంతిసన్మాన ప్రసంగపాఠం - మార్చి 1978.
10. "బైరాగి"పైని వ్యాసం ,, -ఫిబ్రవరి 1980.



# తప్పు ఒప్పుల పట్టిక

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 3 | భాపొషణ | భాషాపోషణ |
| | కకిపాటలు | కలికిపాటలు |
| 4 | వారిన్దరూ | వారిద్దరూ |
| | తమన్న | తమ్మన్న |
| | సుబ్బరాయ | సుబ్బరాయ |
| | యతిరావిజయూన్ని | యతిరాజవిజయూన్ని |
| 5 | స్తీల | స్త్రీల |
| 7 | రామినుజచార్యులు | రామానుజాచార్యులు |
| 12 | కతమై | కృతమైన |
| | తిప్పారావు | తిరుప్పావు |
| | డాకరు | డాక్టరు |
| | హీనానంగానీ | హీరానందానీ |
| 15 | బ్రహ్మ | బ్రహ్మ |
| 16 | యమ్రావు | యవ్వనము |
| 20 | రామహేంద్రవరం | రాజమహేంద్రవరం |
| 20 | రుహనీయులై | మహనీయులపై |
| 24 | చంద్రదత్ | రమేశ్ చంద్రదత్ |
| 26 | అనుసర | అనుసరణ |
| ” | ప్రతిపించాల | ప్రతిబింబాలు |
| ” | వెపికటరత్న | వేంకటరత్నం |
| 26 | పంపకము | పంకము |
| 27 | తిప్పారావు | తిరుప్పావు |
| 29 | బోస | బోలిన |
| 29 | అలంకాను | అలంకారి |
| 31 | సహం | సహజం |
| 41 | యాత్రాలోని | యాత్రలోని |
| 43 | భౌలక | భౌతిక |
| 47 | గాడు | గారు |
| 48 | కవిర | కవిత |
| 55 | పీది | పీఠి |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 68 | దక్షిణాం | దక్షిణాంధ్రీ |
| 71 | వృద్ధాప్యం | వృద్ధాప్యం |
| | శార్ధక్యాన్ని | వార్ధక్య |
| 74 ఫుట్‌నోట్స్ | ఉమ్మజాతర | అమ్మజాతర |
| 78 | పకిన | పలికిన |
| 79 | దూరంచుచి | దూరంనుం |
| 80 | కృష్ణశాస్త్రే | కృష్ణశాస్త్రి |
| 81 | ఉపబలగా | ఉపబలకంగా |
| ,, | తిరుపా్వరాపు | తిరుపా్వపు |
| 84 | భాజఘటం | రాజఘట్టం |
| 85 | అనుగుణ | అనుగుణంగా |
| 89 | రవూసేటి | నవూసేటి |
| 92 | లతపరి | లలితపరి |
| 98 | కరుగా | కరుణింప |
| 109 | శయ్యుబ్దప్ప | శతాబ్దపు |
| 100 | ద్యోనూ | ద్యోతక |
| 110 | ప్రకతి | ప్రకృతి |
| 110 | వత్తిపులు | వస్తువులు |
| 110 | ఉపి ఉపి | ఊపి ఊపి |
| 110 | నొక్కిక్క | నొక్కొక్క |
| 110 | ఖండిసి | ఖండిక |
| 118 | నష్టల | ద్రష్టల |
| 126 | కృష్ణ | తృష్ణ |
| 126 | కలిగిస్తుందిసేది | కలిగిస్తుందనేది. |
| 127 | శోకశ్లోక | శోక శ్లోక |
| 135 | సలవాస | వాసనల |
| 145 | బహోకాల | బహుకాలె |
| 150 | కొసమెరుపుల | కొసమెరుపులు |
| ,, | దేవాతను | దేవతను |
| ,, | పెద్దపై | పెద్దవనై |
| 159 | సన్మనల | సన్మానాల |